మ. పరివాదాస్పదవాదమోద మదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొందఱీపొందెఱుం
గరుకై లాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరిఁ బాపుట మహామోహంబు ద్రోహంబగున్.

సీ. కోటసింగారించి క్రొత్తళంబుల నెల్ల నట్టళ్ళు పన్నించి యాళువరికిఁ
బందిళ్లు వెట్టించి పైకొమ్మ వెట్టించి గుండుదూలము వసికొయ్యదూర్చి
యగడిత లోఁతసి రలవడఁ ద్రవ్వించి వెలిఁజుట్టి రాములు వెలుగు వెట్టి
దంచనంబులును దద్దడములు నెత్తించి బలుగాడితలుపులు బలుపుసేసి

గీ. పాళెములెత్తి కొంకులు బ్రద్దబరులు
గత్తిగొంతంబు లొడిసెళ్ళు గత్తళములు
నారసములును విండులు నగరిలోనఁ
బెట్టి పెట్టుఁడు నడునెట్టి మట్టిలావు.

సీ. కుజము కుంజరముచేఁ గూలునో కూలదో
కూలుకుంజరము నీకుజము గూల్చె

... ... ... ...

సీ. వంకదారకుఁ జేరి వాకిటిదద్దడంబులు సేర్చికొమ్మల ద్రోపువైచి ...

చ. కనరి కుమారు లంత శశికాంతశిలాతలశీతలస్థలీ
వనఘన పాదపాదపనివారిత వారితరంగరంగన
ర్తనపరివర్తనద్విరదదానసదానమదాళిమాలికా
తనువనజాతనూతనపతాకముఁ బుష్కరమన్ తటాకమున్.

మ. కలరా యింతకుమున్ను యాదవులచేఁ గప్పంబు దెప్పింపఁగాఁ
గలరారాజులు గాజులం దొడవుఁగాఁ గల్పించిరా కాకులం
గలకంఠంబులఁ జేసెనా కటకటా గౌరీశ్వరుం డేమిగాఁ
గలవారో యిటమీఁద హంసడిభకుల్ గర్వాంధకారంబునన్.

సీ. పసిఁ గేవుఁ బెనుచు నేపాడిమొల్లం బెట్టు
మెకముదాఁటదుగదా మేఁపుగలదె
తోడకాలితరుపుల విడుతురా తోడితోడి
జన్నెల తరపట్టు జాడ గలదె
వెలికల్లనై తురా వేల్పులఁ గుడుపుచోఁ
గదుపులో, నేబోతు గడవబాఱు
సలిగపన్నులు గొన్ని జట్టిచూపరుగదా
బెదరిన నిలుగూఁతఁ బెట్టఁగలదె

గీ వల్లవైచువా రెవ్వరు మల్లరాల
లంపుగలతోఱ్ఱులను గూయులావుగలదె
యేర్పుదాటులలో దాఱ గెఱుఁగఁబడునె
పరికరము కోడె లమ్మోదుపాటి గలదె.

చ. తలిరులఁజోఁకెనో దొనలఁ దాఁకెనో తొండపుఁ బిండుబ్రాఁకెనో...

చ. గెలిచినవాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ దద్గజేంద్రమున్
వెలిచినవాఁడు దేవతలవెట్టికిఁ బట్టినవాఁడు ధూర్జటిన్
విలిచినవాఁడు భక్తిమయవిత్తమునన్ ధర నేకవీరుఁడై
నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుండు భయంబిదేటికిన్.

ఉ. నావుఁడు రోషవహ్నివలనం బొగరేఁగినభంగి మోమునన్
గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ బాణుఁ
డత్యావిలచిత్తుఁడై మనుజుఁడట్టె మదీయపురంబుఁ జొచ్చెన
చ్చేవయ కాక నానగరు చెర్చె నిసీ మగమాట లేటికిన్.

సీ. బాలార్కబింబంబు పరఁగించి లేమెండ
మనమీఁదఁ జల్లినమాయ లేదు
కొంతంబు మెఱుఁగులు గుప్పించి మెఱుఁగులు
మనమీఁదఁ బొలసినమహిమ లేదు

... ... ... ..

చ భయరసమగ్నులం బ్రధనభగ్నుల దుర్భరదైన్యభుగ్నులన్
నయనవిలగ్నుల న్నివసనాయితనిర్వ్రతనగ్నులం బరా
జయపరివిగ్నులం బ్రణతిసారవలగ్నుల నగ్నులం బిలే
శయశయనుండు చూచి చనసాగె గిరివ్రజరాజధానికిన్.

శా. రాకాచంద్రికఁ దేల్చినట్లు ఘనసారంబుం బయి గూర్చిన
ట్లాకాశాపగనీర వార్చినటు లాత్మానందయోగామృతం
బేకాంతస్థితిఁ గ్రోల్చినట్లు హరిచే నింపారునాలింగన
స్వీకారంబున శీతలాంగధరుఁడై సీరాయుధుం డుండఁగన్.

ఉ బాణుఁడు వీఁడె మంత్రయుతబాణుఁడు దానవశూరసైనిక
త్రాణుఁడు శంకరస్తుతి పరాయణుఁ డుజ్జ్వలరోషదీప్తదృ
క్కోణుఁడు సంగరస్ఫురితకోపపరాబ్ధఘటావళీజగ
త్ప్రాణుఁడు యుద్ధవిశ్రుతపరాక్రమ రౌద్రరసప్రమాణుఁడున్.

ఉ. ఏమిర బాణ వ్రీళలవహీన భయాతురమానసంబుతో
నే మని పెక్కులాడెద వి దేటికి మాటలచేత నీవు సం
గ్రామము గెల్వవచ్చునె వికారపుమాట జయంబ మైన నిం
కేమియు నేల భాషితము లెక్కుడుగాఁ బచరింపు మాజిలోన్.

సీ మానినీమంజుల మంజీరకరరవ కేళీసరోహంసకీలితంబు
కామినీకాముకకలహప్రసాదనపండితశారికాభాసురంబు ...

పోతనామాత్యుఁడు తనభాగవతమున వర్ణించిన నరకాసుర సంహారమును, నాచనసోమనాథుఁడు వర్ణించిన నరకాసురసంహారమును, గొన్ని విషయములఁ బోలియున్నవి. విస్పష్ట మగుపోలికఁ జూపుపద్యములఁ గొన్నింటి నిచ్చుటఁ బొందుపఱచెద.

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై

తొరఁగం, బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

ఉత్తరహరివంశము, ఆ. 1—162.

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్గన్నులకెంపు సొంపు పరఁగం జంద్రాస్త్రసందోహము
న్సరసాలోకసమూహము న్నెరపుచుం జంద్రాస్య హేలాగతిన్.

(భాగవతము, దశమస్కంధము.)

నాచనసోమనాథుని కవిత్వము స్వతోజాతం బగుసాంద్రారణ్యం బువలెఁ గాక, వనపాల కృతాలవాలకలితంబై లతాగృహారమణీయంబై నానావిధపుష్పఫలభరితంబై సుమనోమనోజ్ఞంబుగ నున్నది. ఆంగ్లేయ వాఙ్మయమందు స్పెన్సరు (Spenser) కవి రచించిన ఫెయిరీ క్వీన్ (Fairie queen) అనెడు గ్రంథ మర్వాచీనకవులకు మార్గదర్శక ముగ నుండెను. ఆకారణమున స్పెన్సరు మహాకవికి 'కవీనాం కవిః' (The poet's poet) అను గొప్పపేరు వచ్చెను. అట్లే నాచన సోమ నాథుఁడును గవితావైభవమును విచిత్రగతుల మిగుల వెలయింపఁజేసి తరువాతికవుల కాదర్శకుఁ డాయెను. తత్కారణమున నీ మహాకవికిని 'కవీనాం కవిః' అను బిరుదము పాత్రియికంబుగ నొసంగదగు.

ఉత్తర హరివంశమునందలి వచనభాగములు శ్లేషయమకాది శబ్దాలంకారములతో నిబిడీకృతములై బహుక్లిష్టముగానుండును. సోమ నాథుని పద్యశైలికంటె వచనశైలియే యెక్కుడు కష్టముగా నున్నది. వచనభాగము తఱుచు యుద్ధవర్ణనలయందుఁ గన్పట్టును. అందలిశైలి సుశిక్షితమైన తురగమువలె బహుచతురగతుల నొప్పుచున్నది. ఒకా నొకచోట సమపతన ఖురఘట్టనమువలె నుభయసైన్యములు సమాన యానంబున దార్కొని మార్కొనుటయు, మఱియొకపట్టున వల్గితగతిని

యోధవీరులు మల్లయుద్ధంబునఁ జేరి యన్యోన్యవిజిగీషులై మలఁగి పెనఁగి తల్లడిల్లుటయు, వేఱొక్కతావున సంచలితచమూనిచయంబులు పరిదేవనధ్వానంబులఁ బరిధావనం బొనర్చుటయు, నిట్లు సమరసంచార భేదంబు నుచితశైలిగతిభేదంబుల నిరూపించుచు సర్వజ్ఞుఁడగు నిమ్మహాకవి శబ్దజాల పరంపరల సంగ్రామసంభ్రమనిర్ఘోషంబుల ననువదించెను. పై యంశములకు దృష్టాంతముల నీ క్రిందఁ జూడనగు.

శ్లేషయమకాదులు:—

"మఱియుం దదాశ్రమంబు వలాహకంబునుంబోలెఁ గరకాస్పదంబై కుంజరంబునుంబోలెఁ గుంభాభిరామంబై రంగస్థలంబునుంబోలె శైలూషశతరమ్యంబై యింద్రపదంబునుంబోలె నైరావతరుచిరంబై తరుణీముఖంబునుంబోలెఁ దిలకవిరాజితంబై పరమయోగిహృదయంబునుంబోలె మోక్షనిలయంబై పారావారంబునుంబోలె నమృతోత్పాదనస్థానంబై మహాభారతంబునుంబోలె శతపర్వసనాథంబై గగనంబునుంబోలె ఋక్షగణసంకీర్ణంబై కర్ణరథంబునుంబోలె శల్యాధిష్ఠితంబై ..."

సమగతి:—

"ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడికయ్యంబునం గదిసి కరులుకరులను దేరులుదేరులను దురంగంబులుదురంగంబులను బదాతులు పదాతులనుం దలపడి సందడికయ్యంబయ్యె నయ్యెడఁ గత్తివ్రాతియమ్ములం గత్తరించినం దుత్తుమురు లగుకత్తళంబులును ఘనగదాఘాతంబులం జిదుప లయినసీసకంబులును..."

వలితగతి:—

"ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలు గట్టి గట్టిమొయిమరువులు చించియుఁ, గాయంబుల నొంచియు, మర్మంబులు గీఱియు, మహీతలంబులు దూఱియు, శ్రేవులు వెఱికియు, బెనుమూకల కఱికియు, సీసకంబులు వగిలించియు శిరంబులు నొగిలించియు,

గై దువులు గఱచియుం గరవాలంబులు చఱచియు, నెత్తురులు చిమ్మియు నోసళ్ళు గ్రుమ్మియుఁ, జరణంబులు తొలిచియుఁ జర్మంబు లొలిచియు, బాహుదండంబులు గత్తెఱించియు ....."

యుద్ధవర్ణన లెంత వీరరసోద్రేకముతోఁ బొంగి పొరలుచుం డునో ప్రతియాశ్వాసంబునఁ గానవచ్చును. తిక్కనసోమయాజి తరు వాత యుద్ధము వర్ణించుటలో నీ కవియంత సమర్థుఁడు వేఱొకఁడు గానరాడు. భయము, ఉత్సాహము, కోపము, శౌర్యము, ఆటోపము, అహంకారము, మున్నగుభావములు యోధవీరులమనంబులవలెఁ జదు వరుల మనంబులఁగూడ గజిబిజియొనర్చి సమరకౌతూహలంబుఁ బెం పొందఁజేయును,

హాస్యరసము వర్ణించుటయం దీకవి కెంతనేర్పుగలదో తెలిసి కొనుటకు దగినయవకాశము లీగ్రంథమునఁ గానరావు. ఒకానొకచోట మాత్రము హాస్యకరుణరసమిశ్రిత మయిన భావముసు గడుఁజిత్రముగ నిరూపించియున్నాఁడు. డిభకుఁడు మునిఁగి చచ్చినతనయన్నయగు హంసునికొఱకై వెతకుచు నిట్లు విలపించెనట:—

క. వ్రేలెడువెండ్రుక లిరుగడఁ, దూలఁగఁ దలయూఁచుఁ దొప్పతొప్పన
నోరుం
గేల నడిచికొను సెలవుల, లాలలు దొరుఁగంగ నన్నలా యని
యొఱలున్.

క. రాలం దల యడిచికొనునన్, నేలంబడి పొరలు లేచు నెత్తురు
లుమియుం
గేలిఁబడి రిపులు చూడఁగ, నాలుక వెఱికికొనుఁ జావునకుఁ దన్ను
కొనున్.

ఇంక శృంగారరసకవన మీకవినోటనె వినవలెను. ఔచిత్యాని యము మొకించుకయుఁ దప్పక, పేరున కైన నశ్లీలము చెంత బోక,

పాత్రపోషణము కడుఁబ్రశస్తముగాఁ బరిపాటించుచుఁ గ్రమకమోదిత ముగ, రసోద్ధతిఁ బ్రకటించుచుఁ దుద కుద్వేలరసాంబుధిలోఁ బాఠకుల ముంచివేయును. పాత్రోచితభాషావిషయమున నూర్వశీనరకాసుర సంవాదమును జూడుఁడు:

క. పగవాఁడట దేవేంద్రుఁడు, మగువా! నీవతనికొలువు మానిసివఁట,నిం
దగవుచెడి పిలువఁ బనుచుట, మగతనమే?యిట్టిలంజమాటలుగలవే?

ఊర్వశి: ఉ. లంజియ నేఁడు నేను వినుఁలావున నీ వమరేంద్రుఁగెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితిగాక, చిత్తమె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవిచేరునె? చిల్కవోయినం
బంజర మేమిసేయు? రసభంగముసంగతి లోన మెత్తురే?

ఉ. నవ్వులమాటలో నిజము నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడుమానిను లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్న గడసాని ననుం గవయందలంచితే
పువ్వులు వేడుకైనఁ గడివోయినవే న్మృదువంగవచ్చునే?

నరకాసురుఁడు :

క. అంజెదవుగాక ననుఁ జెం,
తంజేరఁగనీక యెంత తఱిఁగిన మిరియా
లుం జొన్నలసరిపోవే!
లంజెతనములందుఁ గొమిరెలకా గెలువవఁటే.

నరకాసురుని మొఱటుతనమును, ఊర్వశియొక్క చాతుర్యవిలసితభావ గాంభీర్యము నెంతచమత్కారముగా వర్ణించెనో చూడుఁడు.

మఱియు నిందుధరోపాఖ్యానమునందును, ఉషానిరుద్ధీయము నందును, శృంగారాభివర్ణన ముత్తమోత్తమకవిత్వలక్షణముల నొప్పారుచున్నది. శబ్దములమాధుర్యమూ, భావగర్భితమగు ధ్వనియూ, వర్ణల స్వభావమూ, చిత్రితరూపముల సౌందర్యమూ, రసోత్సేక మగుసర్వేం

ద్రియతాగసమృద్ధియూ, దేనినిఁ జూచినను బాఠకులకుఁ దనివి దీరనిశ్రృం గారరసానుకంపన మొసఁగుచున్నవి.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌర కేసరములన్ రంజిల్లు మాధ్వీక వా
ర్లహరీస్వేదము చూపఁ పట్టపగ లేలా యింతటన్ సిగ్గు లే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమూఁకల్ ముద్దరా లయ్యెడన్,
ఆ. 5 ప. 52

ఉ. చెందొవరేకు ఫాలమునఁ జేర్చి ప్రఫుల్లపయోరుహంబుచే
నందముగా బిసావళి భుజాంతరముం గదియించి యుత్పలా
మందమరీచిమేచక చమత్కృతిచారుగళోపచార మై
సుందరి యోర్తు వచ్చి హరుచూపులకున్ హరుఁ డయ్యెనయ్యెడన్.
ఆ. 5 ప. 71.

ఉ. కెందమ్మిమీఁదఁ జెందొవకు డెప్పర మేమియు లేదు; చన్నులం
జిందదు ఘర్మవారి; చెవిఁ జేర్చినలేఁజివు రించుకంతయుం
గందదు; నాసికాగ్రమునఁ గన్నుల కావ్పము లూర; వింక నీ
సుందరిఁ గావ నేరఁడు ప్రసూనశరుం డని యార్తమూర్తులై.
ఆ 5 ప. 184.

నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడ,

ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వోత్తరభాగయుత మగుహరివంశము నంతయుఁ దెనిగించె ననియు, నాచనసోముఁ డందలి యుత్తరభాగమును మాత్రమే తెనిఁగించె ననియు నిదివఱకే తెలుపఁబడినది. ఈ యుభయకవులును గొంచె మించుమించుగా సమకాలికు లగుటచేతను, ఒక గ్రంథమందే వారికవితావైభవమును గనఁబఱుచుటచేతను వారి గ్రంథ రచనాపద్ధతులయొక్కయుఁ గవితాస్వరూపముల యొక్కయు సామ్య భేదములను నిరూపించుట సందర్భోచితము.

హరివంశము భారతమున కనుబంధ మనియు నది తెనిఁగింపఁబ డనిచో నాంధ్రభారతము సమగ్ర మని చెప్పుట కవకాశ ముండ దని యు నాశయముతో నెఱ్ఱాప్రెగ్గడ హరివంశమును సంపూర్ణముగాఁ దె నిఁగించి భారతామ్నాయము నాంధ్రావళికిఁ బూర్తిచేసినట్లుగాన్పించు చున్నది.

క. భారతపరాంశమని యిం, పారఁగ జెప్పుదురు బుధులు హరివంశము నీ వారమ్యకథఁ దెనుంగున, ధీరోత్తమ! నిర్వహించి తెలుపుము మాకున్. అని కృతినాయకుఁ డగు పోలయవేమారెడ్డి యెఱ్ఱాప్రెగ్గడ తోఁ జెప్పెనఁట. కావున నాంధ్రభారతవిధానక్రమము ననుగమించి యాంధ్రజనుల కుపయోగించునటు లెఱ్ఱన హరివంశము రచియించె ననుట సర్వసమ్మతము. ఆంధ్రభారతరచన, సార్వజనీన మగుటకుఁ గారణము లారయ, మాతృకానువర్తనము, శైలిసుగ్రాహ్యత, రసపో షణసమౌచిత్యము, మున్నగునవి ముఖ్యములు. శబ్దాడంబరము, సమా సబాహుళ్యము, క్లిష్టాన్వయము, అలంకారసంభృతి, వీనిచే శైలికాఠి న్యమును వహించిన సామాన్యజనులకు సంప్రీతి కలుగుటెట్లు? కానగ్రంథ మంతయు నాతికఠినముగాను నాతిసులభముగాను రచింపఁబడెను. అలా గునే హరివంశమును బండితపామరులకు సమానాదరణము కలుగునట్లు వ్రాయఁబడినది.

నాచనసోముఁడు హరివంశముఁ బూర్తిగఁ దెనిఁగించి భారతా మ్నాయమును సంపూర్ణముఁ గావించెడి తలంపునఁ దద్గ్రంథమును ప్రారంభింపలేదు. తిక్కనసోమయాజిని, ఆయన రచియించినభారతము ను దనగ్రంథమునందుఁ బేర్కొనుటకుముఖ్యకారణము కవిబ్రహ్మయం దతనికిఁ గలగౌరవమే యని తోఁచు చున్నది. శంభుదాసు వ్రాసినహరి వంశము; జూచి తానీగ్రంథము వ్రాయలేదని ప్రపంచమునకుఁ దెలుపుట వేఱొకకారణము కావచ్చును.

"ఏ, గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా!"— విజయవిలాసము.

ఇఁక నీ రిరువురి గ్రంథములఁ గురించియు నించుక విచారించెదము; హరివంశమునందలి పూర్వభాగమున శ్రీకృష్ణునిజననము మొదలు సాందీపునియొద్ద విద్యాభ్యాసమువఱకు నీనడుమ జరిగిన బాలక్రీడలు, సాహసకృత్యములు, రాక్షససంహారములు మున్నగునవి యభివర్ణింపఁబడినవి. ఉత్తరభాగము జరాసంధుని పరాభవముతోఁ బ్రారంభమై రుక్మిణీపరిణయము, నరకాసురవధ, పారిజాతాపహరణము, మధుకైటభహిరణ్యాక్షాదిరాక్షససంహారము, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, శివకేశవసమాగమము, పౌండ్రకవాసుదేవవధ, ఉషానిరుద్ధీయము, బాణాసురపరాజయము, బలిమర్దనము మొదలగు ముఖ్యవిషయములతో సమాప్తినొందెను. నాచనసోముని యుత్తరభాగము ముఖ్యముగా నరకాసురవధతోఁ బ్రారంభమైనది. జరాసంధునిపరాభూతియు, రుక్మిణీపరిణయము నొకించుక మాత్రము సూచింపఁబడినవి.

సీ. కడిమి జరాసంధగంధసింధురముఁ దద్బంధుమండలితోన పాఱఁదోలె
బలిమి నాగాయుతబాహు జగత్ప్రాణతనయు గదాకేలిదర్పమడఁచె
వీఁకతోడ విరాటవీరఖేలనమున ధీరుఁ బ్రలంబదైతేయుఁ జంపెఁ
దెగువ రాసభరూపు ధేనుకాసురుఁ బట్టి విన్నాణమున మేను విఱిచి
వైచె

తే. నగరపరిఖాపయఃపూరణంబు సేయ, సీరముఖమునఁ గాళిందిఁ జీరి తెచ్చె;
మెఱసి మూఁడులోకంబులమేటి మగలు, రాయనేర్తురె యాదవరాముతోడ.

ఆ. 1 ప. 8.

క. అనుటయు నాజనమేజయ, జనపతి యిట్లనియె ఋక్మి చచ్చిన మగుడం
జని యాదవనగరంబున, జనార్దనుం డేమిచేసె? సౌజన్యనిధీ!
ఆ. 1 ప. 12.

మఱియుఁ బారిజాతాపహరణముం గూర్చి సూచనయును లేదు. మధుకైటభహిరణ్యాక్షాది దుష్టరాక్షస సంహారములు భ్రాంతిగా విడువఁబడినవి. ఈ లాగున నుభయగ్రంథంబులును బరికించి నచో విషయవ్యత్యాసము విశేషముగాఁ గాన్పించును. ఇందులకుఁ గారణములు గొన్ని యూహింపవచ్చును.' సోముఁడే తన గ్రంథమున నిట్లు చెప్పియున్నాఁడు.

క. హలపాణిమహిమ చెప్పం,గలవా రెవ్వరు పురాణకథలన్ మఱియుం
దెలిసికొనుము నేఁ జెప్పక, నిలిచినచోటులు వివేకనిర్మలబుద్ధిన్.
ఆ. 1. ప. 11.

కావునఁ గ్రంథమునందలి కొన్నిభాగములు పరిత్యక్తములైన వని కవినోటనె తెలియుచున్నది. ఇట్లు కొన్నిభాగములను విడుచుటకు నాకుఁ దోఁచినకారణము లేవన:—

1. సోముఁ డుత్తరభాగమునైనను సమగ్రముగా వ్రాయ నుద్దేశించి యుండలేదు.

2. శ్రీకృష్ణునికృత్యములను మాత్ర మభివర్ణింపఁదలంచి హాలపాణిమహిమఁ జెప్పవిడిచె.

3. శ్రీకృష్ణునికృత్యములయందును, రసపోషణ సంవిధానమున కనువగు భాగములను మాత్రమె స్వీకరించెను.

మఱియు నొకవిశేషము:—ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము నందు హంసడిభకుల సంహారమును గుఱించి సూచనయును లేదు. నాచన సోమనాథుఁ డీ కథను బ్రత్యేకముగా నొక యాశ్వాసమున విపులముగ వ్రాసినాఁడు. ఈ ద్వివిధములగు గ్రహణపరిత్యాగభేదములను బరి

శోధించినచో, నుభయగ్రంథములందును విషయవ్యత్యాసములు మెం డుగఁ గన్పట్టును.

ఇంతియ కాదు. విషయమునం దెంతభేదమున్నదో, శైలి యందు నంతభేదము కాన్పించుచున్నది ఆంధ్రభారతము సార్వజనీన ముగా వ్రాయఁబడిన ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమును రచించియుండు నని తొలుదొల్తఁ జెప్పఁబడినది. అదియే నిక్కమైనచో, హరివంశము నందలిశైలి ద్రాక్షాపాకముగా నుండి, మృదుమధురరచనలతో నల రారి, సులభగ్రాహ్యముగా నుండుటకుఁ గారణము వేఱె వెదుకనక్క ఱలేదు. ఎఱ్ఱనప్రణీతమగు గ్రంథమాయన ప్రబంధమని చెప్పినను నిక్క ముగఁ బురాణమే. కావునఁ బురాణశైలినే వ్రాయఁబడినది. అసఁగాఁ గించిద్భాషాజ్ఞానులకును గ్రంథముఁ జదువ నభిరుచియు గ్రహింప సౌలభ్యమును దానియం దుండవలయును. లేనియెడ లాగ్రంథము పండి తాస్వాదనీయ మగును గాని జనావళికి రుచింపదు. సోమునిగ్రంథము మహా ప్రబంధము. అది సమస్తజనులకును సుగ్రాహ్య మగునట్లు వ్రాయఁబడినది. ఉభయ భాషాజ్ఞానమును బాగుగఁ గలిగినవారే దానిని గ్రహింపఁజాలుదురు. ఇతరుల కది దురాసదము. కావున మొద టినుండియుఁ గవిత్వపాకరీతుల నుభయకవులును వేఱు వేఱు మార్గముల ద్రొక్కిరి.

నరకాసురుఁడు దేవలోకం బాక్రమించి యూర్వశిని రావించి యామెతోఁ సల్పినసంభాషణము నుభయగ్రంథములం జూడుఁడు.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము.

మ. వరుణుం దోలితి, నర్థపుం జదిపితి, న్వైవస్వతుం గెల్చితిన్
హరిఁ బోఁజోపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చుల్మీఱ నీవింక న
న్నరవిందానన! సత్కరింపుము మనోజ్ఞానీకసంక్రీడలన్.

చ. అనఁటయు సమ్మృగాక్షి యిదియట్టిద; యంతటివాఁడ వైన నీ
పెను పసదే తలంప రిపుభేదన! సంయమికోటి భక్తితో
నిను నిఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ జేసిరేని నే
నును ముదమొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్.

ఇట్లీ రెండుపద్యములఁ గ్లుప్తముగా ముగించెను. దీనినే నాచనసోముఁ డిరువదియేడుపద్యముల నెంతరసవంతముగఁ బెంచి వ్రాసెనో గ్రంథముఁ జదివినఁ దెలియఁగలదు.

ఉ. ఊర్వశిఁ దోడితెమ్మనుచు నొక్కనిఁ బంపఁ బదుండ్రు పాటి సౌ
పర్ణసౌధవీథులయుపాంతములం దిరుగంగ నంతకుం
బూర్వసురేశ్వరుండు సురపుంగవు గద్దియమీఁద నుండి గం
ధర్వులపాట వించుఁ బ్రమదంబునఁ బొందుచు నున్నయత్తఱిన్

*  *  *  *

ఉ. తోరపుఁజన్నుదోయిపయిఁ దొంగలిఱెప్పల దాఁచి చూపు నీ
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలు వల్లఁ జొచ్చి య
చ్చేరువకంబముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపుబొమ్మవోలె నచటం గదలించుక లేకయుండఁగన్.

ఉ. ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను బాకశాసనుం
డాలములో ననుం గదిసి యంతక పాశితుబేరయుక్తుఁడై
తోలుపులంబడెన్ సతులతోడన డాఁగిరి దైత్యభీతులై
పోలఁదొలంగి తేమిటికిఁ బొత్తులదానవు నీవు తొయ్యలీ.

*  *  *  *

చ. అవు నిది వోలు వాసవుఁడు నంతకుఁడున్ వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలెదరంచు నిట్టినే
నవహితయాగభాగము లహంకృతి మైఁ గొనకున్న, నూర్వశీ!
శవకవనవ్వరే త్రిదశకాంతలు వింతలు సేయునాపనిన్.

మఱియొక దృష్టాంతము!

శ్రీకృష్ణుని కైలాసయాత్రసందర్భమున శివకేశవు లిద్దఱు నేకత్ర ఉపవిష్టులై యొకరినొకరు ప్రస్తుతించికొని నిజైక్యమును బోధించునపు డటఁ జేరిన నిలింపగణములు వారినిద్దఱఁ గొనియాడిరఁట. ఆభాగము నంతయు రెండుగ్రంథములఁ జదివిచూచిన నుభయకవులయొక్కయుఁ గవితాధోరణులు వ్యక్తపడఁగలవు.

సోమనాథుఁడు 'సాహిత్యరసపోషణసంవిధాన' మందెంతమిన్న యగుకవియో విదితమగును.

సీ. అభ్రింకషంబైన యాలపోతునితండు
తుత్రించినాఁ డీతండు పెంచినాఁడు,
*    *    *    *

రజతగిరిమీఁద హరిహరారాధనంబు.

సీ. సారసంబున లేవ నీరసంబునఁ జావఁ
బద్మాసనుఁడు వీరిపాలఁగనియె
*    *    *    *

హరిహరాత్మ నెఱింగితి మనిరి సురలు.

(నాచనసోమనాథుఁడు)

సీ. యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నేలోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు గందర్పదర్పాపహరుండు నైలీలఁ దనరువారు
*    *    *    *
*    *    *    *

నెపుడుఁ గరుణతో వరదు లయ్యెదరుమాకు.

(ఎఱ్ఱాప్రెగ్గడ)

ఎఱ్ఱనరచన యీవిషయమునఁ గొంత నీరసముగా నున్నది. శివకేశవు లిద్దఱు నొకచోట సమాసీనులై దేవసంఘంబులును మునిబృందంబులు

నచ్చెరువొంది వినుచుండఁ దమయద్వైతభావమును దిగంతవిశ్రుతనినాదముగా నుద్ఘోషింపఁ దత్ప్రకృతిస్వారస్యమును సముచితరసోదయముగ నభివర్ణింపమి కవితాప్రౌఢిమ కొకింత న్యూనత గల్గించుటగాదే!

వేఱొక దృష్టాంతము:—

ఇందుధరోపాఖ్యానమును, ఉషానిరుద్ధీయము నుభయగ్రంథములయందును జదివి చూడుఁడు; సోమనాథునికవిత్వము సర్వతోముఖముగ నెఱ్ఱాప్రెగడ కవితకంటె రసపుష్టియందును, శబ్దచమత్కృతియందును, భావభావనా వికసనమునందును నెంత ప్రౌఢతరముగా నున్నదో విస్పష్టమగును. తారతమ్యనిరూపకములగు రెండుపద్యములనుమాత్ర మిట నుదహరించెదను :—

సీ. క్షాళితకస్తూరికము లగుకుచముల
క్రేవల నఖపద శ్రీలు మెఱయ
విస్మృతాంజనచారువిభవంబు లగునేత్ర
ముల దట్టకెంపులేముల భజింప
గళితతాలరాగము లగుబింబాధ
రముల దంతక్షతరచన బెరయ
నాక్షిప్తతిలకంబు లగుఫాలముల నార్ద్ర
లంబంబు లగుకుంతలములు పొదువ

తే. సన్నవలి పంపుటూరులు జఘనములును,
నంట నారులు జిగిమెక్కి యసదుకొను
నందు నెత్తురుకాంతి నిండార నంబు
సేక మభినవద్యుతిఁ జేసెఁ జెలువగమికి.

ఎఱ్ఱన. ఉ. హ. ఆ. 7.

సీ. అరుణారవిందంబు లని ప్రొమొక్కనోకాని
చిగురుటాకుల నింత చేరరావు

పులినంబు లని చాల బుజ్జగించెనో కాని
మరుచక్రముల నింత మరిగి రావు
చక్రవాకము లని సవరించెనో కాని
కరికుంభముల నింత గదియ రావు
గండుమీలని చాల గారవించెనో కాని
పూపుఁదూపుల నింత పొందిరావు
తే. తరఁగలాత్మీయ ధనములదాయలైన
చరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి,
తరఁగ లింతులు పైకొన్నఁ దలఁకినట్లు.

ఈ రాగున నుభయగ్రంథంబుల యందును నేభాగములు సరిపోల్చిచూచినను సోమనాథునికవిత్వ మెఱ్ఱనార్యునిదానికంటె రసవత్తరముగను బ్రౌఢతరముగ నున్నదని చెప్పుట కొంకించుకయును సందేహము కలుగ లేదు. ఇట్లు సోమనాథునికవిత్వమును భూషించుట యెఱ్ఱనార్యుని కబ్బమును నిరసించుటగాఁ గవితాభిమాను లూహింపఁదగదు. గ్రంథవిమర్శనమందు యథార్థగుణనిరూపణము చేయక తప్పదు. హెచ్చుతగ్గులు నిర్ణయింపకతీరదు. కవితాభిమానమే గాని కేవలము కవీశ్వరాభిమాన మనుచితము, నకృత్యము.

ఇంతవఱకు గ్రంథముల రెంటినిమాత్రమే విమర్శించి కయ్యాధోరణుల యందలి తారతమ్యముల నిరూపించితిని. ఇంక నిరువురుకవుల ప్రత్యేక కవితాలక్షణముల గుర్తింపఁగడంగెద. ఈవిషయము కొంతమట్టు కప్రస్తుత మైనను. ఆంధ్రమహాకవుల కవితాలక్షణ నిర్ణయములయం దింకను, నిశ్చితాభిప్రాయములు లేకపోవుటయుఁ, బలువురు పలువిధముల నూహించుటయు. వాదప్రతివాదములకు విశేషముగ నవకాశముండుటయు, నిత్యాదికారణములచేత, నీమహాకవుల కవిత్వ

ము లేయేవిషయములలో నేయేలాగున నున్నవో చర్చింప సమకట్టితిని. పాఠకు లీయభ్యంతర ప్రసంగమును క్షమింతురుగాక.

కాళిదాసు, భవభూతి, భారవి మొదలగు సంస్కృతమహాకవీశ్వరుల కవనధోరణుల సామ్యభేదములు విస్పష్టముగాను సమగ్రము గాను దెలియవచ్చుచున్నవి. కాళిదాసుకవిత్వ మిదమిత్థమనియు, భవభూతికవిత్వ మిదమిత్థ మనియు, నిర్ణయించి కాళిదా సీయీవిషయముల నెక్కుడైనచో, భవభూతి యీయీ విషయముల మిన్నయని నిర్వచింపఁబడినది. అటువంటినిర్వచనము తెలుఁగుకవీశ్వరుల గుఱించి యింకను జేయవలసియున్నది. విశేషముగ విమర్శనయుఁ, జర్చయు, జరగినఁగాని వారివారికవితాప్రకృతి నిరుక్తి కాఁజాలదు. కావున సందర్భావశ్యకత నతిక్రమించియైనను, పైనుద్దేశించిన విషయమును జర్చింపఁ బూనితిని.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమేగాక మఱికొన్ని గ్రంథములఁగూడ రచియించెను. అందు భారతమందలి యారణ్యపర్వశేషము, రామాయణము, నృసింహపురాణము' మున్నగునవి ముఖ్యములు. నాచనసోమనాథుఁడును, వసంతసేన, యిత్యాది మఱికొన్ని గ్రంథములు వ్రాసినటులఁ గాన్పించుచున్నది. కాని వసంతసేనయందుఁ గొన్నిపద్యములు తక్క, ఇతరగ్రంథము లేవియు నింకను లభింపలేదు. లభ్యములైనవఱకు, వీరిరువురిగ్రంథములు చదువఁగా, వీరి కవితలయందుఁ గొన్నివిస్పష్టము లైనలక్షణములు గాన్పించుచున్నవి.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక నాల్గవసంపుటము 9, 10, 11, సంచికలలో బ్ర॥శ్రీ॥రా॥ అనంతక్రిష్ణశర్మగారు, ఎఱ్ఱాప్రెగడ, సోమనాథుల కవిత్వములను సరి చూచి తారతమ్యముల నిర్ణయించిరి. సోమనాథుని కవిత్వముకంటె, నెఱ్ఱాప్రగడకవిత్వ మెక్కుడు ప్రశస్తముగా నున్నదనియుఁ గావున సోమనాథునికి నెఱ్ఱా ప్రెగడకంటెఁ దక్కువస్థానమీ

యుఁదగిన దనియు వారిసిద్ధాంతము. "లోకో భిన్నరుచిః" అనునట్లు వారి కట్టియభిప్రాయ ముండుట సమంజసమే కాని వారు సిద్ధాంతీక రించుటలోఁ గొన్ని పొరపాట్లున్నవని నాయభిప్రాయము. ఆయన వ్రాసినవ్యాసమును జాలవఱకు ఖండించుట కవకాశమున్నను, సుదీర్ఘమగు వ్యాసమునకు దీర్ఘతర మగు ప్రత్యుత్తర మిచ్చుట కనువగుసందర్భ మిది కాదని విరమించెదను.

కవిత్రియమువారును, నాచనసోముఁడును, నుత్తమకవీశ్వరులని చెప్పుట కెవ్వరును సందేహింపరు. కాని వారికంటె వీరెక్కువా? వీరికంటె వారెక్కువా యనువాదప్రతివాదములఁ జేయుటయందుఁ గొంత పూర్వాలోచన కావలసియున్నది. అదేదన, నొకానొకకవీశ్వరుఁ డుత్తమకవి యనిప్రసిద్ధినొందుట కాయన యందేదో మహత్తర మగువిశేషముండినఁగాని యట్టిలోకప్రసిద్ధి రానేరదని తెలిసికొనుటయే. అటువంటి ప్రసిద్ధికిఁ గారణము లెవ్వియని నిర్ణయింపఁదగు కావున మహాకవీశ్వరు లని యాంధ్రప్రపంచమున వేనోళ్లఁ జాటఁబడిన ఈమహనీయుల కవిత్వములయం దనన్యసామాన్యప్రశస్త్య మెద్దియో తెలిసికొనఁగోరుట కర్తవ్యము; ఏవిషయములయందెవరెవరగ్రగణ్యులు, ఒకానొకవిషయమునం దొకరికంటె మఱియొక రధికులా? కారా? య ను సమాలోకనకుతూహలమున విమర్శించు టుచితము. ఈసమరస సవిమర్శదృష్టిని, ప్రస్తుత మెఱ్ఱాప్రెగడసోమనాథులఁగూర్చి మాత్రము చెప్పఁబూనెదను. ఏతద్గ్రంథావకాశమునుబట్టి, విపులదృష్టాంతము లీయ క నాయభిప్రాయములనుమాత్రము సంక్షేపముగ నిచట వ్రాసెదను. సోదాహరణ మగువిపులవిచారణ స్థలాంతరమునఁ జేయఁదగు.

ఉభయకవులయందలి సమానగుణములఁ గనుఁగొని తరువాత భేదముల నిర్దేశించుట కార్యక్రమము.

i. ధారాశుద్ధియం దుభయులు నొకరికొకరు తీసిపోరు. వారి

కవితా ప్రవాహ మనర్గళము, అయత్నోపలభ్యము, ఐచ్ఛికవిహారసం పన్నము.

**ii.** ఉభయభాషాపాండితియం దుభయులు సమానగౌరవముఁ బొంద నర్హులు.

iii. భావభావనాప్రపంచమునం దిరువురు స్వైరవిహారధీరులు.

**iv.** కావ్యలక్షణసంప్రదాయేత్యాది వైదగ్ధ్యమునం దిద్దఱుఁ దులఁదూఁగుదురు.

v. మఱియుఁ బురాణేతిహాసకథాపారగత్వమున నిరువురకు హెచ్చుతగ్గులు నిర్ణయింపఁబూనుట శశవిషాణాన్వేషణము.

vi. ఇంతియగాక, ఉభయులు సమాననైష్ఠికసదాచారసంపన్నులు, వేదవేదాంగవిశారదులు, సంతతభగవద్భక్తిపరాయణులునై, వారాశ్రయించిన యాస్థానముల, సమానగౌరవాతిశయములఁ బొందియుండిరి.

సమకాలికులైయుండి యిన్నివిషయముల సమానలక్షణములు గల వీరిరువురికి నన్యోన్యవిజిగీషయుండుట యస్వాభావికమా? ఆశ్చర్యజనకమా? కావుననే యొకేగ్రంథమునుభయు లాంధ్రీకరింపనుద్యోగించుట చేకూరినది.

ఇంతదనుక వారిజ్ఞానపరికరసమృద్ధిని విడఁదీసి ప్రత్యేకముగాఁ జూచి, వారొండొరులకుఁ దీసిపోరని నిర్ణయించితిమి. ఇటుపైని వారి పరికరనికరము నెట్లు కవిత్వమునందు వినియోగించిరో, వినియోగింపఁ గలిగిరో, చూతము.

ఈకవిపుంగవులకిద్దఱకుఁ గలభేదము, కణ్ణాదునులకువలె, సాధనసామగ్రియొక్క ప్రయోగసంసిద్ధియందుఁ బ్రాయికముగ నున్నదని నాయభిప్రాయము. సామర్థ్యమునందు హెచ్చుతగ్గులు లేవు. మేధాశక్తియందు ఛంకుగొంకులు లేవు. కాని సద్యస్స్ఫూర్తియు, పర్యాలోకనచతురతయు

గొంతవఱకు వేఱైయున్నవి. వీరిద్దరియందలి తారతమ్యము నిర్ణయించుట కిదియే ముఖ్యాంశమని నాకుఁబొడగట్టినది.

ఉభయకవులు కవితాశైలియందు వేఱువేఱుమార్గములఁ ద్రొక్కినసంగతి యెల్లరకు విశదమే. ఎఱ్ఱాప్రెగడశైలియొక్కడుమృదువైనదియు, నై యున్నది. ఆయన సామాన్యముగా వాడినశబ్దములు గీర్వాణ మునందయినను, ఆంధ్రమునందైనను, సరళమైనవియు, సుస్వనయుతమైనవియుఁగా నున్నవి. మృదుపదసంవిధానము, సహజకవితాధారతోఁగలసి గగన కల్లోలినీకలస్వనములవలె వీనులకు విందొనరించు చుండును. ఇక సోమనాథుని శైలియన్ననో యనేకవిధముల బరుగిడును. ఒకప్పుడు మృదుమధురశబ్దములతో వీనులకు వేణుగానమువలె నుండును. మఱి యొకప్పుడు దీర్ఘ మగు సమాసములతో నుద్దండమారుతమువలె నుద్ఘోషించును. ఇంకొకప్పుడు సప్తతంత్రిసమ్మేళము రీతిని స్వరమాలికలతో మైమఱపుఁ బుట్టించును. ఈలాగున నే సందర్భంబునకుఁ దగిన ట్లాసంర్భమున, నుచితగతుల నాశైలిమారుచుండును. ఈయనశబ్దజాలమునందెక్కువపటుత్వమును, జీవమును, జవమును, నున్నట్లునాకుఁ దోఁచుచున్నది. శబ్దములు స్వభావసిద్ధము గనే తత్తద్రసముల కనువగురీతినిఁ బ్రవాహవేగమున దొరలుచుండును. గురుతరభావము లనువదించుటకుగురుతరశబ్దములేగానిపేలవమగుపదములు వాడఁబడి యుండలేదు.

ii. పదగుంభనమందు భేదమున్నటులు, ఛందోవృత్త సంగ్రహణమందును భేదము గాన్పించుచున్నది. సోమనాథుఁడు దఱుచుగా నుత్పల చంపకమాలలను, సీసములనుమాత్రమే వాడెను. కందములు, గీతములు నంతకంటె సకృత్తుగాఁ గానఁబడును. శార్దూలము లరుదు. తదితరములు నామావశిష్టములు. ఈలాగున మాలావృత్తముల నెక్కుడుగా నుపయోగించుటకుఁ గారణమేమన నాయన రసోద్ధతికిఁ దగిన శబ్దజాలమును గూర్చినట్లే ఛందస్సహాయమునుగూడఁ గైకొనెను. కావున రసప్రవాహముతో సమానముగ, శబ్దవృత్తప్రవాహము పరు

గిడుచు, రసవికాసము నినుమడింపఁజేయును. భవభూతి, మురారి, మిల్టన్, టెనిసను మొదలగుకవులను జదివినవారి కిది క్రొత్తవిషయము కాదు, ఎఱ్ఱాప్రెగ్గడ యీసాధనసంపత్తి నంత చతురతగా వాడి యుండ లేదు. ఉభయులయందును రసము నైసర్గికమైనను, దానిని బోషించుట యందు సోమనాథుఁ డెక్కుడునేర్పుఁ జూపినాఁడు.

iii. భావప్రకటనమునందు శంభుదాసుఁడు కేవలము నైసర్గిక సారళ్యమునే యనుగమించెను. సామాన్యమనుజుఁ డేవిషయమునైన నెట్లూహించునో, సాధారణముగ నాయన యాలాగుననే భావముల నిర్వక్రముగాను, నిదానముగాను నూహించును. అనఁగా నాయన స్వభావముచే సుందరమగు బంగారమును సామాన్యముగ నాస్థితియందే యుంచివాడును. ఇఁక సోమనాథుఁ డన్ననో, యానైసర్గిక సువర్ణము నకు మఱింత తళుకుబెళుకులు గలుగునట్లు నగిషీపనిఁ జేయును. అనఁగా సహజసువర్ణముఁబోలు తననైసర్గికభావమునకు సాహిత్యపోషణ మనెడి యొకనగిషీపనిఁ జేసియున్నాఁడు. కావున నాయన చిత్రించిన భావము లు కేవలనిసర్గజన్యములయినను, గొంతచాతుర్య విలక్షితములై యు న్నవి. సహజసౌందర్యవతి యగుమానిని నవరత్నభూషితురాలైనఁ దప్పేమి? ఈకారణమున నెఱ్ఱాప్రెగడయందలి భావవిలసనము, సోమనా థునియందలి దానివలెఁ దటాలున మనసునందు గోచరింపదు. కవిత్వ మొకకళయైనచో, నైసర్గికభావమునకుఁ (Nature) దగినరసపోషణ సంవిధానముఁ (art) జేయుట యొప్పేగాని తప్పు గాదు. అట్టి సంవి ధానమం దగ్రగణ్యుఁడు గావుననే, సోమనాథునికి 'సాహిత్యరసపోష ణసంవిధానచక్రవర్తి' అని బిరుదము నిలిచియున్నది.*

* ఈయిద్దరుకవులును వారికవిత్వశైలీ శిల్పములగురించి ప్రత్యేకముగ వారే విమర్శించుకొని ప్రపంచమునకు సంశయవిచ్ఛేదముగాఁ దెలిపికొనిరని నేనూహించు చున్నాను.

ఆంగ్లేయ కవితాభిజ్ఞులగు ఆంధ్రమహాజను లీ యుభయకవుల కవితాధోరణుల నతి దేశన్యాయమున నీ క్రింది విషయములబట్టి తెలిసి కొనవచ్చును. ఎఱ్ఱాప్రెగడ కవిత్వము వర్డ్సు వర్తు (Wordsworth) కవిత్వమువలెను, నాచనసోముని కవిత్వము టెన్నిసను (Tennyson) కవిత్వమువలెను యుండునని యూహించిన, వారిద్దరి కవితారీతులయందలి

---

ఎఱ్ఱాప్రెగడ తాను రచించిన భారతారణ్య పర్వాంతమున తన్నుగూర్చి యిట్లు చెప్పికొనెను:—

... ... ... ...

... ... ... ...

గీ॥ డెఱ్ఱనాఖ్యుండు సర్వలోకైకవిదితుఁ, డైన నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తిఁదన్నుఁ, జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁగోరి

క॥ ధీరవిచారుండు తత్కవి, తారీతియుఁ, గొంత దోఁపద ద్రచనఁ గా
నారణ్యపర్వశేషము, పూరించెఁ, గవీంద్రకర్ణపుట పేయముగాన్॥

ఈమాటలలో నామహాకవి తనకవితాశైలిని గురించి విస్పష్టముగా నిర్వచించుకొనెను. తనకవిత్వము నన్నయభట్టు కవిత్వమును పోలియుండుననియు, నామహానుభావుని "సరస సారస్వతాంశ ప్రశస్తి" దన్నుజెందినదనియు కావుననే అరణ్యపర్వశేషమును నన్నయభట్టు రచించినట్లుగానే అనగా నన్నయభట్టు పేరుననే తానుపూరించెననియు బాహాటముగా చెప్పికొనెను. నన్నయ తిక్కన లిద్దరిలో నన్నయనే తనకవితాగురువుగా నిర్ణయించుకొనెను. ఇంకసోమన్న తనగ్రంథమందు తిక్కనభారతమును సంస్మరించి యాగ్రంథముతర్వాత దానురచించెనని యుగ్గడించెను. భారతాంధ్రకర్తలగు నన్నయ తిక్కనలలోఁ దిక్కననుమాత్రమే యుపలక్షించెను. ఇట్లుతిక్కయజ్వనొక్కనినే నిర్దేశించుట కేవలమ ప్రాచీనత సూచకమే కాదనియుఁ సరససారస్వత గురుత్వప్రశంసయు గుప్తముగానున్నదనియు నాయభిప్రాయము. కవిత్వవిషయములో నన్నయశిష్యుడు ఎఱ్ఱాప్రెగడ తిక్కనశిష్యుడు సోమనాథుడు ఇందలియాథార్థ్యమును నిర్ణయించుటకు సోముని హరివంశమును, తిక్కన విరాటపర్వమును ఒకదాని వెంటనే మరియొకటి ఏకముఖముగా జదివిచూచిన నాచనసోమనాథుడు తనయద్భుతమగు శైలిని తిక్కనభారత శైలినుంచి—ముఖ్యముగా విరాటోద్యోగపర్వశైలినుంచి—సంపాదించుకొని దానికి మరింత మెరుగుపెట్టెనని స్ఫురింపకమానదని నాయభిప్రాయము.

తారతమ్యములు చాలవఱకు బోధపడగలవని నా యభిప్రాయము. ఈ యిద్దరు ఆంగ్లేయ కవీశ్వరులును కావ్యశిల్పశైలులలో స్వచ్ఛమగు స్వాభావికపుష్టి కలిగి కృత్రిమ లక్షణముల నించుకైనను సోకనియక కవితా ప్రపంచమున సమానప్రతిష్ఠను బొందియున్నారు. అయినను ఉభయుల కవితారీతులును వేరువేరుమార్గములఁద్రొక్కి ప్రసిద్ధిఁబొందినవని ఆంగ్లేయ కవితావిశారదు లందరును యెరిగినవిషయమే. వర్డ్సువర్తు కవి సహజమాధుర్య సౌమ్యతలు గలిగి కేవలము నిరాడంబరియై, అలంకారపోషణమును నిరసించెను. టెన్నిసను కవి యట్లుగాక తన కవిత్వమందలి సహజసౌందర్యమును కావ్యాలంకారభూషణములచేఁ బోషించి రసస్ఫూర్తి నినుమడించెను. కావున వర్డ్సువర్తు కవియందు అత్యుల్లసిత తేజోవిరాజితభాగము లచ్చటచ్చట యున్నను నీరసభాగము లెక్కుడుగా గోచరించునని యభిజ్ఞులు దెల్పుచున్నారు. టెన్నిసను కవియందట్లుగాక ప్రతికావ్య భాగమందును ప్రకృతిసౌందర్యమును శిల్పనైపుణ్యమును సమ్మేళనముబొంది సత్వరరససిద్ధి కనుకూలించు చున్నవి. ఇట్టి సామ్యభేదములే ఎఱ్ఱాప్రగడ సోమనాథులయందు గాన్పించుచున్నవని చెప్ప సాహసించుచున్నాను. టెన్నిసనుకవి కవితాకళకు చిత్రలేఖన కళను మేళవించినరీతిని సోమనాథుఁడు తన కవిత్వమందు చిత్రకళాభిజ్ఞత సర్వత్ర జతపఱచెను. కావుననే యతని పద్యములు మృదుమధురపదబంధముచే శ్రుతికిని, వస్తువర్ణనా చిత్రరచనచే దృష్టికిని, సద్యస్స్ఫురిత భావసౌష్ఠవముచే హృదయమునకును నిర్మలానంద మొనగూర్చుచున్నవని నా యభిప్రాయము.

దృష్టాంతమునకై ఉషానిరుద్ధరహస్యసమాగమము వినిన బాణాసురుని కోపవర్ణనముఁ జూడుడు:—

ఎఱ్ఱాప్రగడ:—

శా. నా విక్రాంతియుఁ బేరుఁ బెంపు మదిలో నంగానకున్మార్గుడై
    నా వీడక్కటసొచ్చి నా ప్రియసుత స్వాంతైక భూషామణిఁ

భావంబేఁగ నొక్కమర్త్యుఁడట దర్పంబేర్పడన్ దూషితం
గావించెన్ మదిఁ సైఁపఁగావశమె యిక్కాలుష్య మెబ్బంగులన్॥

సోమనాథుడు:—

ఉ. నావుడు రోష వహ్ని వలనం బొగ రేఁగినభంగి మోమునం
గావిరి పర్వనంగమునఁ గంపమునివ్వటిలంగ బాణుఁడ
త్యావిల చిత్తుఁడై మనుజుఁడట్టె మదీయపురంబు చొచ్చెన
చ్చేవయు కాక నా నగరు చెర్చె నిసీ మగమాటలేటికిన్॥

క. ఏనటె నా కూఁతురు నటె
మానవుడటె నగరుచొచ్చి మా కులమునకున్
హాని యొనరించెఁ గన్నుల
గానఁడు దలమెత్త రోఁతగాదే నాకున్.

క. మనుజాంగనలం బట్టుట
దనుజులకుంజెల్లుఁగాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకును దొర
కొనిరే బెండులు మునింగి గుండులు దేలెన్

ఈసందర్భముల నన్నిఁటినిఁజూడఁ గేవలము సరసకవితారచన యందు సోమనాథుఁ డెఱ్ఱాప్రెగడకంటె నెక్కుడు ప్రౌఢత్వమును, రసికత్వమును గనఁబఱిచెనని చెప్ప నొప్పుఁగాని శంభుదాసుఁ డాంధ్రవాఙ్మయమున కెక్కుడుగ్రంథముల నిచ్చి యెక్కువయుపకారమును జేసినాఁడు. గ్రంథబాహుళ్యమునందుఁ దిక్కనవలె శంభుదా సగ్రగణ్యుఁడైనను, గేవల కవితాప్రకృతియందు సోమనాథుఁ డెఱ్ఱనకంటె మిన్నయని తలంచెద. యాథార్థ్యము నాంధ్రకవితాభిజ్ఞులు నిర్ణయింతురుగాక!

నాచన సోమనాథుడు వసంతవిలాసమను ప్రబంధమును వ్రాసినట్లు గాన్పించుచున్నది. అందలిపద్యములు గొన్ని లక్షణగ్రంథములలో

నుదాహృతములై యున్నవి. మచ్చున కొకపద్యము నిక్కడఁ జూపించు చున్నాను.

ఉ॥ ప్రాలేయప్రతివీరసేనఁ బఱపెన్ బైపై వసంతంబిలం
గాలోన్మీలిత కోరకోదర పరాగప్రౌఢ కోపాగ్నిమై
హాలాపాన విహారపౌర మహిళాహంకార దోస్సారమై
హేలాపల్లవ హేతిఖండిత మహాహేమంత సామంతమై॥

నాచనసోమనాథుఁడు కన్నడభాషయందుఁ గొన్ని యుద్గ్రంథములు రచియించినట్లు తెలియవచ్చుచున్నది. కన్నడగ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ జేరవుగావున, నిచ్చట వానితో నేమియుఁ బ్రసక్తిలేదు.

---

# నాలుగవ అధ్యాయము.

| | | |
|---|---|---|
| హరిహర రాయలు. | II | 1377_1404 |
| దేవరాయలు, | | 1404_1422 |
| విజయరాయలు | | 1422_1423 |
| ప్రౌఢదేవరాయలు | | 1423_1447 |

పేరంరాజు జక్కనకవి—విక్రమార్క చరిత్రము.

బుక్కరాయలతర్వాత నతనికుమారుఁ డగు రెండవ హరిహరరాయలు రాజ్యమునకు వచ్చెను. అతఁ డిరువదియేడు సంవత్సరములు మహావైభవమునఁ బరిపాలించెను. ఆయనకాలమున రచింపఁబడిన యాంధ్రగ్రంథము లేవియుఁ బ్రస్తుతము గానరావు. రెండవ హరిహరరాయలు గతించినవెంటనే యాతని ద్వితీయపుత్రుఁడగు రెండవ బుక్కరాయలు దేవరాయలను బిరుదనామము వహించి సింహాసనమెక్కెను.

ఆయనరాజ్యకాలము క్రీ॥ శ॥ 1404_1422. మొదటి దేవరాయలు 1422లో మృతినొంద నతనికుమారుఁడగు విజయరాయలు వెంటనే సింహాసనమెక్కి యొకవత్సరమైనను బూర్తిగ రాజ్యముచేయకయే కాలధర్మము నొందెను. ఆయన తరువాత నతనికుమారుఁడగు ప్రౌఢదేవరాయలు కర్ణాటక సింహాసనారూఢుఁడై క్రీ॥ శ॥ 1423_1447 వఱకుఁ జాలకాల మత్యున్నతముగను, శౌర్యాటోపముగను, విజయశీలముగను, రాజ్యముచేసి మొదటి బుక్కరాయలవలెనే విఖ్యాతయశుఁడై రాజ్యమును బహువిధముల వృద్ధిచేసెను. ఈయిద్దఱు దేవరాయలకాలములో విక్రమార్క చరిత్రమనెడు ప్రసిద్ధాంధ్ర ప్రబంధమును రచించిన జక్కనమహాకవి జీవించియుండెను. ఈకాలములోనే వినుకొండ వల్లభామాత్యుఁడు తన క్రీడాభిరామమును రచించెను.

జక్కనకవియొక్క కాలనిర్ణయముఁజేయుట కాతఁడు వ్రాసిన విక్రమార్క చరిత్రమందలి కృతినాయకుని చరిత్రాంశములే మనకాధారము. ఈచరిత్రాంశములను బట్టి మ-రా-రా. చిలుకూరి వీరభద్రరావుగారు, మ-రా-రా. కొ॥ వే॥ లక్ష్మణరావుగారును ఈకవి రెండవ హరిహరరాయల పుత్రుఁడగు మొదటి దేవరాయల కాలములోనివాఁడని సిద్ధాంతపఱచిరి. కాని ప్రత్యేకముగా మొదటిదేవరాయల కాలములోనివాఁడని చెప్పుటకుఁ దగినంత యాధారము కానరాదు. ఈయుభయ దేవరాయల కాలములమధ్యమున నంతర మొకవత్సరము మాత్రమె యయియుండుటచేత నీకవి ప్రత్యేకముగా నొకనికాలమునందె యుండెనని చెప్ప వీలులేదు. ఈసిద్ధాంతమును స్థిరపఱచుటకు వలయునిదర్శనములను బొందుపఱచెద.

జక్కనకవి తనవిక్రమార్క చరిత్రమును వెన్నెలకంటి సిద్ధనమంత్రికి నంకితముచేసి యాకృతిభర్తవంశావళిని వర్ణించుసందర్భమున

నీక్రిందిచారిత్రక విషయముల నుదాహరించెను. కృతిభర్త యొక్క తండ్రి యగుజన్నయ, "రసికత్వమున దేవరాయమహారాయ కరుణాకటాక్ష వీక్షణము గాంచె"ననియుఁ గృతిభర్తయగు సిద్ధన-

"దేవరాయమహారాయ ధీవిధేయ, మంత్రి వల్లభ చామనామా త్యదత్త చామరచ్ఛత్రశిబికాది సకలభాగ్య, చిహ్నముల నొప్పె జన్న యసిద్ధమంత్రి. (ఆ. 1-50.)

అనియు వ్రాసెను. ఈ రెండు విషయములలోఁ బేర్కొనఁబడిన దేయరాయలు మొదటి దేవరాయ లనియా, రెండవదేవరాయలు (అన గా, ప్రౌఢదేవరాయలు) అనియా! ఊహింపవలసియున్నది. చామనా మాత్యుఁడు దేవరాయలకాలమున సతనిమంత్రి యని పై పద్యమువల నఁ దెలియవచ్చుచున్నది గదా. మఱియొకచోట, ననఁగా షష్ఠ్యంత ములలో—"శ్రీమద్వల్లయవరసుత, చామనదండాధినాథ సామ్రాజ్య రమా, సామగ్రీసంపాదక, సామాదికచతురుపాయ సంపన్నమతుఁ." అని యున్నది. కావున చామనామాత్యుఁడు దండనాయకుఁడు గాఁ గూడ నుండెను. పైని బేర్కొనఁబడిన దేవరాయలలో నేదేవరాయల యొద్ద చామనామాత్యుఁడు మంత్రిత్వమును దండాధిపతిత్వమును వ హించెనని యూహింపవలయును? మ-రా-రా. బంగళూరు సూర్య నారాయణరావుగారు రచించిన 'విజయనగరరాజ్యచరిత్ర' మందు, 278 పుటలో చామనృపాలుఁడు (అనఁగా, చామనామాత్యుఁడు) ప్రౌఢదేవరాయలయొద్ద దండనాయకుఁడుగా నుండినట్లు వ్రాయఁబడి యున్నది. అయిన నీదండనాయకుఁడును మంత్రి శేఖరుఁడునగు చామ నృపాలుఁ డుభయదేవరాయలకాలములో నుండిన ట్లూహించుటయే సత్యమని నాకుఁ దోఁచుచున్నది. ఏలయన, ప్రౌఢదేవరాయలు రాజ్య

మునకు వచ్చినప్పుడు పిన్నవయసువాఁ డగుటచే నతనితాతయగు మొదటిదేవరాయలయొద్దఁ బ్రసిద్ధినొందిన యమాత్యశేఖరు లతనికాలమునందును రాజ్యవ్యవహారములు నడపుచువచ్చిరి. కావున చామనృపాలుఁ డుభయదేవరాయల కాలములలో నుండినట్లు నిశ్చయింపవలసియున్నది. ఇటులుండ సిద్ధనమంత్రి యేదేవరాయల కాలములో రాజ్యచిహ్నముల నొందెనో, 'విక్రమార్కచరిత్రము' కృతినొందెనో, నిర్ణయించుట కవకాశము ప్రస్తుతము కానరాదు.

మఱియొక యంశము —సిద్ధనమంత్రియొక్క పెద్దతండ్రి— వెన్నెలకంటిసూర్యుఁడు రెడ్డివేమనరపాలునిచే నగ్రహారములు గొనినట్లు వ్రాయఁబడినది:

చ. వెన్నలకంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రి గా
సన్నుతిఁ గన్న సిద్ధనకు సంతత దానకళావినోదికిన్. (విక్రమా. ౧ ఆ)

ఈ వేమనృపాలుఁ డద్దంకి ప్రభు వగు ప్రోలయవేమఁడని మ. రా. రా. కం. వీరేశలింగముపంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రమందు వ్రాసినారు. అట్లు నిర్ణయించినయెడల సిద్ధనమంత్రియొక్క పెద్దతండ్రి క్రీ॥ శ॥ 1320—1350 మధ్యకాలములో నుండవలసివచ్చును. సిద్ధనమంత్రియు, నతని తండ్రియు నుభయదేవరాయలకాలములో, సనఁగా క్రీ॥ శ॥ 1400—1450 వఱకు నుండినట్లు పైని నిర్ణయించితిమి గదా. కావున సిద్ధనమంత్రియు, నతనితండ్రియు 1400—1450 వఱకును, పెద్దతండ్రి 1320—1350 వఱకు నుండినట్లు తేలుచున్నది. ఇటూహించుట చారిత్రికదృష్టికిఁ జాల నసందర్భముగా దోఁచునని చెప్పనక్కరలేదు. కనుక వెన్నెలకంటి సూరన కగ్రహారముల నిచ్చిన వేమనృపాలుఁడు మఱియొక వేముఁడు గావలయును. బహుశః

కోమటి వేముని కుమారుడగు రాచ వేమారెడ్డి (1420—1424) యై యుండును.

ఇంకొక చిత్రము— మ. రా. రా. వీరేశలింగముగారు తమ యాంధ్రకవుల చరిత్రమున, మొదటి కూర్పునందు జక్కనకవి ప్రౌఢ దేవరాయలనాఁటి వాఁడనియు, రెండవకూర్పునందు మొదటి దేవరాయలకాలమువాఁడనియు వ్రాసిరి. ఈ కవియొక్క కాలనిర్ణయ మిద మిత్థమని చెప్పుట యెంత దుర్ఘటమో యందుల కిదియే ప్రబలదృష్టాంతము. ఉభయదేవరాయలకాలములోను గవి జీవించియుండెననియు, ముఖ్యముగాఁ బ్రౌఢదేవరాయలకాలములో విద్వత్ప్రశస్తిఁ బొందెనని యు నూహించుట, సత్యమునకుఁ జేరువయని తోఁచుచున్నది.

కృతినొందిన సిద్ధనామాత్యుని వంశావళి:—

సూరన సోమయాజి
(ఎద్దనపూఁడి రాజేంద్ర చోడరాజుచే నగ్రహారములు పొందెను.)
|
పేరులేదు
|
సిద్ధన (నన్నయరాజునకు ప్రధానుఁడు)
|
- మంత్రి భాస్కరుఁడు (వెన్నెలకంటి సూరన్న?)
- జన్నయ (దేవకీనయ శతకము రచించెను.)
  - సిద్ధన (విక్రమార్క చరిత్రమును గృతినొందెను.)
    - తిప్పయ్య
  - భైరవుఁడు.

ఈ సిద్ధనమంత్రి హరితసగోత్రుఁడును నాపస్తంభసూత్రుఁడు

వైదికాచారసంపన్నుఁడు నని కవి వ్రాసియున్నాఁడు. ఈయనయం దొకయద్భుతమైన విశేషముండినట్లు పెక్కుసార్లు వక్కాణించెను. అదేదన:—

సీ. ఆణిముత్యములసోయగము మించిన వ్రాలు వరుసతో నిరుగేల వ్రాయనేర్చె
నాత్మీయలిపియట్లు లన్యదేశంబులలిపులను జదువంగ నిపుణుడయ్యె
... ... ...
(విక్రమా. ఆ॥ ౧.)

రెండుచేతులతోఁ జక్కఁగఁ దెలుఁగులిపిని వ్రాయఁగలసవ్యసాచి యనియు, దెలుఁగులిపివలెనే యితరభాషాలిపులను ధారాళముగఁ జదువఁగల నేర్పరి యనియుఁ జెప్పఁబడినది. ఈ సంగతినే వేఱొకతావు నను గవి యిట్లుగ్గడించెను:

శా. శ్రీకర్ణాటమహామహీశ్వరసదాసేనాపరిధానోత్తమా
నీకసుత్యలిపిక్రియా నిపుణపాణిద్వంద్వసంకేరుహా
... .. ...
(విక్రమా. ఆ॥ 3.)

సిద్ధనమంత్రి గొప్పగణితశాస్త్రజ్ఞుఁడును. జక్కని కవిత్వముఁ జెప్పఁగల సమర్థుఁడును, దేవరాయలకు భాండాగారాధ్యక్షుఁడును, రాజనీతివిశారదుఁ డగునమాత్యశేఖరుఁడునై నానావిధముల నాకాలమున బహుప్రసిద్ధిఁ గాంచిన వాఁడఁట!

జక్కనకవి యింటిపేరు పేరంరాజువారు. ఈమహాకవి తనవంశమును గుఱించి ప్రత్యేకముగాఁ జెప్పికొని యుండలేదు. కావున నాయన నివాసస్థానాదివిషయము లూహ్యములు. ఆతనితాత యగు "పెద్దయామాత్యసుకవి నెల్లూరి తిరుకాళమనుజవిభుని సమ్ముఖమ్మున

సాహిత్యసరణి మెఱసె" నని యున్నది. దీనివలన నీమహాకవి నియోగి బ్రాహ్మణుఁ డనియు, నెల్లూరిపురవాసుఁ డనియు, మన మూహింప వచ్చును. జక్కనయొక్క తండ్రియగు నన్నయ్యకూడఁ గవియైన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. "ఆడఁడు మయూరరేఖను, గాడం బాఱండు బాణగతి మన మెఱియన్ బ్రోడగు పెద్దయయన్నయ, మాడకు మాడెత్తు యతనిమాటలు జగతిన్."

కావున జక్కనమహాకవి పండితవంశములో జనించినవాఁడని తెలియఁదగు. తండ్రికంటెఁ దాతయే యెక్కువఘనుఁ డనియు, కవి కెక్కువ గౌరవనీయుఁడును, స్మరణీయుఁడు ననియుఁ జెప్పుట కవకాశ ముగలదు. తాత యగు పెద్దయామాత్యుని గుఱించి వ్రాయుచు నొక పొడుగుపాటి సీసమాలికయం దాయన భాషాప్రపంచములోఁ జేయఁ గలిగిన నానావిధ కవితావధానములును, చిత్రకవిత్వ బంధకవిత్వాది నైపుణ్యసరణియు విశేషముగా వర్ణించినాఁడు. దీనినిబట్టి చూడఁ బెద్దయామాత్యుఁడు భాషాసంప్రదాయముల యందును శబ్దప్రయోగ చాతురియందును గడుఁబ్రోడయైనట్లు కన్పించుచున్నది. ఈ రెండుగుణంబులును జక్కనయం దుత్కృష్టముగా నుండుటచేతఁ బితామహుని పద్ధతిఁ గొంతవఱకు నీకవి యాలవరించుకొనియెనని చెప్పనొప్పు.

## గ్రంథవిషయము.

విక్రమార్కచరిత్ర యొక నిజమైన చరిత్రము కాదు. ఇందుఁ జరిత్రాంశములకై పరికించుట నేతిబీఱకాయలో నేతికై వెదకినట్లుండును. ఈగ్రంథమందు విక్రమార్కునిగుఱించి పుక్కిటిపురాణములు, పిట్టకథలు, అభూతకల్పనలుమాత్ర మున్నవి. కాని విశ్వసనీయమగు చరిత్రాంశ మొక్కటియును గానరాదు.

ఇది యెనిమిదియాశ్వాసముల ప్రబంధము. సంస్కృతభాషలోఁ గూడ నొకవిక్రమార్కచరిత్రము ప్రస్తుతము వాడుకలోనున్నది. ఆగ్రం

థమును బ్ర॥ శ్రీ॥ వే॥ వేంకటరాయశాస్త్రులువారు మున్నుగువారు తెలుఁగులో భాషాంతరీకరణము చేసిరి. కాని జక్కనకవి గ్రంథమునకును నా గ్రంథములకును జాలవ్యత్యాసము కాన్పించుచున్నది. ఈ కారణమున జక్కనకవిగ్రంథము ప్రస్తుతము ప్రచారములోనున్న గీర్వాణగ్రంథమున కనువాదము గాదు. ప్రథమమున నాంధ్రభాషలో రచించిన గ్రంథములన్నియుఁ గొంచెము హెచ్చుతక్కువగా గీర్వాణభాషనుండి యాంధ్రీకరణములయి యుండుటచే నీగ్రంథమునకుసైత మొకసంస్కృతమాతృక యుండవలసియున్నది. అట్టి మాతృక నాకు లభ్యముగామిని, భాషాంతరీకరణమందలి గుణావగుణవిచారణకు వీలులేదయ్యె.

ఈగ్రంథమందలికథ నిదివఱ కెవరును క్లృప్తముగా వ్రాసియుండలేదు. సంక్షిప్తకథాసార మెచ్చటనైన నుండినఁగాని కథావిమర్శనకానుకూల్య మేర్పడదు. కావున నీగ్రంథమందలి కథాభాగము నంతయు నిచటఁ గ్రోడీకరించి వ్రాసితిని.

## కథాసారము.

శృంగారశేఖరపరిపాలితం బగు మధురాపురంబున వీరవర్మ యనుదండనాయకుఁ డొకఁ డుండెను. రాకొమరిత యగు రాగమంజరియు మదనరేఖ యను దండనాయకుని కూఁతురును, సమానవయస్కలగుటం జేసి, యంతఃపురసౌధంబున విహరించుచుఁ గంతువసంతాదులఁ జిన్నపుచ్చు చంద్రగుప్తాఖ్య నొప్పు భూసురపుంగవుం గాంచిరి. అందు మదనరేఖ యాతని మోహించి యగ్గల మగు మదనునిబారికి లోనయ్యెను. ఆపెను బెండ్లాడుమని రాజగు శృంగారశేఖరుండును, వీరవర్మయు బోధించిరి. కాని యాతఁ డీయకొనక, చాతుర్వర్ణ్యకన్యలఁ బరిణయము సేయ నొడఁబడుదురేని నీకన్యను వివాహమాడెద ననవుడు రాజు సమ్మతించి తనపురోహితునికొమరిత యగు శీలవతిని, తనకూఁతు రగు రాగమంజరిని, ధనగుప్తుఁ డను వైశ్యునిపట్టి యగు సుమతిని, దండనాయకుని తనయ యగు మదనరేఖను గ్రమంబున నాబ్రాహ్మణునకుఁ బరిణయముఁ గావించెను. అంతఁ గొంతకాలమున కానల్వురకుఁ గ్రమప్రకారంబున వరరుచి, విక్రమాదిత్యుఁడు, భట్టి, భర్తృహరి యను, పుత్రచతుష్టయ ముద్భవించిరి. కొంతకాల మటులుగడవ నొక్కనాఁ డావిక్రమార్కుఁడు

వింధ్యపర్వతప్రాంతములకు విజయార్థము చని, వింధ్యవాసినీమందిరాంగణమునఁ బ్రబలుఁ డగురాక్షసునిపుత్త్రు లగు వాలిసుగ్రీవులు, తమకుఁ దండ్రి యొసంగిన, యద్భుతప్రభావముగల లాతము, పాదుకలు, రత్నపాత్రము, కంథలకొఱకై కలహించుచుండ వారిం గాంచి యాకలహము నాఁపి తన నైపుణ్యాతిరేకంబున వారల గృహాభిముఖులం గావించి వానిం దాను స్వీకరించి మేరుపర్వతప్రాంతంబులకుం బోయి చంద్రపుర మను పట్టనము నిర్మించి యటఁ బ్రజాపాలనంబు సేయుచుండెను. పదంపడి పాదుకాసహాయంబున నాతఁడు బ్రహ్మలోక మేఁగ నావాణీమనోహరుం డీతనిఁ గాంచి యచ్చెరువొంది వలసినవరముఁ గోరుమనఁ దనకత్తితోఁ ఘాతలముం జీల్చి యచట నంతకు మున్నున్నదాని కదనముగా విజయసూచకము లగు కొన్నిపదముల నేవేని లిఖింపఁ గోర నాయజుం డప్పుడీరాజశ్రేష్ఠునకు వేదాంత ముపదేశించి బ్రహ్మాస్త్ర మొసఁగెను. పిదప నీరాజావతంసుండు దనపురమునకుఁ జని సుఖంబుగ రాజ్యం బేలుచుండెను. కొంతకాలమునకు భట్టి విక్రమార్కుని వెదకికొనుచుఁ జంద్రపురిం జేరి యుజ్జయినిం గడుఁ బొగడ, నప్పుడావిక్రమార్కుఁడు పట్టనములోని మహాకాళ్యాలయ సమీపమున నున్న వటవృక్షంబున వ్రేలాడుచున్నయుట్టిలోఁ గూర్చుండి, తద్బంధముల నన్నింటి నొక్కమారు దెగఁగోసినవానికి సకలసామ్రాజ్యము చేకుఱునని తా నంతకు మున్నె విన్నవాక్యములు జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. ఒక్కవ్రేటునఁ గత్తితో నఱకి వేయుమని సుమతిసూనుఁడు సెప్పినయుక్తికి మెచ్చి రాజు భట్టిని బ్రతినిధిగా నేమించి యుజ్జయినికి వెడలి యటఁ గలవటశాఖం గట్టఁబడినయుట్టి నెక్కి యాచేరులను దెగవ్రేయ, మహాకాళి వానిసాహసమునకుం గడునలరి వానిం గ్రిందనున్న శూలముపైఁ బడకుండ నాఁపి, తనయంకపీఠి స్థాని నాసీనుఁ గావించి సహస్రవర్షపర్యంత ముజ్జయిని కీతఁడే రాజ్యము సేయ దీవించి మనుజావతారంబున జనించిన యీతఁ డాదినారాయణుండనియు, భట్టి బ్రహ్మయనియుఁ దెలిపెను. అత్తఱి నుజ్జయినీశుం డగుప్రసేనుండు మృతినొంద, రాజాన్వేషణార్థము వదలఁబడినపట్టపుటేనుఁగు సుమదామ మీతనికంఠంబున నలంకరింప నీతఁ డాయుజ్జయినికి రాజయ్యెను.

కొంతకాలమున కమరేంద్రుఁడు, రంభోర్వసుల నృత్యతారతమ్యంబు తేర్పఁజాలక విక్రమార్కునిఁ గొనిదేరఁ దేర నాయితము సేసి మాతలిం బంపెను. విక్రమార్కుఁ డందధివసించి యింద్రసభకుం జని యాదేవాంగనలలో నూర్వసినృత్యము, శాస్త్రోక్తమని యభిప్రాయం బొసఁగ నాయింద్రుండు మెచ్చి యీతనికి, ద్వాత్రింశత్సాలభంజికలు గల సింహాసన మొసఁగిపంప, విక్రమార్కుండు నిజపురమునకు విచ్చేసెను. కతిపయదివసంబుల కొకతాపసి వచ్చి, పశ్చిమదిశఁ గల కనకపురంబులోని కొల

నిమధ్యంబున దినదినమరుణోదయముతో నొకబంగరుకంబ మొదవి, పరిభాకరచరణంబుఁ దా ననుగమించుచు వృద్ధి క్షయంబుల, సమానముగఁ జాల్గొనుచుండె నని తెలుప విక్రమార్కుం డచటికిఁ జనియెను. అచట నా స్తంభముపై నాతఁ డధిష్ఠించి దానితో దినేంద్రు నంటుకొనినంత నా పరిభాకరుం డీతని ప్రభావమున కలరి, దినదిన మేడుబారువుల బంగ రొసంగు కుండలద్వయ మొసఁగ నాతఁ డాకర్ణాభరణముల నొక్క పేదపాఱున కర్పించెను. అనంతర మొక చెంచుఁ డతనిచోటునకు వచ్చి, యూరిగాడను వేటకురాఁ బ్రార్థింప నాతఁడు చని యొక్కకిటిం గాంచి దాని వెంటం బోవ నది యొక బిలద్వారముఁ బ్రవేశింప వెన్నాడి, రసాతలంబునకుం బోయి యచట బలిచక్రవర్తిచే గారవింపఁబడెను. ఆతఁ డీతనికి రసరసాయనము లను పేర నొప్పురత్నద్వయ మొసఁగెను. అం దొకటి ముదిమిఁ బోఁగొట్టును. వేఱొకటి సిరుల నొసఁగును. వానిని రా జొకవృద్ధబ్రాహ్మణున కొసఁగెను. పిదప నుజ్జయినీపురమునఁ బురందరుం డను వైశ్యుం డొకండు దనసర్వస్వమ్ము దానధర్మముల యందును, వేడుకలయందును వెచ్చించి దరిద్రుఁడయి యాత్రాస్థలములకుఁ జని రాజుం దర్శింప నాతం డందుండు గలవిశేషంబులఁ దెల్పుమనఁ దాను మధుకాపురికిం జనుటయుఁ దత్పురప్రాంగణంబున రాక్షసకళాఘాతముల నోడి విలపించు నొక స్త్రీయార్తారావము ప్రతిదినము వినవచ్చుననియు నివేదింప, నాపుడమిఱేఁ డాపురిఁ జేరి, యారక్కసుల నుక్కడంచి యాపెను గాపాడ, నాయమ సంతసించి యొకమణి నొసఁగ రాజు గ్రహించి పురందరున కొసఁగెను.

ఇత్తెఱంగున నానరేంద్రుండు లబ్ధవిజయుండయి, యుజ్జయినిం జేరి సుఖంబుండె. అంతఁ దత్పురవాసి యగు విప్రుం డొకం డైశ్వర్యకాముఁ డయి, యీశ్వరునిగూర్చి తపం బాచరించి మృత్యుహరం బగు నొకఫలంబు వడసి తనభార్య కొసఁగ, నాపె తనభర్త ధనము వడయమి కెంతయు వాని నిందింప నాతఁ డాపురమున నిజభార్య యగు ననంగసేనతో, సోదరదర్శనార్థ, మేతెంచిన మదనరేఖాపూజాంశకుభర్తృహరి కర్పించి యిష్టసంపదలఁ బడసెను. భర్తృహరి యాఫలమహత్త్వమును దన భార్యకుఁ జెప్పి దాని నొసఁగ నామె దానిని దనకుం గూర్చు హయపాలునకును, వాఁ డొకదాసికిని, నాపె యొక గొల్లనికిని, నాతఁ డొక గోమయధారిణికిని గ్రమంబున నొసంగిరి. మఱునాఁ డుదయమున భర్తృహరి నాహ్యాళి వెడలుచుండఁ గరీషపూర్ణవేణుపాత్రపైఁ బండిడుకొని యరుదెంచుచున్న గోపికం గాంచి, తత్ఫలసంగ్రహణవృత్తాంతం బానుపూర్వికముగ నెఱిఁగి భార్యావిరక్తుండయి యోగమార్గసంప్రయోగంబునకు రాజాజ్ఞ వడసి పోవుతఱి రాజకార్యధురంధరుఁడగు భట్టిని మంత్రి

నిగా గ్రహింపుమని చెప్పుచు నమ్మంత్రిచే గలుగులాభమును దెల్ప నీక్రిందికథను జెప్పెను.

నందుఁ డను రాజు దన ప్రియసతి యగు భానుమతిని విడిచి యుండజాలక తన్మయుఁడయి కార్యవిముఖత్వముఁ జెందియుండ, మంత్రి యగు బహుశ్రుతుండును, పురోహితుం డగు శారదానందుండును రాజున కెన్నివిధముల బోధించినను సరకు సేయకుంటచే మంత్రి రాజ్ఞిచిత్రపటము వ్రాయించి రాజున కొసఁగ నాతఁడు దానిని సదా చెంత నుంచుకొని సభాభవనమునఁ గార్యములు నడపుచుఁ దచ్చిత్రరూపాలోకన వినోదంబు శారదానందునకు దెలుప నాతఁ డాపటంబుఁ గాంచి యాపె యూరువునఁ గలమచ్చ లిఖింపఁబడలే దని తచ్చిత్రకారునకుఁ దెలుప నాతఁడు దానిని వ్రాసి యావార్త ఱేనికిం దెలిపెను. అంత నాభూమీశుండు దండతాడితభుజంగంబువలె రోషానలంబుఁ గ్రక్కుచు నాభూసురపుంగవునకు మరణదండన మొనరింప నమాత్యునకుత్తరు వొసఁగెను. మంత్రి యటులు చేయనొల్లక వాని నొక గృహమున నునిచి కాపాడెను. పిమ్మటఁ గొంత కాలంబున కారాజసుతుం డటవికి వేఁటకుం జని పులి వాతం దప్పించుకొని యొకవృక్షంబు నెక్క నచట నున్న యొక భల్లూకంబుఁ గాంచి వెఱఁగంద నాయెలుఁ గాతని కభయం బొసఁగ నాబాలుఁడు భయము వాసి దాని యంకతలంబునఁ దల నిడి కునుకు డెను. అప్పు డామెక మావృక్షంబు చెంత కరిగి పై నున్న రాకుమారుని గ్రిందఁ ద్రోయ నాయెలుగును బ్రతిమాలెను. కాని యది యటులు చేయ నొల్ల కుండెను. పదంపడి కొంత కాలమున కాభల్లూకము గాఢ నిద్రఁ జెందఁ బులి యారాజకుమారుఁ గాంచి యెలుఁగును గ్రిందఁద్రోయ వేఁడ నాతఁ డటులు చేయ నాజంతు వొక శాఖాసహాయంబునఁ బ్రాణరక్షణముఁ గావించికొని కృతఘ్నుం డగు నానృపసూనుని గాంచి 'ససేమిరా' యని యనిశంబుఁ బలుకు నొక యున్మత్తునిగా శపించి యెవ్వఁడైన నీసంగతి గ్రహించి చెప్పఁగలుగువాఁడే శాప విమోచన మగునని వచించి యథేచ్ఛం జనెను. అంతం గొన్నిదినంబులకు నంద నరేంద్రుండు నిజపుత్రాన్వేషణార్థ మందంద భటులఁ బంపి యొక్కెడ ససేమిరాలాపముఖుండై యున్న నృపసూనుని రప్పించి పెక్కండ్రు వెజ్జులచే మంత్రౌషధ చికిత్సలఁ జరపించినను మనోరథసిద్ధి వడయఁడయ్యెను. అంత మంత్రి యేకాంతంబున నీసంగతి శారదానందునకుం దెలుప నాతఁడు తనదివ్యజ్ఞానంబున నంతయు గ్రహించి రాజగృహాంతరంబున యవనికను మాటుపఱుచుకొని తత్కథావృత్తాంతం బామూల చూడంబుగ నెఱింగింప రాజపుత్రుండు నిరామయుండయి యుంటంగని రాజానంద సంభ్రమవిలోలుండయి యంతకమున్న భిషఙ్మణి శారదానందనందన యని యొఱఁగింపఁ

బడినవాఁడు గావున, నంతఃపురనివాసిని యగునీమె కీవృత్తాంతం బెట్టులు మనోగతం బయ్యె నని ప్రశ్నింప శారదావరప్రసాదంబున భానుమతీదేవియొక్క తొడమచ్చను గుర్తించినటులే యని నుడువ నావాక్యములు శారదానందునివిగా నెఱింగి తెర మరలించి యాతని గౌఁగిలించి యాతనిప్రాణముల రక్షించిన మంత్రిని బహూకరించి సుఖంబుండె. 'భట్టియు నీ కిటులే మంత్రివరుఁడు గా నుండు' నని విక్రమార్కునికిం జెప్పి భర్తృహరి యథేచ్ఛం జనియెను.

నారదుఁ డొకనాఁ డయ్యెడకుం జని విదర్భదేశాధీశునికూఁతు రనంగవతి యనంగుసతి మించునసామాన్యరూపవతి యనియు నామెను విక్రమార్కునిఁ బెండ్లియాడఁ గావింప విదర్భేశుండు గడుంగాలమునుండి యోచించియుండ సిద్ధపురాధీశుఁ డగుశకాధిపుఁ డారాకాచంద్రవదనపొత్తునకై మనోజపుష్పశరావిద్ధుండై తన కొసఁగ వేఁడ నామె తండ్రి యీయకొనమి విదర్భధరాధిపుపై దాడివెడలె ననియుఁ జెప్పెను. అంతవిక్రమార్కుఁ డాయత్తసైన్యుండై భట్టి సహాయముగఁ బోయి శకాధిపుని సమరంబున సమయించి యనంగవతిఁ గేలుఁ గీలించెను.

చారుఁ డొకఁడు వచ్చి చిత్రకూటాద్రి నొకముని చిరకాలమునుండి తపమాచరించుచున్నను నాతని కంబిక ప్రసన్న గాకుండె నని విక్రమార్కునకు విన్నవించెను. అపు డాతఁడు హైమవతిఁగూర్చి తప మాచరింపఁ బూనెను. అంబిక తనకుఁగూడఁ బ్రత్యక్షము గామిఁ గినిసి తనశిరముఁ దఱిగి యర్పింప సంసిద్ధుండయి ఖరాసి చేఁబూని మెడయం దుంచుకొనఁ బార్వతి ప్రత్యక్షమయి వలసిన వరము వేఁడుమనెను. అంత సుగుణోపేతుం డగు నావిక్రమార్కుఁడు దన కొసఁగఁ దలఁచినవర మాతాపసి కొసఁగుమని చెప్పెను. విక్రమార్కుండు రాజసూయ యాగ మొనరించిన పిదప నొకనాఁడు వేటకుఁబోయి చాల దప్పిపడియుండ నొకభూసురుఁడు గాంచి తనపాత్రములోని శుద్ధోదకంబున నాతని సేదదీర్చెను. కృతజ్ఞుం డగునారాజావిప్రు నిదనపురోహితునిఁగఁ జేకొని పోషించుచుండెను. ఇటులఁ గొంతకాలము గడచినంత నొకనాఁ డాభూసురుఁ డమూల్యాలంకృతుఁడై యుండినరాజపుత్త్రుని దస్కరించి గృహంబునఁ దాఁచి యాయలంకారంబుల విక్రయింపఁ జనుచుండ సేవకబద్ధుండై రాజసభకుం గొనిపోఁబడెను. అపటివారెల్ల రీబ్రాహ్మణు దండనార్హుఁడని చెప్పఁబూనఁ గొంపుటుపకారము జ్ఞప్తికిం దెచ్చికొని యీతని రాజు క్షమింప భూసురపుంగవుం డారాజతనూజుం దెచ్చి సభలో నిలిపి జనస్వభావము శోధింప నిటులు గావించితినని చెప్పెను. పదంపడి, కొంతకాలంబునకుఁ గమలాకరుం డనుమంత్రియొకవిప్రుం డయ్యెడకుఁ జని కాంచీపురమున ననన్యసామాన్యరూపవతి యగునొక వేశ్యాంగన కలదనియు దానితో సుఖింప నేగునరు

నినొకరక్కసుఁడు పరిమార్చెననియుఁ జెప్ప నాపలుకులు విని విక్రమార్కుం డయ్యె డకుఁ జని యారక్కసు నుక్కడఁగించి యాపె నొకయవనీ సురునకుఁ బరిణయము గావించెను.

తదనంతరం బొకనాఁ డాగా జటవీప్రదేశంబునం దొక భూరుహమునీడ నాసీనుఁడై యుండఁ దచ్ఛాఖాపత్త్రంబులఁ గలకులాయంబున నున్న యొకపక్షి వేఱొకపక్షితో నిట్లనియె. వింధ్యాద్రినికటంబునందొక నికషాత్మజుఁ డనుదినంబుఁ దనకాహారముగా నొకనరుని భక్షించుచుండు నిట్లు నేఁడు దనమిత్త్రుఁడగునొక బ్రాహ్మణుని వంతు వచ్చెననియు దానఁజేసి తాను మిగుల విచారమగ్నుండైననియుఁ జెప్పుచుండ నానరాధిపుం డదివిని తా నయ్యెడకుం జని యాబ్రాహ్మణునకు మాఱుగ దన్ను భక్షింపుమని వేఁడ నాతనియుపకారబుద్ధి కామనుజాశనుఁడు కడుసంతసించి వలసినవరము వేఁడుమన నాఁడు మొదలు మనుజులఁ జంపకుండునట్లు వేఁడి యొప్పించి యవ్వటువును వాసెను.

ఒకనాఁడు విక్రమార్కక్షమావల్లభుండు నిండోలగంబున నుండ నొక సిద్ధుండయ్యెడకుం జనుదెంచి యారాజునకిట్లు చెప్పెను. 'లాటదేశంబునఁ గల యొకవల్మీకము మీఁద నసమానవిలాసిని యనునొకపడంతుక గలదనియు నాపెఁ జేతిఁ నంటినపురుషుని దనపురికిం దెచ్చి యాతని మజ్జనభోజనాదులఁ దృప్తిపఱచుననియు నాపెచే మాఁడుమాట లాడించినవానికిఁ బరిణయముఁ గావించుకొనునని యుఁజెప్పెను. అంత విక్రమార్కుం డగ్గలం బగుతమకంబున నయ్యెడకుం జని యాపె కేల్వట్టి పుష్పపురంబునకుం దీసికొని వెళ్లెను. శయ్యాగృహంబునందా రాత్రి యాపె మిన్నక ముసుఁగువెట్టుకొని పరుండియుండెను. అంత రాజచ్చోట నున్న దివ్వెకంబమును దనమంత్రప్రభావంబున సజీవముగఁజేసి యొక కథఁజెప్పుమని కోర నాకంబ మీదిగువకథను వాకుచ్చెను.

ఉత్తరపథభూములందు నాకపురంబును మించు నాగపుర మేలు ధర్మధ్వజుండను భూపాలునకుఁ గామమంజరి యనునొక చక్కనికొమరిత గలదు. ఆపె సురూపలావణ్యసంపద కనురూపుఁడును, సింహళేశ్వరకుమారుండును, హేమాంగుండును నైన హేమాంగదున కొసఁగి పరిణయముఁ గావించెను. ఇట్లుండఁ గొంతకాలంబునకు నిజమాతాపితృలం గాంచఁ గౌతూహలాయత్తచిత్తుఁడై హేమాంగదుండు సతీయుతముగ సింహళంబునకుం బయనమాయెను. రా జీసంగతి విని ప్రళయకాలరుద్రునిభంగిఁ గోపారుణితలోచనుండై నిజదండనాథుం డగు నీతిధ్వజుని వానిం బట్టికొని తేర నియోగించెను. అంత నీతిధ్వజుండు యుద్ధసన్నద్ధుండయి యాతని వెన్నాడెను. అటఁ గామమంజరీయుతుండగు హేమాంగదుం డొక పుణ్యోపవనప్రాంతంబున నిజభార్యాంక ముపధానము సేసికొని

యొకతరుచ్ఛాయ శయనించియుండఁ దద్భార్య యాకలకల మాలించి దిక్కులు పరికిం
చి తజ్జనకుని సేనాసంఘంబుగా నెఱింగి భర్తను నిద్రాభంగము నెఱింగి గాకుండ వె
లువడి సంగరరంగబున వారినెల్లరఁ బరిమార్చి వచ్చి మేల్కాంచిన తనభర్తకీసంగతి ని
వేదించెను. పిదప వారిరువురు యథేచ్ఛ నొకపురంబుఁ జేరిరి. ఆచట భర్త పురంబున
కాహారపదార్థములఁ గొన నరిగి యొకవారాంగనయొక్క మాయలం దగిలి భార్యయ
గు కామమంజరిసంగతి మఱచెను. రాజపత్ని భర్త జాడఁదెలియనేరక విలపించి పతిఁ
బాసినసతి బ్రతుకు నిరర్థకం బనితలఁచి జన్మజన్మంబునందును హేమాంగదుండే తనకుఁ
బతియగునటులు ప్రసాదించునటులు భగవంతునిఁ బ్రార్థించి, చితిం జొచ్చి యసువుల
బాసెను. ఇంతలో హేమాంగదునకుఁ దనభార్యసంగతి జ్ఞప్తికిరా, దానియొద్దకుం జ
ని భార్య మృతినొందుట విని తానుగూడ నగ్గిప్రగ్గను. అంత వీనికంతకుఁగారకురాల
గు వేశ్యాకాంతయు నాపె బానిసయు వీరి ననుసరించిరి. అంత నాకాళి వీరలనందఱను
బ్రతికించెను. ఈనల్వురలో నెవరు సాహసులని దివ్వెకంబ మడుగఁగా రాజు వా
రాంగనయే సాహసురాలనియె. హంసతూలికామధ్యంబునం గలయా కళావతి లేచి
రాజుంజూచి బానిసయే యొక్క వసాహసురాలని చెప్పి మరల నిద్రించెను.

విక్రమార్కుండా పెను రెండవపర్యాయము పలుకరింపఁదలఁచి కర్పూరకరండ
మునకుఁ బ్రాణము లొసంగి యొకకథఁ జెప్పుమన నాభరణి యిటుల చెప్పఁదొడఁగె
వంచకపురమును బాలించు విక్రమకేసరి యనుభూపాలున కొక చక్కని చుక్క య
గునుమాదేవి యనుభార్య గలదు. వారికి సుగుణశేఖరుం డగు రాజశేఖరుం డనుకు
మారుండు గలఁడు. అతఁడొకనాఁ డడవికి వేటాడఁజని యట నొకయోగిని ద్రికా
లవేది యనునొక చిలుకను గాంచెను. ఆచిలుక రాకొమారుని గాంచి నీకిపుడే వివాహ
మగునని చెప్పెను. ఆసమయమున నే కన్యకాపరివారముతోఁ జతురిక యనెడికన్యక
వచ్చి యవంతిపుర మేలెడి రాజుకూఁతు రగు కామమంజరి యారాకొమారుని వరియించి
వివాహమాడ నుండెనని చెప్పెను. రాజశేఖరుం డవంతికిం జని రాజపుత్రిం బెండ్లా
డెను. రాజపుత్రియొద్ద నొకత్రికాలవేది యనుకీరము కలదు. చిలుకయు, శారికయు
నొకనాఁ డొకశాఖ నధిష్ఠించి స్త్రీపురుషుల గుణాగుణంబులఁగూర్చి సంభాషించు
చుండ నానూతన దంపతు లచ్చోటునకు వచ్చి యేమి ప్రసంగించు చుంఢి

రని ప్రశ్నింపఁ బురుషులు చెడ్డవారని శారికయు, స్త్రీలే చెడ్డవారని కీరమును వచియింప నెటులని యడుగ వారికీకథను శారిక చెప్పెను.

కాంచనపురంబునధర్మగుప్తుఁడనియెడు సెట్టికిధనగుప్తుఁడనియెడిపుత్త్రుఁడుగలడు. అతఁడుతనధనమునంతయు దంధనము గావించికంచికింజనితనమేనమామకూఁతు రగురాగతరంగిణియనుబాలికామణింబరిణయమాడెను. అంత మేనమామయగుశ్రీగుప్తుఁడుతనకూఁతురాగతరంగిణి ననేకవస్తుసంపదల నొసఁగి యల్లునితోఁ బంపెను. అల్లుఁడగుధనగుప్తుఁడు భార్యను వెంట నిడుకొని వచ్చుచు మార్గంబున నున్నయొక కాననాంతరమున భార్యచెంతనున్న యాభరణముల నెల్లఁగైకొని యాపె నొకపాడునూతం ద్రోసి తనదారిం జనియెను. పిదపఁ గాంచనపురికిం జని ధనమంతయుఁ బాడుజేసెను. నడవిం జనుబాటసారు లాపెయార్తారవము లాలించి యాపెనా నూతినుండి పైకిఁ దీసి యానూతంబడుటకుఁ గారణ మడుగఁజోరు లాయెడకు వచ్చుసరికిఁ దనను దనభర్తను జంపనుంకించుతఱి భర్త నిజప్రాణసంరక్షణార్థమం దయ్యెడ నెటకో చనియుండెననియుఁ దానుగూడఁ జనుచుండఁ జీఁకటిలో నీనూతం గూలితి ననియు, బొంకి తనతలిదండ్రుల పేరు నివాసముఁ దెలుప వార లాయమను దలిదండ్రులకడకుం బంపిరి. పిదప ధనాశాపీడచే ధనగుప్తుండు కంచికిం జని మామచే గారవింపఁబడుచు సుఖంబుగ నుండెను. ఇట్లుండ నొక్కనాఁటిరేయి భార్యయొడలి నున్నభూషణంబు లపహరించి యాపెఁ జంప నుద్యోగించుతఱి నాపె యెలుగెత్తి వాపోవ శ్రీగుప్తుం డయ్యెడకుం జని యాతని నిలువెడలజేసెను. కనుక పురుషులు దుర్మార్గు లని చెప్పెను. స్త్రీలుదుర్మార్గులనుటకుఁ గీరమీక్రిందికథను జెప్పెను. విక్రమసింహ పుర మేలురాజునకు విలాసవతి యనుకొమరిత గలదు. ఆమెను సుధర్ముఁ డను భూపాలున కిచ్చి వివాహముఁ గావించెను. ఒకనాడొకభూసురుఁ డాబాలికంగాంచి మోహించి యతని నుద్యానవనమునకు రావింపఁ జీఁకటియం దాతఁడు సర్పదష్టుండై మరణించెను. రాజపుత్త్రి తనభర్త నిద్రించుసమయంబున నాతని వీడి యా వనమునకుఁ జనిభూత మావేశించియున్న యాశవమును జూచి శృంగారక్రియలం జేయుచుండ నాపెముక్కు నాభూతము కొఱికి పాఱిపోయెను, రాజపుత్త్రి వెఱఁగంది యానేరము నామెభర్తపై మోపి తనతండ్రికిం దెలుప

నాతఁడు వానిం జంప నాజ్ఞాపించెను. అపు డొకముని కల యుదంతముం దెలుప నల్లుని విడిపించి కూతును బురము వెడలఁగొట్టెను. కనుక స్త్రీలు దుర్మార్గులని కీరము చెప్పెను. ఇందులో యథార్థ మేదియని బరణి యడుగ బురుషులే దుర్మార్గు లని విక్రమార్కుఁడు చెప్పెను. అపుడు కళావతి లేచి స్త్రీలే దుర్మార్గులని చెప్పి కళ్ళమ్మల ముసుగుఁ బెట్టికొని శయనించెను.

గ్రంథ విమర్శనము.

క. చక్కన నీవైదుష్యము, చక్కన నీకావ్యరచనచాతుర్యంబుల్
చక్కననీవాగ్వైఖరి, చక్కన నీవంశమహిమ జక్కనసుకవీ
క. స్వాభావిక నవకవితా, ప్రాభవముల నుభయభాషఁ బ్రకాశింపన్
భూభువనంబున సరి లే, రాభారతి నీవుఁ దక్క నన్నయజక్కా.

యని సిద్ధనమంత్రి కవినిఁ గొండాడి కావ్యము రచింపఁ బ్రార్థించెనని జక్కన తన్ను గుఱించి వ్రాసికొనెను. పైనిఁ బేర్కొనఁబడిన గుణములందు స్వాభావిక కవితాప్రాభవముదక్క నితరగుణంబు లీయన యందుఁ బ్రాయికముగఁ గానంబడు. చక్కని వైదుష్యము, చక్కని కవిత్వచాతుర్యము, చక్కని వాగ్వైఖరి, యీయనయం దున్నట్లు ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. ఈమహాకవియొక్క కవిత్వ మెట్టిదో యొక్కమాటన చెప్పవలసివచ్చిన కవిత చమత్కారమైనదనిన సర్వము నందే యిమిడియుండును. ఈయన యందుఁ జమత్కృతి తక్క స్వాభావికపుష్టి యెక్కువగఁ గానరాదు. కళాకుశలుఁ డగుసువర్ణకారుఁడు తాఁ జేయు బంగారుప్రతిమకుఁ జక్కఁగ మెఱుఁగు వెట్టి, నగిషీయొనర్చి వివిధము లగుతొడవులతో నెట్లలంకరించునో యాలాగునే యిమ్మహాకవియుఁ దనకవితాకన్యకు నానావిధము లగు బాహ్యభూషణములఁ

గూర్చియు, విభ్రమవిలాస నర్తనముల నేర్పియు, మకరంద మొలుకు మంజులాలాపములఁ గలిపియు, నింక ననేకరీతుల హృదయానురంజక ములగు విన్నాణములను గలుగఁజేసెనుగాని రసోన్మేషణ మొనరించెడు నుజ్జీవశక్తి నిమాత్ర మీయలేదు. ఆకన్యకయందలి హావభావములు లాస్యయువతీ చిత్తవికారములు. ఆమె చతురమృదూక్తులు అభ్యస్తవి లాసినీ సరసోక్తులు. ఆమె గరువంపునడకలు నర్తననైపుణ్యపు మురి పెంపుగతులు. నునుసోగతీరును, నూతనసావర్ణకాంతియు, వివిధవిభ్రమ కళారుచులును దానియందున్నను, చంద్రసమాన భాసమానహాసయు, నుత్కంఠితవిరహాకీలాభీలజాలంబును, నవరసోజ్జ్వల భావనోత్తేజనం బును, దానియందుఁ గానరావు. నాగరకవిలాసినీలలామ వలెమైపుల కింపులు కొంత గలుగఁజేయునుగాని సహజసుగుణోపేత యగుస్నిగ్ధము గ్ధాంగనవలె నుల్లంబు నెల్లపుడుఁ గొల్లవెట్టనేరదు.

ఈకవియందు శబ్దవైచిత్రి యెక్కువ. వర్ణనాభిలాషయు మిక్కు టమే. చెప్పినదానినే పలుమాఱు చెప్పుచుండును. ఎన్నిసారులు చెప్పి ననుదనశబ్దజాల చాతురివలన నాయాభావములకు నూతనాకృతిఁ గల్పించిన ట్లగపడును. స్వభావసిద్ధ మగువిషయములను స్వభావోచిత మగుభాషను వ్రాయుట కీయన కిష్టమున్నట్లు కాన్పింపదు. అనురా గోద్రేకము, అనుతాపస్పందనము, కారుణ్యము, అహంకారము, మొద లగు హృదయస్పందన వికారములను వర్ణించునప్పుడు శబ్దచమత్కృతి కొఱకే చూచునుగాని కేవలము నైసర్గికభావవికసనము కొఱకుఁ దఱచు ప్రయత్నింపఁడు.

తల్లిదండ్రులు లనంగవతిని యత్తవారింటికిం బంపునపుడు కవియిట్లు వ్రాసి నాఁడు:—

తే. తల్లిపాదంబులకు మ్రొక్కి తలిరుఁబోఁడి,
యశ్రుపూరంబు ఱెప్పల నప్పళింపఁ
గలికికన్నులు మకరందజలము గ్రమ్మ,
గమ్మతమ్ములతమ్మి యై కరము మెఱసె.

ఇచట మాతాపుత్రికల హృదయంబుల ననుతాపము వెల్లువ సరిఁ దల్లడిల్లు చున్న సమయమున శబ్దశ్లేష కెక్కడఁ దావున్నదో కవీశ్వరునకే యెఱుక.

ఇంక వర్ణనలవిషయమై యించుక విచారింతము. ఈకవికి వర్ణనలయం దభిరుచి యత్యధికము. ప్రథమాశ్వాసమున మధురాపురీ వర్ణనము ముప్పదియేడు పద్యములును, పైఁగా నొకపాడవైన వచనభాగమును, బట్టినది. భారతములో నింద్రప్రస్థపురవర్ణనము పదిపద్యముల లోఁ బూర్తియైనది. ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమున వైకుంఠపుర వర్ణనము పదునొకండు పద్యములపై నొకదీర్ఘవచనముతోఁ దుద నొందించినాఁడు ఉత్తరహరివంశమున ద్వారావతీవర్ణనము మూఁడుపద్యము లలో నిమిడియున్నది. కావున నాంధ్రవాఙ్మయ ప్రణాళికాక్రమము నఁ జూడ నతిదీర్ఘవర్ణన లితనితోఁ బ్రారంభమైన వని చెప్పవచ్చును. ఇంక స్త్రీవర్ణనలవిషయమై వేఱె చెప్పవలయునా ? అవకాశ ముండిన స్థలములం దెల్లఁ దనివితీరనివర్ణనలతో నింపెను. వనవిహారమును జలక్రీడయు నెనిమిదిపుటలలో సుమా రఱువదిపద్యములతోఁ దేలినవి. వర్ణనలవిషయమై కవి కెంతమాత్రము విసువు లేనట్లు గాన్పించుచున్నది. గ్రంథమునం దనేకకథ లుండుటచే ననేకవిధము లగువర్ణన లావశ్యకము లయ్యెనని యొక కారణము చెప్పవచ్చును. కాని యీమాదిరిగ్రంథమైన భోజరాజీయమున, నింతయెక్కువగ వర్ణనలులేవు. కావున నీ కవి

యందు వర్ణనాచాపల్యము మిక్కుటమని చెప్పకతీరదు జక్కనకవిశైలి యంత స్వాభావికమైనదనియుఁ గాదు; కేవలము కృత్రిమమైనదియుఁ గాదు. అక్కడక్కడ నైసర్గికచిహ్నములు కాన్పించుచున్నను దఱచు శబ్దవైచిత్రికొఱకే కవి చిక్కులుపడుచుండును. ఇందున కుదాహరణములు పెక్కులు, చూపవచ్చును. బ్రహ్మసభ వర్ణించినప్పు డేకాక్షరప్రాసము కొఱ కెంతప్రయాసము నొందెనో చూడుఁడు:

సీ. మౌద్గల్యమాతంగ మాండూకమరీచి
మైత్రేయమాండవ్య మందపాల
కపిలకశ్యపకౌత్స కామందకణ్వాత్రి
కౌశికకౌండిన్య కలహభోజ
వాత్స్యాయనవ్యాస వాల్మీకివరతంతు
వాలఖిల్యవసిష్ఠ వామదేవ
శరభంగశుకశక్తి శార్ఙ్గ్యశారద్వత
శౌనకశాండిల్య శాలిహోత్ర
జడభరతజహ్నుజాబాలి జామదగ్న్య,
పులహపిప్పల పర్వత పుండరీక
గార్గ్యగౌతమగాలవ గణకముఖ్యు
లైనయోగీంద్రు లర్థిఁ గొలువ.

మహాభారతము సభాపర్వమున మునిసభావర్ణన మిట్లున్నది.

సీ. సుబలమార్కండేయ శునకమాండూకన
మాండవ్యశాండిల్య మందపాల
బకదాల్భ్య రైభ్యకభాలుకి జతుకర్ణ
గౌతమ కౌశిక కణ్వకుత్స
సావర్ణిపర్ణాద సత్యగోపతిగోప
వేషమైత్రేయ పవిత్రపాణి

ఘటజానుకాత్రేయ కఠకలాపసుమిత్రి
హారీతతిత్తిరి యాజ్ఞవల్క్య
వాయుభక్ష భార్గవవ్యాసజైమిని
శుకసుమంతుపైల సువ్రతాదు
లయినమునులు నేము నరిగితి మెంతయు
రమ్యమయిన ధర్మరాజుసభకు.

ఉత్తరహరివంశమున :—

గీ. గౌతమాత్రి విశ్వామిత్ర కణ్వయాజ్ఞ,
వల్క్యజాబాలి కాశ్యపవామదేవ
రైభ్యధూమ్రవాల్మీకి పరాశరాంగి,
రఃపవిత్రాక్షశంఖకర్ణ ప్రభృతులు.

కళాపూర్ణోదయంబున :—

శా. కౌండిన్యాత్రిమరీచి దక్షకపిలాగస్త్యాక్షపాదంగిర
శ్శాండిల్యక్రతుకణ్వకుత్సభృగు విశ్వామిత్రమైత్రేయ మా
ర్కండేయాసురివామదేవకపిదుర్వాసో బకవ్యాఘ్రపా
న్మాండవ్యాదిమహామునుల్ చనిరి ప్రేమ న్మింటఁ దత్సేవకున్.

మఱి యొకదృష్టాంతము:— సూర్యోదయ వర్ణనంజూడుఁడు:—

సీ. సకలలోకంబులుఁ జక్రవాకంబులు నుల్లాసవారాసి నోలలాడ
నంధకారంబులు నలచకోరంబులు సొబగేదిగొందులు సొచ్చిడాఁగ
నయనకంజంబులు నలినపుంజంబులు సువికాససంపద సొంపుమిగుల
రాయంచదాఁటులు ప్రమోముబేఁదేఁటులు గృహసరోరుహములఁ గేలి
సలుప
విమలతారకములు వివిధకోరకములు,
నచ్చటచ్చట నల్లనల్ల విరియ

హల్లకములుబుధుల హస్తముల్ మొగుడంగఁ
బూర్వశిఖరిమీఁదఁ బొలిచెనినుఁడు.

మఱియుఁ గాశికాపురియందు :—

సీ. రూపమొక్కటి రెండు రూపులై చెలువొందు
మూఁడు మొనలపోటు ముట్టఁబట్టు
బాహుచతుష్కంబుఁ బంచాస్యములుఁబూను
షణ్ముఖుపైఁ బ్రేమ సలుపుచుండు
సప్తాశ్వచంద్రు లీక్షణములు గానొప్పు
నెనిమిదిమూర్తుల వినుతికెక్కు
నవనిధీశసఖుం డనంగఁ గీర్తి వహించుఁ
బదికొంగు లైనయంబరము గట్టుఁ
బదునొకండువిధంబులఁ బ్రణుతి కెక్కు
వెలయఁబన్రెండుగనుపుల విల్లువట్టుఁ
గర్మపాశలవిత్రవిఖ్యాతి మెఱయుఁ
గాశిలో మేను దోఁచిఁగినఘనయశుండు.

ఇవ్విధంబున ననేకదృష్టాంతములు కానంబడు. శబ్దవైచిత్రిఁ జూపుటయు, భావచమత్కృతిఁ గల్పించుటయు నీయనయందలి ముఖ్య విశేషములు. భావనిసర్గత, భావనాప్రజ్వలనము, రసోద్రేకము, మున్నగు నుత్తమకవనస్వాభావిక గుణవిశేషము లచ్చటచ్చటమాత్రము పొడసూపును. వర్ణనాచమత్కృతియుఁ గల్పనాచాతుర్యము, వక్తృత్వప్రావీణ్యము, కథారచనస్వారస్యము, గ్రంథమం దెల్లెడలను గాన్పించును.

కవితాధోరణి నిరర్గళము:—ఉత్తుంగతరంగములతో నొప్పారు మహాప్రవాహమువలెఁ బొంగిపొరలుట లేదుగాని యెచ్చోటనైనను రసవిహీనముగా నుండనోపదు. పద్యములు కమ్మచ్చునఁ దీసినతీఁగలవలెఁ జక్కఁగా సాఁగును. మధ్యమధ్య ననందర్భపు విఱుపులు గాన

రావు. శబ్దజాలమందు లాలిత్యము, మార్దవము, సుస్వనము, మున్నగు సౌకుమార్య శయ్యాలక్షణములు మెండు. అచ్చతెనుఁగుశబ్దములకంటె గీర్వాణశబ్దముల సంఖ్యయె హెచ్చు—కాని శ్రీనాథునియందువలెఁ గఠినపదగ్రథితదీర్ఘసమాసములు తఱచు గానరావు. ఈయనయందలి సమాసములు దీర్ఘములయ్యును నాతికఠినములై లలితపదకలితములై వీనులకు విందొనరించుచుండును. అర్థాలంకారములకన్న శబ్దాలంకారములవ్యాప్తి యెక్కువ. మొత్తముమీఁద శైలి మిక్కిలి స్వాభావికమైనది కాకపోయినను బహుశోభాయమానమై, ప్రతిపద్యహృద్యమై, విద్వత్ప్రియులకుఁ, గడురమణీయముగ నుండును.

కథారచనయు, పాత్రపోషణము

కథారచనయుఁ, బాత్రపోషణమునుగూర్చి యొండురెండు మాటలు చెప్పెదను. ఈగ్రంథమం దనేకకథ లున్నవి—అందుఁ గొన్ని చిన్నవియుఁ గొన్నిగొన్ని పెద్దవియు. ఏకథఁ జదివినను యొకనూతన రుచి కలుగుచునేయుండును. దీనిరహస్యము కవిత్వమందలి శయ్యాపాక రీతుల మైత్రి యని నాకుఁదోఁచుచున్నది. కాని భావప్రకటన, రసపోషణ, సంభాషణానైపుణ్యము, మొదలగు మానవప్రకృతి ప్రదర్శకము లగుగుణము లంతగఁ గానరావు. స్త్రీపురుషులు నాగరకశిఖామణులవలె నైపుణ్యము పచరింతురు గాని నైసర్గిక ప్రకృతులను బ్రకటింపరు. ప్రకృతిసిద్ధ మగుభావములు, నంతశ్శుద్ధి యగురసములును, కనుపరుపక, నాజూకుతనమును జాణత్వమును, విటవిటీవిన్నాణములును జూపింతురు. కావున స్వచ్ఛమగు మానవప్రపంచముఁ జూడఁగోరిన నీగ్రంథమందు వెతకుట నిష్ఫలము.

కుకవుల నిరసించుచు జక్కనకవి చెప్పినట్లు-

క. ప్రతిపద్యముఁ జోద్యముగాఁ,
కృతి జెప్పిన నొప్పుఁగాక కృతి నొకపద్యం

బలిమూఢుఁడై నఁ జిత్రతఁ,
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్.

అనినట్లు ప్రతిపద్యము చోద్యముగాను, హృద్యముగా నుండు నట్లు రచింపఁబడిన యీవిక్రమార్క చరిత్రమునందు శైల్యుదాహర ణోచితము లగుపద్యముల నెత్తి వ్రాయుట దుస్సాధ్యమగువని కాదు. అయినను పైనిఁజెప్పఁబడిన యభిప్రాయములఁ బ్రతిపాదించుటకు మఱి కొన్ని యుదాహరణపద్యములఁ దిఙ్మాత్రముగఁ బొందు పఱచు చున్నాను.

(i) శబ్దచాతుర్యము :—

ఉ. రాజు సహోదరుండు రతిరాజు తనూజుఁడు తండ్రి వాహినీ
రాజు వరుండు లోకములరాజు గ రాజితలీల నొప్పు నా
రాజమరాళయాన సిరి రాజ్యరమారమణీయుఁ జేయుతన్
రాజనుతప్రతాపగుణరమ్యుని జన్నయసిద్ధధీమణిన్.

(ii) శైలీసౌకుమార్యము :—

సీ. మకరంద నిష్యంద మందారమాలిక
కబరీభరంబున సొబగుమీఱ
రమణీయమౌక్తిక రత్నహారంబులు
కుచకుంభములమీఁదఁ గోమరుమీఁగులఁ
గాంచనాంచలదివ్య కౌశేయచేలంబు
ఘనకటీతటమునఁ గరము మెఱయ
ఘనసారకాశ్మీర గంధసారోదార
మృగమదపంకంబు మెయిఁ దనర్ప
మఱియు బహువిధశృంగారమహిమ మించి
హాటకోన్నతదివ్య సింహాసనమునఁ

వేజరిల్లెడు పార్వతీ దేవికరుణ
మంత్రి జన్నయసిద్ధుని మనుచుఁగాత.

(iii) శబ్దార్థస్వనసమ్మేళనము, నార్భటియు :—

సీ. కల్పాంతదుర్దాంతకలుషాంతకస్వాంత దుర్వారవహ్నికి నోర్వవచ్చు
నిష్ఠురనిర్ఘోషనిర్ఘాతసంఘాత జాతమహావహ్ని సైఁపవచ్చుఁ
బ్రళయకాలాభీలఫాలలోచనఫాల భాగానలస్ఫూర్తిఁ బ్రతుకవచ్చుఁ
గాకోదరేంద్రదప్ఫూత్కారసంభవతీవ్ర కాకోలదహనంబుఁ గదియవచ్చు
గాక సైరింపవచ్చునే లోకదహన,దర్పితంబైనయస్మత్ప్రతాపవహ్నిఁ
దావకోత్సాహసాహసౌదార్యధైర్య,గతికిమెచ్చితివిక్రమార్కక్షితీంద్ర

(iv) అనుప్రాసము :—

ఉ. ఇక్షుధనుర్విపక్షుని రవీందుకృశానుని సర్వదేవతా
ధ్యక్షుని నాదిభిక్షుని హతప్రతిపక్షుఁ గృతాంతదంతిహా
ర్యక్షు మహామునీక్షుశరణాగతరక్షణదక్షు శ్రీవిరూ
పాక్షుని నానతేంద్రికమలాక్షునిఁ గాంచెఁ గృపాకటాక్షునిన్.

(v) భావచమత్కృతి :—

చ. అలరులతోఁటలోన విరులన్నియుఁ గోసితి రంచు బోటులన్
సొలయఁగ నేల బాల యిటు చూడఁగదే తిలకావనీరుహం
బులదెస భ్రమరవ్రాతండములు పుష్పము లున్నవి యంచుఁ బోడమై
పలుకువయస్యనేర్పుఁ గలభాషిణు లెల్లను మెచ్చిరిచ్చలన్.

(vi) శ్లేషానుప్రాసాది సంపత్తి :—

సీ. లక్ష్మీసముత్పత్తి లావణ్యసంపత్తి
గోత్రరక్షణవృత్తిఁ గొమరుమిగిలి
కవిరంజనాసక్తి ఘనరసోదయయుక్తిఁ
బూర్వాపరవ్యక్తిఁ బొలుపుమిగిలి

పటుసత్త్వవిస్ఫూర్తి బంధురతరకీర్తి
గంభీరతాపూర్తి గరిమ కెక్కి
వాహినీశఖ్యాతి వరరత్నమయభాతిఁ
బురుషోత్తమప్రీతిఁ బొగడువడసి
త్రిజగదానందకరకళా దీప్యమాన
రాజసందర్శనోత్సవ రసనిరూఢి
నతిశయిల్లెడునీకు సయ్యంబునిధికి
మహితసద్గుణసమితిమై మైత్రియొనరు.

ఇట్టిపద్యములు లెక్కకు మీఱి గ్రంథమందంతటనుఁ గాన్పిం చును. వీని యందు ముఖ్యముగఁ గన్పట్టు—వైదుష్యమురచనాచాతు ర్యము, పదలాలిత్యము, వర్ణనాప్రౌఢిమ—అనునీగుణములచే జక్కనక విత్వ ముత్కృష్టతనుఁ బొందినది. కావుననే యాధుని కాంధ్రపండితవతం సుఁడననొప్పు బ్ర॥ శ్రీ॥ వేదము వేంకటరాయశాస్త్రులవారు తమ "శార దా కాంచిక ప్రథమకింకిణి" యను విక్రమార్కచరిత్ర ముద్రణవిమ ర్శనమున నీకవినిగూర్చి యీక్రిందియభిప్రాయమును నుడివిరి—"జక్క నకవి విక్రమార్కచరిత్రము అల్లసాని పెద్దనగారి పాండిత్యమును, ముక్కు తిమ్మనగారిలాలిత్యమును, రామరాజభూషణుని ప్రౌఢియుంబో రసిచెన్నారుచున్నది." ఇదినిక్కము. జక్కనయందు అల్లసానిపెద్దనపాండి త్య మున్నదిగాని యాతనిరసోన్మేషణశక్తి లేదు; ముక్కుతిమ్మనమృ దూక్తు లున్నవిగాని యాతని ముద్దుపలుకులులేవు; రామరాజభూ షణుని వాక్ప్రౌఢి యున్నదిగాని యాతనిభావ భావనాప్రజ్వలము లేదు; శ్రీనాథునినడబెడం గున్నదిగాని యాతని గరువంపు సొంపు లేదు. ఇవ్వి ధంబునఁ గొన్నిసుగుణంబు లున్నను, గొన్నిలేవు. ఎటులైనను, ఆంధ్ర మహాప్రబంధకర్త లగు శ్రీనాథాదులతో నొరయు ప్రతిభాశాలిమై, అనేకవిధములఁ జెన్నువహించిన యొుడు గ్రంథరాజంబునకు నిర్మాత

మై, ఆంధ్ర వాఙ్మయమున నాచంద్రార్క మగుకీర్తి పెంపున విరాజిల్లు చున్న మహాకవియ జక్కన.

జక్కనయు, అనంతామాత్యుఁడును.

పౌరాణికకాలమున భరతవర్షమును బాలించి దిగంతవిశ్రాంత విఖ్యాతి నొందిన దిలీపుఁడు, మాంధాత, హరిశ్చంద్రుఁడు, మొదలగు మహాచక్రవర్తులతోఁ దులఁదూఁగెడు యశోగౌరవములుగడించి దుష్ట శిక్షణ. శిష్టరక్షణ, ధర్మైకవీక్షణ, ఇత్యాద్యుత్తమక్షత్రియవిధు లనవరతము నిర్వహించి, యాచంద్రార్కస్థాయియగు యశోజీవము నొందిన హిందూచారిత్రిక మహాచక్రవర్తులగు విక్రమార్కుఁడును, భోజుఁడును, ననేకపురాణకథలకును, విచిత్రేతిహాసములకును, మహాకవి ప్రశంసలకును బాత్రము లయిరి. జక్కన తన విక్రమార్కచరిత్రమున విక్రమార్కునిగూర్చి యిట్లుప్రశంసించె:—

సీ. భరతునిలాగునఁ బరశురామునిభాతి
రంతిదేవునిభంగి రాముగరిమ
నంగుఁరేఖ యయాతిభావంబునఁ
బృథువిధంబున భగీరథునిమాడ్కి
గయులీల మాంధాతకై వడి నంబరీ
షునిరీతి శశిబిందు సోయగమున
శిబిపోలిక మరుత్తుచెల్వునను దిలీపు
కరణి సుహోత్రునిగారవమున
సగరుదెరువునఁ బురుకుత్సునరణి నలుని
రమణ నర్జునుక్రియఁ బురూరవునిచంద
మున హరిశ్చంద్రుతెఱఁగున వినుతి కెక్కి
సాహసాంకుఁడు వసుమతీ చక్రమేలె

అనంతామాత్యుఁడు తనభోజరాజీయములో భోజునిగూర్చి యిట్లుగ్గడించెను —

క. బలిరాజ్యము రామమహీ, తలపతిరాజ్యంబు ధర్మతనయునిరాజ్యం
బిల నెట్టి దట్ల భోజుని, సలలితరాజ్యంబు సర్వసౌఖ్యములందున్.

అట్టియీయిరువురి రాజ్యకాలములలో గీర్వాణభాషావాఙ్మయమును హిందూ నాగరకతయును సమస్తవిధములఁ బోషింపఁబడి వృద్ధినొందినవి. కాళిదాసు, భవభూతి, దండి, మొదలగు సంస్కృతమహాకవులు వీరియాస్థానములలో వన్నెఁగాంచిన ట్లనేకవిధము లగు పుక్కిటికథలు వేనవేలుగా నుప్పతిల్లి పండితపామరులకు మేరలేని సంతోష మిప్పటికిని గలుఁగఁజేయుచున్నవి. వీరిద్దఱుఁ దమతమ రాజ్యకాలములలో నొనరించిన యద్భుతకార్యములను సాహసౌదార్యచర్యలను వర్ణించిన గ్రంథము లీవిక్రమార్కచరిత్రమును, భోజరాజీయమును, అయినను నిక్కముగఁ జరిత్రాంశ మొక్కటియైనను నీయుభయగ్రంథములయందును గాన్పింపదు. ఈ రెండుగ్రంథముల కథానాయకు లెట్లు సమానప్రశస్తిచే నొకరితో నొకరు తారతమ్యనిర్వచనమున కనువిచ్చుచున్నారో యాలాగునే యాయాగ్రంథములు రచించిన కవులగు జక్కనయు, ననంతామాత్యుఁడును సమకాలికు లగుటంజేసియు, సదృశగ్రంథ రచయిత లగుటంజేసియుఁ, గవితాగుణతారతమ్య నిర్ణయమున కవకాశ మిచ్చుచున్నారు.

జక్కనకవి యిద్దఱు దేవరాయలకాలములో జీవించియుండి నట్లు వెనుక తీర్మానించితిమి; అనఁగా, ఆయన క్రీ॥ శ॥ 1400—1450 సం॥ రములమధ్యనుండెను. అనంతామాత్యుఁడు తన రసాభరణమును క్రీ॥ శ॥ 1434 సం॥న రచించెను; భోజరాజీయమును, గొంచెము హెచ్చుతక్కు వగా నా సమీపకాలములోనే రచించియుండును, గనుక

నీయుభయకవులును, సమకాలికులనుటకు సందియము లేదు. ఏగ్రంథము ముందుగా వ్రాయఁబడినదో నిర్ణయించుటకు వీలు గాన్పింపదు గాని యొకరు వ్రాసిన గ్రంథమును రెండవవారు కనిగాని విని గాని యందుకు సరియైన గ్రంథమును వ్రాయ నుత్సహించియుండు రని చెప్పుట తప్పు కాదు. ఉభయకవులును సమకాలికులై యొకేవిధ మగుచరిత్ర నాంధ్రీకరించుటచే వారికవిత్వములను గుణసామ్యభేదనిరుక్తిని విమర్శించుట సందర్భయుక్తమని తోఁచినది.

ఇచ్చట 'భోజరాజీయమును' సంపూర్ణముగ విమర్శించుట నాయుద్దేశము కాదు. ఈయుభయకవుల కవితాపద్ధతులను గ్లుప్తముగాఁ బరిశోధించి యిదమిత్థమని నిరూపించివిడిచిపెట్టుటయే నాప్రస్తుతోద్యమము.

ప్రజ్ఞావిశేషమందును, ప్రతిభాసంపత్తియందును, ప్రకృతిస్వారస్యమందును, గవిత్వవైభవమందును, ఏ యిద్దఱుకవులు నీయిద్దఱువలె భేదింపరు. జక్కనయొక్క కవిత్వపద్ధతి వేఱు, అనంతామాత్యుని కవనధోరణి వేఱు. కథాసంవిధానము, పాత్రపోషణము, వక్తృత్వప్రౌఢి, కవితాధార, ఇత్యాది యేయేవిషయములఁ జూచినను భేదము విస్పష్టముగాఁ గాన్పించుచున్నది, స్థాలీపులాకముగా వారి శైలియందలి సామ్యభేదముల నిరూపించెద.

(i) కవనశైలి: జక్కనకవిశైలి చాలవఱకుఁ గృతకమైనదని యిదివఱకే చెప్పితిని. అనంతామాత్యుని శైలియన్ననో కేవలము నైసర్గికమైనది. అనఁగా, సహజములగు మనోభావములను నిర్వక్రముగా వెల్లడించుటయుఁ జెప్పవలసిన దానిని సరళములైనమాటలతో నుగ్గడించుటయు, శబ్దాడంబరము కొఱకును, అలంకార చమత్కృతి కొఱకును, పెనఁగులాడక, ప్రకృతిస్వభావము నున్న దానిని నున్నట్లుగా

వర్ణించుటయు, నిత్యాదిమార్గములఁ బోయినది. ప్రకృతి విషయము లను వర్ణించునప్పు డీకవి, తనసూక్ష్మదృష్టి కవి యెవ్విధముగఁ దోఁచు నో యాయావిధముల స్వభావోక్తిగవర్ణించును. దీనికుదాహరణములు:

(i) పుష్పాపచయము :—

మ. తరుణీరత్నము పువ్వుఁదీఁగె నొకచేత న్వంచి పాదాగ్రమున్
ధరణిన్ మోపి యొకింత నిక్కి తనుమధ్యం బొప్పఁ గక్షద్వయ
స్ఫురణం బారఁ గుచంబులుబ్బ నయనంబు ల్విచ్చి లీల న్ముఖాం
బురుహం బెత్తి యొకర్తు గోసె నెలమిన్ బుష్పంబు లత్తోఁటలోన్.

(ii) మూషకకిశోరవర్ణనము :—

వ. మఱియు నచ్చిఱుతయెలుక తనతోఁటలోనన యుండి వెలుపలికిఁ దనమూఁతి సాఁపుచుం దలచూపిమఱలఁ దిగుచుచు నర్ధశరీరంబు దోఁ ప నిగిడి మగుడుచుఁ బుచ్ఛంబు దక్కం దక్కినశరీరం బంతయు బయ లుపడ నించుక సేపు కంపంబు నొందుచు నుండియుండి మఱచితలఁచిన ట్లదరిపడి తిరిగి తొఱ్ఱచొచ్చుచు వెండియు నుండలేక వెలువడి శాఖా మార్గంబునఁ గొంతదవ్వరిగి పర్ణరవంబు కర్ణంబులుసోఁకినం బెదరి కోట రద్వారంబునకుం బఱతెంచుచు నిట్లు శైశవక్రీడలు నడిపి తదనంతరంబ యెలఁబ్రాయంబు సొచ్చుదు నూఁగుదోసపిందెగతి నందం బగుదేహం బును దరుణశాకినీమూలంబును బోలువాలంబును శాల్మలితూలకంబళం బువిధంబున నత్యంతమృదులం బగునుదరంబును నాఖుకర్ణిపర్ణంబుల మాడ్కి రిక్కించుకొనియున్న కర్ణంబులును నలంతిపూస లంటించినట్లు దనరు కనుంగవయును నుచ్చింతపువ్వులలోని కేసరంబులక్రియ భాసురం బగుపలువరుసయుఁ దనవయోరూపంబుల కనురూపంబు లగుచుండఁ జెలంగి సెలగొమ్మ లెక్కి వ్రేలుచుఁ బలిష్ఠంబు లగుతిర్యక్శాఖలపై మల్లగింతులు వెట్టుచు నాకుజొంపంబులు సొచ్చి దాఁగుచు నిటు బహు విధంబుల విహరించుచుండు నమ్మూషకయోషం జూచి."

ఇటువంటివర్ణనలు మచ్చునకైనను జక్కనయందుఁ గానరావు. ఎక్కడ నేవిషయములు వర్ణించినను దెలుఁగుకవులకందఱకు సర్వసామాన్యపరికర మనఁదగుకలువలు, తామరలు, జక్కవలు, చకోరములు, మున్నగునవి దక్క నితరవస్తునికరము నేమియును వాడియుండలేదు; కాని యీ సామాన్యపరికరములోనే తనశబ్దజాలైంద్రజాలముచేతను, రచనాచమత్కృతిచేతను (Kaleidoscope) కలీడస్కోపులోనున్నబొమ్మలవలె నూతనాకృతులను గల్పించెను. అనంతామాత్యునియందు వర్ణనాసారళ్యమును, జక్కనయందు వర్ణనాచమత్కృతియుఁ, జాల హెచ్చు.

(ii) కవితాధారయు, భాషాప్రావీణ్యమును, బదగుంభననైపుణ్యమును నీయిద్దఱయందును గొంతవఱకు భేదించుచున్నవి. స్వతస్సిద్ధమైన ధారాపుష్టిఁగల కవిత్వము జక్కనది: నన్నయభట్టు, శ్రీనాథులయందువలె, సంస్కృతభూయిష్ఠమై యది ధారాళముగఁ బ్రవహించుచుండును. శబ్దములు తమంతటఁదా మప్రయత్నముగా మొలచినట్లగపడును. పద్యములపొంకము నిశ్శంకము: హారువు కరువునఁ బోసినట్లుండును. అనంతామాత్యుని కింతధారాశుద్ధి లేదు. ఆయన పద్యములక్కడక్కడఁ బ్రయత్నప్రసారితములుగాఁ గనఁబడుచుండును. కొన్నిచోట్ల శబ్దములకొఱకుఁ గవి తడవినట్లును గాన్పించును. తిక్కన, సూరనలవలె దేశ్యపదములనే తుప్పతిప్పలుగా వాడినను, వారి శబ్దములయందలి యింపుసొంపులు కవి సాధింపలేదు. కల్పనలయం దెట్లో యట్లే భాషాశిల్పమునందును, అనంతునికి సద్యఃస్ఫూర్తి యొకింతతక్కువయే.

(iii) ఇంకఁ, బాత్రపోషణ, పాత్రౌచిత్యము, పాత్రసంభాషణ, మున్నగు పాత్రసంబద్ధవిషయముల నిద్దఱుకవుల నెంచిచూతము. 'భోజరాజీయ'మందలి కథలు నీతియుక్తములు- ధర్మబోధకములు నై యున్న

వి. కావున నందువచ్చెడు పాత్రములు యోగ్యప్రవర్తనముఁను ధర్మాచరణమును బ్రకటింతురు. ప్రతికథయందును శృంగారవిషయములు పెనఁగొనియున్నను, నందలి శృంగారము నీతిబాహ్యము గాక ధర్మప్రవృత్తికి సహకారిగనే యుండును.

క. సూత్రకథ భోజరాజచ, రిత్ర మనెడునట్టిధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ,శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్

విక్రమార్కచరిత్రమో, యట్లుకాదు. అందలికథలు సామాన్యముగ నీతిబాహ్యములై, విశృంఖలశృంగార విచేష్టితములచే, విరాజిల్లుచున్నయవి.

ఉ. చాటున కెక్కినట్టి నెఱజాణతనంబున వాగ్విలాసతన్
మేటివి నీవు నిన్ను నుపమింపఁ ద్రిలోకములందు రాజులె
వ్వాటను లేరు నామనసుపాఁ తగలించి వెలార్చినట్టియా
మాటలుమూఁడు నుంకువగ మానవనాయక నీకుఁ దక్కితిన్.

అని కళావతీకాంత విక్రమార్కుని వినుతించె. సాహసాంకవిక్రమార్క చక్రవర్తియొక్క సాహసికత్వమును నిరూపించు మహాద్భుతకార్యము లిం దభివర్ణింపఁబడినవి. కాని కథలు నీత్యుద్బోధనమును, ధర్మాచరణమును నెలకొల్పునవి కావు.

ఈదృగ్విధముగ రెండుగ్రంథములును వేఱువేఱాశయములతో రచింపఁబడినవి. కావున నందలిపాత్రములును దత్తత్కథానుసార మగు రసములనే వెలార్చుచున్నవి. విక్రమార్క చరిత్రమందలి పాత్రములు శృంగారరసమునఁగాని వీరరసమునఁగాని యుద్రేకావస్థను వెల్లడించును. విలాసవతి, పద్మావతి, గుణవతి, లీలావతి, మున్నగుస్త్రీలు స్వైరిణులై యధర్మరతియందుఁ బొరలుచుందురు. వీరిచరితలు కడు నింద్యములయ్యును, అనుకరణయోగ్యములు గావని తెల్పుటకు గ్రంథమున నొక

మాటయైనను గానము. కావున బుద్ధిమంతులగు యువతీయువకులచే నీగ్రంథమందలి శృంగారకథలు పఠింప నర్హములు.

పూర్వోదాహృతము లగువిషయముల నన్నిటిని మొత్తముగాఁ బరిశీలించిచూచిన జక్కనమహాకవియొక్క కవిత్వము మందస్మితసుందర వదనారవిందయు, సవిభ్రమవిలాస చంచలనయనేందిందిరయుఁ, జతురవచనరచనవికసిత స్వాంతయు నైన (నెల్లూరినెఱజాణ) నాగరక సీమంతినీలలామవలెఁ జెన్నలరారుచున్నది. అనంతామాత్యుని కవిత్వ మట్లుగాక సహజసుగుణాన్వితయుఁ, బరిమితవచోల్లసిత నిజభావనివేదితయు, లీలారసవిలసన నిర్విదగ్ధయు నగుముగ్ధయువతింబోలె హృదయశుద్ధిగలిగి కవితాభిజ్ఞులడెంద మానందింపఁజేయుచున్నది.

## ప్రౌఢదేవరాయలు, శ్రీనాథుఁడు.

పైఁబేర్కొనఁబడిన యిద్దఱు దేవరాయలకాలములో సంస్కృతాంధ్ర కర్ణాటాదిభాషల వాఙ్మయములు బహుముఖముగా వృద్ధినొందినవని చరిత్రకారు లుద్ఘోషించుచున్నారు. వీరి యాస్థానములయందు డిండిమభట్టారక బిరుదాంకితులగు కవిపుంగవు లాస్థానకవీశ్వరులుగ నుండి సంస్కృతమున, గొన్నిగ్రంథరాజముల రచించిరి. అందులో, కవిప్రభుని పౌత్రుఁడును, రాజనాథదేశికుని పుత్రుఁడు నగు శ్రీఅరుణగిరి నాథుఁడు రచించినయోగానంద ప్రహసన మనునాటకము ముఖ్యమైనది. రెండవదేవరాయలు వ్రాసినట్లు పరిగణింపఁబడుచున్న 'మహానాటక సుధానిధి'యు, 'రతిరత్న ప్రదీపిక'యును గూడ సంస్కృత భాషనే యున్నవి.

ఇది యిట్లుండ రెండవదేవరాయల కాలములో జరిగినయొక యద్భుతవిషయము గుఱించి యించుక ముచ్చటింతము. అదేదన, శృంగారనైషధాది మహాప్రబంధనిర్మాత యగు శ్రీనాథ మహాకవీశ్వరునకు

దేవరాయమహారాయలు స్వయముగాఁ దనముత్యాలశాలలోఁ జేయిచిన కనకాభిషేకమే. ఈ యితివృత్తమును గుఱించి మ-రా-రా. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన 'కనకాభిషేక' మను నొక చిన్నిపొత్తమున విపులముగ వర్ణించినారు దానినుండి కొన్ని విషయములఁ బరిగ్రహించెద.

"రెండవదేవరాయల కాలములో నరుణగిరినాథుఁ డనునాస్థాన కవీశ్వరుఁడుండినట్లు పైని వ్రాయఁబడినది కదా! ఆకవీశ్వరునకు విజయడిండిమ మనునొక కంచుఢక్క వంశపారంపర్యము లగు బిరుదములలో నొకటిగ నుండెను; కావున నతనికి డిండిమభట్టారకుఁ డనియుఁ బేరుండెను. ఆడిండిమభట్టారకుఁ డనునరుణ గిరినాథుఁడు రాయల యాస్థాన కవీశ్వరుఁడుగ నుండుటయుఁ, బండితకవివంశజుఁ డగుటయు, మహాగ్రంథముల రచించుటయు, నిత్యాదివిషయములచే నత్యున్నత పదవియందున్నవాఁడై, యితరపండితులకు బహుదుర్ఘటుఁడై, నిరాఘాట మగు నాటోపమున మెలంగుచుండెను.

ఉ. ముంగలజై త్రడిండి మపుమ్రోఁతలు ; వందిజనస్తవార్భటుల్
చెంగట : రెండుమూఁడు తనచిత్తరువుల్ ; బిరుదాంకితంబు లిం
కంగల, వింతకంటె శితికంఠశిరస్సరిదూర్మిభంగి వా
గ్భంగు లెసంగుమాటఁ బ్రతిపక్షబుధౌఘము నోడఁగొట్టఁగన్.

(కనకాభిషేకము)

ఇట్లుండ, నానాఁటి తెనుఁగు కవీశ్వరులలో మేటియై, వివిధ గ్రంథరచనా సాధిత సాంద్రయశోభూషితుఁడై, యాంధ్రదేశమునఁ గలరాజన్యుల యాస్థానములనెల్ల మత్తకుంజరమువగిదిఁ గ్రుమ్మరించి యనేకానూన బహుమానముల స్వీకరించియున్న శ్రీనాథమహాకవీశ్వరుఁడు విజయనగర సంస్థానాధీశుని యాస్థానమునఁగూడఁ దనవిజయప

తాక మెత్తుట కుత్సహించెను. విజయపతాకసంస్థాపన మాస్థానకవీశ్వరు ని నోడించినఁగాని చేకూరదు. కావున శ్రీనాథునికి నరుణగిరినాథునికిని నుద్భట మగువివాదము పొసఁగినది. ఆవివాదమున శ్రీనాథుఁడే విజయ ముఁగాంచి యాడిండిమ భట్టారకునికంచుఢక్క పగులఁగొట్టించెను. దేవరాయమహారాయ లమందానంద పరవశుఁడై తనముత్యాలశాల యందు శ్రీనాథకవీశ్వరుని దీనారటంకము లనుస్వర్ణనాణెముల స్నాన మాడించెను. ఈ యుత్కృష్టకీర్తిప్రదమగు విషయమును గుఱించి శ్రీనాథుఁ డిట్లు చెప్పికొనెను :—

సీ. "దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియా శక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండినీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ !"



# ఐదవ అధ్యాయము.

## వినుకొండ వల్లభరాయఁడు-క్రీడాభిరామము

ఈకవి కడపజిల్లా పులివెందల తాలూకాలోనున్న మోపూరు గ్రామమునకు అధిపతిగా నుండెను. ఈతనితండ్రి గుంటూరుజిల్లాలోనున్న వినుకొండకు ప్రభువుగానుండి విజయనగరరాజైన రెండవ హరిహరరాయల యొద్ద రత్నభాండాగారాధిపతిగా నుండెను♦ వీరి పూర్వులు



ను విజయనగరాధీశులయొద్ద గొప్ప యుద్యోగములు జేసినవారే. ఈ వంశములో మొదటివాడగు చంద్రన్న ప్రథమబుక్కరాయలయొద్ద మంత్రిగానుండెను. ఈకవియొక్క పెదతండ్రి లింగన్న రెండవ హరిహరరాయలయొద్ద సేనాధిపతిగా నుండెను. ఈ రెండవ హరిహరరాయలు క్రీ. వె. 1377 నుండి 1404 వఱకును రాజ్యముచేసెను గాన అతని కుమారు డగు మొదటి దేవరాయలకును (క్రీ వె. 1404-1422), అతని పౌత్రుడగు రెండవదేవరాయలకును (1423-1446) సమకాలికుడైన వినుకొండ వల్లభామాత్యుడు దేవరాయలచే కనకాభిషేక గౌరవమును బొందిన శ్రీనాథునికిగూడ సమకాలమువాడని నిర్ణయింపవచ్చును.

వల్లభామాత్యుని తండ్రియగు తిప్పన్ననుగుఱించి యీవిధముగ జెప్పబడినది.

ఉ. గంధవతీప్రతీరపురఘస్మరపాద బిసప్రసూన పు
ష్పంధయచక్రవర్తి శ్రుతపర్వతదుర్గ మహాప్రధాన రా
డ్గంధగజంబు తిప్పన యఖండితధీనిధి గాంచెఁబుత్రులన్
బాంధవ కల్పవృక్షుముల బైచనమల్లన తిప్పమంత్రులన్.

అనగా నీ తిప్పయ్య వినుకొండదుర్గమునకు మహాప్రధానియనియు, గంధవతీతీరమున నున్న త్రిపురారి పాదభక్తుడనియు జెప్పబడియున్నది. గంధవతీతీరమున నున్న క్షేత్రమునకు త్రిపురాంతకమందురు. కాబట్టి కర్నూలుజిల్లాలోనున్న త్రిపురాంతక మందలి త్రిపురాంతకేశ్వరుని పదభక్తుడని తేలుచున్నది. ఈవిషయము లన్నిటిని జేర్చిచూడగా వల్లభామాత్యుని వంశస్థులందరు గుంటూరు, కర్నూలు, కడపజిల్లాల లోని వారని స్పష్టమగుచున్నది.

వినుకొండ వల్లభామాత్యుడు కామకాయనస విశ్వామిత్ర గోత్రమువాడు; మోపూరు గ్రామాధికారి; శైవమతావలంబకుడు; మోపూరి భైరవస్వామి భక్తుడు.

సీ. మూడుగ్రామ గ్రాసములతోడఁ గూడంగ
మోపూరు బాలించె ముల్కినాట
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్షమొనరించె భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీవరించెఁ
గామకాయనస విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
నెవ్వఁ డాత్రిపురాంతకేశ్వరునకు
రాయనవరత్న భండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

ఈ మోపూరు* కడపజిల్లా పులివెందల తాలూకాలోనున్న

---

*మోపూరు: ఈక్రిందివృత్తాంతము మహారాజశ్రీ భావరాజు వేంకటకృష్ణారావు గారిచే నియ్యఁబడినది. ఆంధ్రదేశమందలి గొప్పప్రాచీనస్థలములలో నొక్కటియగు మోపూరు అనేకశతాబ్దములనుంచియు పేరుగాంచియున్నది. ఇయ్యది ములికినాటి సీమకు ముఖ్యస్థానమని యూహింపవచ్చును. ఇచ్చట ప్రథమమున తెలుగుచోడులు రాజ్యముచేసిరి. తరువాత నిది విజయనగరరాజ్యములో జేరిపోయినది. ఈ చరిత్ర మంతయు ననేకమైన శిలాశాసనముల నిప్పటికిని గాన్పించుచున్నది. ప్రౌఢదేవరాయల శాసనములుగూడ నిందుగొన్నియున్నవి. ఈపురమందున్న కొండయందుఁ గొన్నిగుహలు గాన్పించుచున్నవి. ఈ గుహలను గుఱించియే క్రీడాభిరామమందలి భరతవాక్యమున నిట్లు సూచింపబడినది.

చ. ముదమున ముల్కినాటి పుర మోహనశైల సువర్ణకందరా
సదనుడు కాలభైరవుఁడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశ మహీరుహంబునకుఁ దిప్పయ వల్లభరాయమంత్రికిన్.

గొప్పక్షేత్రము. ఇచ్చటి క్షేత్రపాలకుడు శ్రీభైరవస్వామి. మోపూరు గ్రామము నెల్లూరుజిల్లాలోగూడ నున్నది గాని వల్లభామాత్యు డచ్చటి వాడు గాడు.

వల్లభామాత్యుడు క్రీడాభిరామమను వీధినాటకమును నాంధ్రమున రచించెను. ఆగ్రంథమందలి ప్రస్తావన పద్యములవలనఁ దత్కవి గొప్పపండితుడనియుఁ జక్కని కవిత్వముఁ జెప్ప గలవాడనియు తెలియ వచ్చుచున్నది. ఇంతియేకాక ఋగ్వేదము కరతలామలకముగా, పఠించి భైరవస్వామి కృపచే సారస్వతసిద్ధి, యనగాఁ గ్రంథకర్తృత్వ సంపత్తి బొందెను.

## క్రీడాభిరామము

క్రీడాభిరామ మొక వీధినాటకము. వీధియనఁగా దశరూపకములలో నొకటియైన చిన్ననాటక స్వరూపము. దానియందు నొకరుగాని, యిద్దరుగాని విలాసపురుషులగు నాయకులు శృంగారవిహారపరులై యొకానొక పట్టణమందును, దత్పరిసరమందును, దిరిగి యచ్చటచ్చట బొడసూపెడు ఆటలు, పాటలు, వినోదములు, యుత్సవములు ఇత్యాది కేళీవిశేషములను దిలకించి ముదమొందుచు శృంగారభోగ పరాయణులై వేశ్యవాటికా పరిభ్రమణమున మదనావిష్టమానసులై యారేయి గడపి మరునాడు తమబారిని దాఁ బోదురు. ఇట్లొకవాసరమున జరుగు క్రీడావిలాసములఁ బ్రదర్శించెడు నాటికకు వీథియని పేరు. ఇట్టి నాటికలను పదునాల్గు పదిహేను శతాబ్దములలో మనదేశమందలి గీర్వాణ కవులు వ్రాసి ప్రదర్శించి రాజులను, ప్రజలను సంతోషపెట్టుచుండిరి. ఇట్టి గ్రంథములు సామాన్యముగా నాటక స్వరూపములగుటచే సంస్కృతభాషలోనే వ్రాయబడినవి, దేశభాషలందు నాటకములను వ్రాయుట యప్పటికి లేనేలేదు.

వల్లభామాత్యుని కాలమున పెదకోమటి వేమ భూపాలుని యాస్థానమున వామనభట్టను గీర్వాణకవి "శృంగారభూషణ" మను నొకవీధినాటకమును సంస్కృతమున రచించెను. దానియందు నాయకుడగు విలాసశేఖరుడు విజయనగరమందున్న హంపీ విరూపాక్షదేవుని తిరునాళ్ళలో దిరిగి విజయనగర పట్టణమందలి వినోదవిలాస విశేషముల నభివర్ణించెను. రావిపాటి త్రిపురాంతకు డనునాంధ్రమహాకవి "ప్రేమాభిరామ" మను వీధినాటకమును సంస్కృతమున రచించి యందాంధ్ర నగరమగు ఓరుగల్లు పట్టణమందలి జనసంఘముల కేళీవిలాసములను బ్రత్యక్షముగ నిరూపించెను ఆగ్రంథమునకే యీ క్రీడాభిరామ మాంధ్రానుసరణము.

ఏ తద్విషయమునుగురించి క్రీడాభిరామమున నిట్లున్నది: "ఆ మంత్రిశేఖరుడు (వల్లభామాత్యుడు) రావిపాటి త్రిపురాంతక దేవుడను కవీశ్వరు డొనరించిన 'ప్రేమాభిరామ' మను నాటకమునను సరించి 'క్రీడాభిరామంబ'ను రూపకంబు తెనుంగుబాస రచియించిన వాడు"

గీ. 'ఆతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనగ నెంతటియది దాని ననుసరించి
వీధియను రూపకము మది వెఱపులేక
తిప్పవిభువల్లభుం డెట్లు తెనుఁగుఁజేసె.'

'అని యానతిచ్చెదరేని'

ఉ. 'నన్నయభట్టు తిక్కకవి నాయకులన్న హుళిక్కి భాస్కరుం
డన్నను జిమ్మఁపూడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతలుఁ జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడు తగునా యిటు దోసపు మాటలాడఁగన్,

ఆ. వె. 'జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందు తెనుగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె."

కావున రావిపాటి త్రిపురాంతకుఁడను నాంధ్రకవి రచించిన సంస్కృత నాటక మగు 'ప్రేమాభిరామము'నకు నీ 'క్రీడాభిరామము' ఆంధ్రానుసరణమని కవియగు వల్లభరాయడే నిస్సందేహముగఁ జెప్పుకొనెను.

ఇట్లు ఏతద్గ్రంథకర్తృత్వము నిస్సంశయముగాను తేటతెల్లముగాను నిర్వచింపబడినను, గొన్ని కారణములచే వివాదాంశమై విమర్శన దక్షులగు పండితుల ప్రాగల్భ్య కౌశలములకు గురియై యొకసారస్వతక్లిష్ట సమస్యగాఁ బరిణమించినది.

గ్రంథకర్త: వల్లభరాయడా లేక శ్రీనాథుడా

ఏతద్గ్రంథము వల్లభామాత్యుడు రచించినట్లు గ్రంథమందలి ప్రస్తావనబట్టియు, కొందఱు పూర్వలాక్షణికుల లక్షణగ్రంథములబట్టియు, దెలియవచ్చుచున్నది. అయినను మఱికొందరు లాక్షణికు లీయభిప్రాయమునకు భిన్నముగా దమగ్రంథములయందు కవిసార్వభౌముడగు శ్రీనాథుడే యీనాటకమును రచించెనని సూచించి యున్నారు. ఇట్లాంధ్రలక్షణ గ్రంథములలో నున్న భిన్నాభిప్రాయములమూలమునను మఱికొన్ని కారణములవల్లను యీగ్రంథకర్తృత్వ విషయము వాదప్రతివాదముల కాస్పదమయ్యెను.

బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, (ఎం. ఏ.)గారు తొలుదొల్తనీ గ్రంథమును ముద్రించి దానికొఱకు వారు వ్రాసిన పీఠికయందుభయపక్షములుఁ జెప్పతగిన హేతువులను వారికి సహజమగు నిష్పా

క్షికబుద్ధితో నివేదించిరి. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ "శృంగారశ్రీనాథము"న నీగ్రంథమును గుఱించి వ్రాయుచు ననేకములగు నుపపత్తులను సేకరించి యేతద్గ్రంథమును శ్రీనాథుడేగాని యొరులెవ్వరును రచించియుండరని తమ నిశ్చితాభిప్రాయమును విశదపఱచిరి.

ఇట్లుండ బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మ (ఎం. ఏ.)గారు "భారతి" పత్రికలో (1927 సం. ఏప్రిల్) నీయుభయుల యభిప్రాయముల ఖండించుచూ కొన్ని నూతన విశేషములను గనపఱచి వల్లభామాత్యుడే యీగ్రంథమును రచించెనని కంఠోక్తిగా నుడివిరి.

ఈ విధముగా నిశితమతులగు పండితులను గలతపెట్టిన యీ సారస్వతసమస్య కొంతవఱకైనను నాచే సవిశేషముగా సూచింపబడుట సమంజసముగా నుండునని యుభయపక్ష వాదప్రతివాదముల నిట సంక్షేపముగా నిరూపించి తుదకు నాయభిప్రాయమును దెల్పెదను.

పూర్వకవి లాక్షణికులగు చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుడు, గణపవరపు వేంకటకవి, పెదపాటి జగన్నాథకవి మొదలగువారు క్రీడాభిరామమునుండి తమ గ్రంథములలో నుదాహరించిన పద్యములు వల్లభరాయనివే యని చెప్పినట్లు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసినారు. కాని అప్పకవి, లింగమగుంట తిమ్మకవి మున్నగువారీ పద్యములను శ్రీనాథునివని నుడివినారు.

2. క్రీడాభిరామములోనున్న యొండు రెండు పద్యములు, ముఖ్యముగ

గీ. గార్గసిద్ధాంత మత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతి మతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

అనునది శ్రీనాథుని గ్రంథములలో నున్నది. మఱియు క్రీడాభి రామములోనివైన కొన్ని వాక్యములును, వర్ణనలును శ్రీనాథుని వాక్యములను వర్ణనలను గాఢముగా ననుకరించు చున్నవనియు, కావున శ్రీనాథుడే యేతద్గ్రంథకర్త యని సిద్ధాంతీకరింప బడవచ్చు ననియు ఋజువుచేయుటకు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాలవఱకు శ్రీనాథాదికవుల గ్రంథములనుండి సామ్య శబ్దసామగ్రిని సేకరించి విపులముగ విశదపరచినారు.

క్రీడాభిరామ ప్రస్తావనయందున్న కృతిపతిస్తుతియు, గ్రంథాంతమునందున్న భరతవాక్యమును వల్లభరాయని గుణగణములగుఱించి స్తోత్రపాఠము లగుటచే వల్లభరాయుడే తన్ను తాను బొగడుకొనునా యని సందేహింప దగియున్నదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదము. ఈ పద్యములన్నియు సూత్రధారుడు పల్కినవి గాన ననౌచిత్య దోషములేదని శ్రీ శర్మగారి ప్రతివాదము.

ఉభయపక్షముల వాదప్రతివాదముల సారాంశ మిదియే యని నా యభిప్రాయము.

పైనజెప్పిన వాదప్రతి వాదములలో నీ గ్రంథమునుగుఱించి యొండు రెండు విషయములకు ప్రాముఖ్య మివ్వకపోవుటచే నీ యభిప్రాయ భేదమున కవకాశము గలిగెనని నే నూహించుచున్నాను.

ఈ గ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధము గాదు. రూపకలక్షణములు సంపూర్ణముగా దీనియందు గాన్పించకపోయినను యిది వీథినాటకముగా గ్రంథకర్తచే బరిగణింపబడినది.

ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రకావ్యము గాని యున్నతాదర్శములు గల యుత్తమకావ్యము గాదు.

హాస్యరస ప్రధానమైన క్షుద్రనాటకముగా దీని నుపలక్షించిన యెడల మహాకవి శ్రీనాథుడు గాక శ్రీనాథుని భాషావేశము గొంతవ

ఱకు ధరింపగల మరియొక కవి రచించియుండునని మనకుఁ దోచును. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదములో ముఖ్యాంశ మేదన: శ్రీనాథుడును వల్లభరాయుడును సమకాలికులగుటయు, శ్రీనాథుని వాక్యచయ మెంతయేని నీ గ్రంథమందు గాన్పించుటయు నీ రెండుకారణములచేత నేతద్గ్రంథము శ్రీనాథుడే రచించియుండెనని తలంపు. మహాకవి శ్రీనాథుడు సమయస్ఫూర్తిగాను, సమయానుకూలముగాను గొన్ని యశ్లీలములగు పద్యములను చెప్పినను చెప్పియుండును. ఆకాలపు శృంగారరస లాలసత్వ సంప్రదాయముల బట్టియు శ్రీనాథుడు గవిసార్వభౌముడైనను శృంగారరస విషయములలో వాఙ్మయ మర్యాదలను దఱచుగ నతిక్రమించినవాడే. అట్లయినను యిాక్రీడాప్రధానమై నీతిబాహ్యమైన గ్రంథమును తాను ప్రత్యేకముగ రచించి యుండునా యను సందేహము వస్తుతత్వమునుఁ బరిశీలించిన బొడముచున్నది. నీతిబాహ్యము గావుననే తాను రచించి మఱియొకరి పేరుబెట్టెనని శ్రీ శాస్త్రిగారి వాదము. కాబట్టి నీతిబాహ్యతగారణమున శ్రీనాథుని కర్తృత్వము దప్పించుటకు వలనుపడదు.

ఇంక గ్రంథమందున్న సాక్ష్యమును బరీక్షించెదను. ఇది రెండు విధములుగా నున్నది.

1. గ్రంథకర్తను గుఱించియు, 2. గ్రంథశైలిని గుఱించియు.

గ్రంథకర్త:—కృత్యాదినున్న యవతారిక పద్యములలో గ్రంథకర్తయగు వల్లభామాత్యుని గుఱించి యత్యధికముగా వర్ణనము కావింపబడినది. ఆ వర్ణనములో వల్లభామాత్యుని వాగ్వైభవములును, చాటుధారాఫణితులును, వాగ్డంబరములును యిత్యాది కవితా స్వారస్యసౌరభములే ముఖ్యముగఁ జెప్పబడినవి. కృతికర్తస్తవమగు నెనిమిది పద్యములలో నారుపద్యము లాతని కవితాశక్తిని గుఱించి ప్రశంసించుచున్నవి. తక్కిన రెండు నాతని వితరణగుణముల గుఱించియై యున్నవి.

వల్లభామాత్యుడే యీగ్రంథమును వ్రాసిన యెడల నిట్లు తన్నుం దా బొగడికొని యుండునా యని యాక్షేపింపబడినది. ఈ యాక్షేపణ కు రెండుసమాధానములు. 1. ఈ గ్రంథము వీథినాటకముగా నుండు నట్లు వ్రాయబడినది. క్రియాఫలితములో ప్రత్యేక నాటకముకాక, ప్రత్యేక ప్రబంధముగాక యుభయలక్షణ మిశ్రితమైన యొక సంకర గ్రంథమైనను ఆంధ్రభాషయందలి నాటకరచనములలో నిదియే కేవలము ప్రథమప్రయత్నముగాన యందలి నాటకలక్షణ లోపములు తద్వస్తు నిర్దేశమునకుం గొంత కలిగింపగూడదు. కాన కృతికర్తస్తవము నాటక ప్రస్తావనయందు సూత్రధారుడు జెప్పినటులుగా యూహింపవలసి యున్నది. సూత్రధారునిద్వారా యెంతెంత విపులముగాను, విపరీతము గాను నాటకకర్తలు తమ్ముం దాము గొండాడుకొనియుండిరో మన సంస్కృతనాటకములం జదివినం దెల్లమగును. ఈవల్లభరాయని కాలము లోనే యోగానంద ప్రహసనకర్తయగు అరుణగిరినాథుడు తన్నుదా నెంతపొగడుకొనెనో చూడుడు. కాబట్టి యాత్మస్తవ మనుచితమని కర్తృత్వము వల్లభామాత్యునినుండి తప్పించుట యసంగతము.

వల్లభామాత్యుడే యీ గ్రంథమును రచించియుండనియెడల సూత్రధారు డతని కవితాస్వారస్యమును, భాషావైదుష్యమును గుఱించి కడుంగడు నుత్ప్రేక్షించి సంస్తవించుట యసందర్భముగాను నసమంజసముగాను నుండును. ఈగ్రంథమును వల్లభామాత్యుడే ప్రత్యేకముగా రచించెనని విస్పష్టముగా సూత్రధారుడు ప్రేక్షకులకు చెప్పుచున్నాడు. గనుక యాతని కవిత్వమును గుఱించియు వాక్ప్రౌఢిమను గుఱించియు సవిశేషముగా నుగ్గడింపవలసి వచ్చినది. ఇట్టి ముఖ్యవిషయమును శ్రీ ప్రభాకరశాస్త్రిగారు నిరసించిరని తెల్పుటకు విచారముగా నున్నది. న్యాయముగ వారివాదములో నిదియగ్రస్థానముం బొందందగి యున్నది.

గ్రంథశైలి:—క్రీడాభిరామమందలి శైలి శ్రీనాథుని శైలివలె

నున్న దనియు, శ్రీనాథుని గ్రంథములందలి పద్యము లొండు రెండును, భావములును వాక్యములు ననేకములు దీనియందు గానంబడుచున్న వనియు ఆకారణములచే గూడ నీగ్రంథము శ్రీనాథరచితమని కొంద రూహించుచున్నారు. శైలిసామ్యమే వారి ముఖ్యవాదము గాన నీ గ్రంథమందలి శైలి గొంతనిదానముగాఁ బరిశీలింపవలసి యున్నది.

ఏగ్రంథముయొక్కయు శైలి ఆ గ్రంథస్వభావమును బట్టియు, ఆగ్రంథకర్త ప్రతిభనుబట్టియు నిర్ణయమగునని సర్వవిదితమే. ఈక్రీడాభిరామము క్రీడావిషయములు గల యొక హాస్యగ్రంథము. కావున హాస్యరసప్రతిపాదనకొఱకు హాస్యవిషయములే గాక హాస్యరస జనక మగు పరిభాషగూడ వాడుకచేయవలసి యుండును. లేనియెడల హాస్య రసము జనింపదు.

హాస్యరసము (The comic or the ludicrous sentiment) పుట్టించెడు శైలీవిశేష మేదనిన యుత్కృష్టభావములను ఉత్కృష్టవాక్యములను నీచ సందర్భములయందును, అవినీతివిషయము లయందును నిరంకుశముగఁ బ్రయోగించుటయుఁ దత్సంబంధమైన పరి భాషాది పరికరములను యథేచ్ఛగా నుపయోగపరచుటయునై యున్న ది. ఈవిధముగా భావములకును వానిని వ్యక్తపరచెడుభాషకును గలి గిన వ్యత్యాసమే హాస్యరససిద్ధి కొకముఖ్యసాధనము. ఇట్టి వికృతశైలి గ్రంథమందు బహుచమత్కారముగ నుపయోగింపఁ బడినది. దీనికొక యుదాహరణము:

గీ. గార్గ్య సిద్ధాంతమత ముషఃకాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనఃప్రసాదాతిశయము
విప్రజనమత మరయంగ విష్ణుమతము.

ఈ శకునసంబంధమైన శాస్త్రప్రసంగము శ్రీనాథుని భీమేశ్వర పురాణ

ములో అగస్త్యమహర్షియు, లోపాముద్రియు, వ్యాసమహర్షియు, శిష్యులును, వీరందరును దాక్షారామ పురోపాంతమున గూర్చొని తత్పురీప్రవేశమునకు శుభముహూర్తముగుఱించి యాలోచించుచుండగా నా సమయమున మైత్రావరుణుండను మునిపుంగవుండు పై బేర్కొనిన పద్యమును నుడివెను. అట్లు బ్రహ్మర్షులు మహాపవిత్ర సందర్భమున చేసిన శకునశాస్త్ర ప్రసంగము నీక్రీడాభిరామమున వేడుక చెలికాండ్రిద్దరు మంచనశర్మయు, టిట్టిభ సెట్టియు ప్రభాతకాలమున క్రీడాపరిభ్రమణోన్ముఖులై చేసిరి. వారిద్దరు చేయబోవు ఘనకార్య మేమనగా పట్టణములోనున్న వినోదములను చిత్రవిచిత్రములను, ఆటపాటలనుం జూచుచు నుల్లాసముగ విహరించుట. ఈ మహాకార్యము చెడిపోవు నేమో యని వారు మంచిశకునము జూడవలసి వచ్చినది. అట్టి శకునమును నిర్ణయించుటకు ప్రాచీన శకునశాస్త్రముల నన్నిటినిం ద్రిప్పి తిరుగవేసి వానిలోని సారముగా బ్రహ్మర్షిముఖమున శ్రీనాథమహాకవి నుడివిన పద్యమునే చెప్పికొనిరి. ఈశకునప్రసంగమును, ఈసంవిధానమంతయును హాస్యరసోత్పత్తికొఱకు కాదా? కావున శకునశాస్త్రములలో నున్నట్టియు, శ్రీనాథుని కవితాప్రసిద్ధిచే బ్రకటితమైనట్టియు నీపద్యము సందర్భవశమునం జేర్పబడినది. ఇట్టిహాస్యప్రయోగము శ్రీనాథుడే తనపూర్వగ్రంథమునుండి వినియోగించుకొనెనని చెప్పుటయా లేక మఱియొకకవి యీ సుప్రసిద్ధకవివరుని పద్యమును హాస్యసందర్భమున నుపయోగించెనని యూహించుటయా యెక్కుడు సమంజసము?

ఈ వీథినాటకమునకు భరతవాక్యమని చెప్పదగిన కృత్యంతపద్యములో మోపూరి భైరవస్వామి యీ "కవీంద్రకాంక్షితత్రిదశ మహీరుహమైన" వల్లభరాయనిం బ్రోచుగాతయని చెప్పబడినది. ఈపద్యమును వల్లభరాయడే వ్రాసినయెడల తమ్ముకొని తానేశతాయువనుకొన్నట్లుండునని శ్రీ ప్రభాకరశాస్త్రిగారాక్షేపించిరి, అయితే వల్లభరాయ డా

పద్యమును వ్రాయనియెడల శ్రీనాథుడు వ్రాసెనని చెప్పుటకు దగిన హేతు వున్నదాయని విచారింపదగినది. ఏనాటకమందైనను భరతవాక్యమందు కృతిభర్తనుగుఱించి వ్రాయుట శాస్త్రసమ్మతముగాని సంప్రదాయ ప్రసిద్ధముగాని యైయుండెనా యను విషయముగుఱించి యాలోచించుటకు శ్రీశాస్త్రులవారే ముఖ్యార్హులు. ఈవిషయమునుగుఱించి నేననేక పండితుల యభిప్రాయములను గనుగొంటిని. ఎవ్వరైనను యిది శాస్త్రసమ్మతము గాదనియు, ఆచరణలోనైనను లేదనియుఁ జెప్పినవారే. అట్లయినచో మహాపండితుడగు శ్రీనాథుం డీయశాస్త్రీయమైన వ్రాత వ్రాసియుండునా యని సంశయింపవలసియున్నది. అశాస్త్రీయమైన పనిచేయుటకు శ్రీనాథుడు తగియుండెనా వల్లభరాయుడు తగియుండెనాయనువిషయము పండితులచే చర్చనీయము.

ఈగ్రంథమందలి శైలియనేకస్థలముల నతిమాత్రముగ సంస్కృతశబ్దభూయిష్ఠమై బహుక్లిష్టముగా నున్నది. ఇట్టి పదకాఠిన్యమును, పాండితీవిజృంభణమును కేళీవినోదములగుఱించియు నీచసందర్భములగుఱించియువినియోగింపబడినది. ఈగ్రంథశైలియందలి యీవైపరీత్యమునకు రెండుహేతువు లుండవచ్చును. ౧. ప్రప్రథమమున రావిపాటి త్రిపురాంతకుడు తన ప్రేమాభిరామమును సంస్కృతమున వ్రాసెను గాన నాపద్యములను దెనిగించినకవి సంస్కృత సమాసముల నట్లే దిగవిడిచి యుండవచ్చును. ౨. లేదా' ఎవరో యొకకవి కీర్తికాముడగు సామాన్యుడు తనభాషావైదగ్ధ్యమును బ్రకటించుటకు నౌచిత్యపరిజ్ఞానము లేకుండ పదబంధము క్లిష్టతమముగఁ జేసియుండవచ్చును. తన వాగ్వైభవములను వాగ్డంబరములగుఱించి మహాతిశయముగఁ జెప్పికొనిన వల్లభామాత్యుడే యీ యప్రసక్తమైనట్టియు, అప్రశస్తమైనట్టియు శైలీదోషమునకుఁ గారణభూతుడయ్యెనుగాని యుచితజ్ఞుడగు మహాకవి శ్రీనాథుడు గాడని యూహించుట యెక్కువ న్యాయముగాదా?

శివరాత్రి భాషాప్రయోగము లీగ్రంథమునఁ బుష్కలముగా గాన్పించుచున్నవిగాన నీగ్రంథము శ్రీనాథకృతమని కొందఱిచే దలంపబ డుచున్నది. శ్రీనాథునివాక్యములును వర్ణనలు నచ్చటచ్చ గానంబడుచు న్నవనుట వాస్తవము. కొన్నిపద్యములలో శ్రీనాథుని శైలీధోరణియు ద్యోతకమే. అయిన నాకారణమున శ్రీనాథుడే యీగ్రంథమును వ్రా సెనని చెప్పటమాత్రము సాహసము. శ్రీనాథుని "బహుముఖ ప్రఖ్యాత మహిత శయ్యావిశేషములు,పండితకవులను పండితంమన్యమానకవులను నేకరీతిగా ననుకరణోత్సాహపూరితుల జేసెననుటకు పినవీరన, పెద్ద నాది సుప్రసిద్ధమహాకవులే ప్రబల సాక్షులు. అట్లుండ సమకాలికుడు బహుశః సహచరుడునగు వల్లభామాత్యుడు కవియశోవాంచితుడు గాన శ్రీనాథుని వాగ్లహరీ తరంగముల మధుర మధురసమును గడుపారగ్రో లి తనకావ్యమున నచ్చటచ్చట తదున్మదన సీధువును వెలిగ్రక్కుట య సంభవమా? బహుళవ్యాప్తినొందిన శ్రీనాథుని "జాతివాగ్ధారసస్ఫూర్తి, యచ్చటచ్చట గ్రంథము నలంకరించుటచేతనే యీకాలపు నాటకప్రేక్ష కులను హాస్యరస నిమగ్నులనుగా జేయగలిగియుండెనని యూహించు ట యథార్థమునకు దూరముగాదు.

పై యంశములను సావధానముగా నరసిన వల్లభామాత్యుని కర్తృ త్వము స్థాపించుటకు ప్రబల సాక్ష్యముగాన్పించుచున్నది. లాక్షణికు ల యుదాహృతి వల్లభామాత్యునికిఁగూడ సాయ మిచ్చుచున్నది.శై లివిషయములు శ్రీనాథుని కర్తృత్వమునకు న్యూనతఁ గలిగించెడువి ధముగఁదోపించుచున్నవి. గ్రంథమందు విస్పష్టముగావల్లభునికర్తృత్వ ముద్ఘోషితమై యున్నది. కావున నీగ్రంథము వల్లభరాయని కృతమ నియే యంగీకరించుట యెక్కువ న్యాయమని యూహించుచున్నాను. వల్లభరాయడీగ్రంథమునుఁ దెనిగించి తనస్నేహితుడును కవిసా ర్వభౌముడు నగు శ్రీనాథునిచేఁ గొంతసాయము బొందియుండవచ్చును

గాని, శ్రీనాథుడే యీగ్రంథము నామమాత్రముగా రచించె నని చెప్పుట మాత్రము కేవల మతిశయోక్తి యనియు, నన్యాయమనియుఁ దలంప సాహసించుచున్నాను.

కథాసారము

కాసల్నాటి గోవింద మంచనశర్మ యను శ్రోత్రియబ్రాహ్మణుడును, ఆతని చిన్నతనపు చెలికాడగు టిట్టిభశెట్టి యను వైశ్యుడును ఆంధ్రనగర మను బ్రసిద్ధివహించిన ఓరుగంటిపురవీథులలో విలాసార్థము విహరించి యచ్చట గోచరించెడు క్రీడావినోదములను, ఆటపాటలను సావకాశముగ దిలకించి యానందించవలె ననునుద్దేశముతో నొకనాడు శుభముహూర్తము జూచుకొని ప్రభాతమున బయలుదేరిరి,

మున్ముందుగ నోరుగంటిపుర పరిసరమున నున్న వెలిపాళెము బ్రవేశించి యచ్చటనున్న యొక మేదర సానిని, దర్వాత నొక చండాలాంగనను, యటుపైని నొక కర్నాటస్త్రీని వారు చూచి శృంగారవివశులై మోహవిభ్రమము జెందిరి. అటుతర్వాత మరికొంతదూరము బోవ నొక 'కాపు' కులాంగనయు, కర్ణాటవేశ్యయును వారిదృష్టిని నరికట్టిరి. వీరినిజూచి సంతసించుచుండగ సంపెంగనూనె నమ్ముచున్న తేలి యువతి వారి కన్నుల కగుపడెను. ఆమె సొబగును వీక్షించి యిట్టి మోహనాంగిని తేలియువతిగా సృజించిన కట్టిడి విధినిదూరి మోహరివాడలోనికి బ్రవేశించుటకై చుట్టునున్న యగడ్తనుదాటి పైడితలుపులు బిగించిన వంకదారిగుండ రాజమార్గముఁ జేరిరి. ఆరాజమార్గము "వారణఘటాఘోటక శకటికాభటకోటిసంకులంబు' గాన నందు బోవవలదు. "క్రింతత్రోవల కలకలంబులు లేక సుఖవినోదములు గలుగును గాన' నందుచాయల బోవుట సుఖమని వారు నిశ్చయించి యాదారిని బట్టిరి. అటు బోవంబోవ వారియెదుట పల్నాటివీరపురుషుల కథనమును పాడు

చున్న పాటగాండ్రను గొంతనే వుపలక్షించి కొనియాడి ముందుకు సాగఁ నేకవీరాదేవి దేవళమును, మాహురమ్మగుడియుఁ గాన్పించినవి. ఈ దేవతలసేవలను జూచియు, జక్కులవాండ్రను, మైలారభటులును, జేయుచున్న జాతరలను వీక్షించియు, చముడేశ్వరీయాలయమును, బౌద్ధ విహారమును, ముద్దరాలు ముసానమ్మ నివాసమును, కుమారస్వామి దేవళమును, పాండవులగుడిని, కర్తారునిమశీదును మున్నగు వివిధదేవాయతనములనుఁ దిలకించి యెదుటనున్న స్వయంభూకేశవస్వాములకుఁ గేల్మోడ్చి మహాభైరవేశ్వరునకు నమస్కరించినిరీక్షించుచుండ నాంధ్రేశ్వరుని మొగసాలపై నున్న గడియారము పదునారు ఘడియలు గొట్టెను. ఆ ఘంటానాదము విని మధ్యాహ్నమగుటచే నాకొన్నవారై పూటకూటింటికిఁ బోవఁ ద్వరపడి బ్రాహ్మణవీథి కేగి లక్ష్మణయొజ్జల యింట నొక్కొక్కరూక నిచ్చి మృష్టాన్నము భుజించిరి. ఆ యింటనున్న బ్రాహ్మణవితంతు పరిచయము జేసికొక తిరిగి పురవీథులకు మొగము ద్రిప్పిరి.

పూలయంగడికి బోయి పుష్పలావికల ప్రౌఢవచోవిలాసముల నాకర్ణించి వేశ్యవాటికం బ్రవేశింప నచట నేదో యొక యుత్సవంపు కలకలము వీక్షించి యదేమియని యడిగి ప్రతాపరుద్రమహారాజుగారి యుంపుడుకత్తె యగు మాచలదేవి వారాంగన చిత్రశాలాప్రవేశము జేయుచున్న యుదిగాన పుణ్యాహవచన సమయ మిదియని తెలిసికొనిరి. అచ్చట కొంతకాలము నిలచి యూరారాజు మన్నించు వన్నెలాడిని సందర్శించి కొంతతడవు సంభాషించి వెండియు బోవంబోవ మంచనశర్మ యొక్క పూర్వంపు గారాబు వెలవెలంది యగు గాంధారి యగపడెను. ఆమెయొద్ద గొంతసేపు వారు సేదదీర్చికొని తిరిగి బయలువెడలి నాగస్వరమున బాడుచున్న నాగులవానిని యటుతర్వాత గొఱ్ఱెపందెములను కోడిపందెములను జూచి యుత్సాహమునుబొంది మంచనశర్మ ప్రి

యురాలగు కామమంజరిగృహము ప్రవేశించిరి. అచ్చట నారేయి యంతయు సుఖనిద్రను గడపి తరువాత తమదారిని దాబోయిరి.

## గ్రంథవిమర్శనము

ఈగ్రంథము క్రీడావిషయములతో నిండియున్న చిన్ననాటకము. జనసామాన్యమందలి సంఘజీవితము ప్రాయికముగా గొప్పపట్టణముల లో విశాలముగా గాన్పించును. నానావిధజాతులు, మతములు, వర్ణములు, నిమ్నోన్నతావస్థలు, బీదసాదలు, సుగుణ దుర్గుణములు యిట్లనేక రూపభేదములు, శీలభేదములు, అవస్థాభేదములును మహాపట్టణముల లో నొకేస్థలమున, నొకేసమయమున జూడ నవకాశ ముండును. ఈ నానారూప మానవప్రకృతిని జూచిన ప్రతిమనుజునకు గొంత సంతసము గలుగక మానదు. గోవిందమంచనశర్మయు, టిట్టిభసెట్టియు, అదేప్రకార మాంధ్రదేశమునకు గేంద్రస్థానమైన ఆంధ్రనగరమునందలి బహుముఖ ప్రసరిత ప్రజా జీవితమును జూడ సమకట్టిరి. కాని, వారు చూడ దలచినది యామహాపట్టణమందలి యున్నతజీవితమును, యుత్కృష్టప్రకాశమును గాక ఆదర్శవిహీనమైన జఘన్యజీవితమును, విషయలోలత్వమును దిలకింప నుద్దేశించికొనిరి. కావుననే బయలుదేరునపుడు టిట్టిభసెట్టి తన యనుంగుచెలికానితో 'మంచన వింటివో వినవో' యనుచు నోరుగంటిపురమునందలి మన్మథుని విజయచిహ్నములను బ్రస్ఫుటముగ వర్ణించెను. కావున నోరుగల్లు నగరములో వారు చూడదలచినది ముఖ్యముగ కాముక వ్యాపారములును, విశృంఖల స్త్రీపురుష కేళీవ్యాసక్త క్రీడావిలాసములును నై యున్నవి. ఈవిధమైన నికృష్ట సంఘజీవితమును తనివిదీరజూచుచు పోవుచున్నను మధ్యమధ్యను మరికొన్ని సాంఘికస్వరూపములు వారి దృష్టికి పొడసూపినవి. మనయదృష్టవశమున వారిక్రీడాపరాయణత్వము ఇట్టి దృశ్యములపైనగూడ బ్రసరించినది. లేనియెడల నాయమూల్యములైన పల్నాటివీరుల వర్ణనము,

మైలారభటుల వర్ణనము, ఏకవీరాదేవి సేవాప్రసంగము నిత్యాది యద్భుత, చారిత్రక, మతవిషయము లిందు జేర్పబడియుండవుగదా! అట్టి యుత్కృష్టదృశ్యములు లేకయే కేవలము మాల మేదరులు మున్నగు వర్ణములలోనున్న జారిణుల లీలావిలాసవర్తనములును, వెలనాటికోడె విధవలును, ఆంధ్రేశ్వరుని వారాంగనయగు మాచలదేవి చిత్రశాలానే పథ్య శృంగారమును ఇత్యాది విటీవిట శృంగారప్రసంగములు మాత్ర మే యుండియుండును. ఎఱిగియో యెఱుగకయో వల్లభామాత్యుడు తన చిన్ననాటకమును కేవలము హాస్యశృంగారరస ప్రేరితముగ జేయక యచ్చటచ్చట నుదారభావ స్ఫురితముగగూడ జేయగల్గెను. మొత్తము మీద గ్రంథ మామూలాగ్రముగ స్త్రీలును, బాలురును జదువదగినది కాకపోయినను కొన్నిపట్టులు చరిత్ర, మతసంబంధమైనవి యగుటచే పఠనయోగ్యములుగా నున్నవి. ఇవి తమోవృతమైన నభమున నక్షత్రములవలె విరాజిల్లుచున్నవి. వానిలో మేటియనదగు పల్నాటి వీరప్ర సంగ ముత్కృష్టకావ్యరస భావములకు రత్నఖనియని చెప్పవచ్చును.

ఈ వీథియందలి శృంగారరసము నీచమై, యశ్లీలమై, నీతి బాహ్యమై యుండుటచేత సామాన్యముగ యువతీయువపఠనీయము కాక పోయినను ఈగ్రంథ మాంధ్రుల ప్రాచీన సాంఘిక చరిత్రమునకు గొంత విలువయైన సామగ్రి నొసగుచున్నది. పదునేనవశతాబ్దిలో హిందూసాంఘికస్థితి యెట్లుండెనో యాదృశ్యము మనకండ్లకు స్పష్టముగా నగపడు నట్లు కావ్యరూపముగ దీనియందు వర్ణింపబడినది. హిందూసంఘమునంద లి వివిధవర్ణములు, వృత్తులు, కులములు, వారివారి యాచారములు, క్రీడావినోదములు మొదలయినవి ప్రాసంగికముగా నభివర్ణింపబడినవి. మేదరవాండ్రు, మాలవాండ్రు, తెలికులవాండ్రు, కాపులు మున్నగు వారి ప్రశంసలు కలవు. అప్పుడైనను పూటకూళ్ళభోజనములు ప్రా

హ్మణులే పెట్టుచుండిరి. ఈకాలమందున్నట్లే యాకాలమందును బూటకూళ్ళ యిండ్లలో దుష్టప్రవర్తనముగల స్త్రీలుండి, పాంథజనులను దీపములవలె నాకర్షించుచుండిరి.

శిష్టాచార సంపత్తిలో నగ్రస్థాన మలంకరించినను కొందరు బ్రాహ్మణులు నీతిబాహ్యమగు కాముకవ్యాపారములందుగూడ నగ్రస్థానము నలంకరించి యుండిరి. గోవిందమంచనశర్మ వేశ్యాలంపటుడై యెదురైనస్త్రీల నందఱిని విటదృష్టితోనే చూచుచుండెను. ఐనను ఇంటివద్ద నిత్యాగ్నిహోత్రము, త్రికాలసంధ్యానుష్ఠానపరుడై, దర్భాంకురాలంకృత హస్తుడై పురవీథులందిరిగెను. ప్రతాపరుద్ర మహీపతి వారాంగనయైన మాచలదేవితో మాటాడుచు సంధ్యానుష్ఠానమునకు వేళయగుటచే వార్చివచ్చెను. ఇట్లు వైదికాచార సంపత్తిలో నైంద్రియ భోగానురక్తి మేళవించి పణ్యయువతీలోలుడై చరించెను. మతమునకును, శీలమునకుగల వైరుధ్యము నేటికాలమునం దుండినట్లే యాకాలమునందునహిత ముండెను. ఈకాలమందు కందుకూరి వీరేశలింగముగారు వేశ్యాభుజంగులగు విద్యాధికుల గుఱించి తమ ప్రహసనములలో తీవ్రముగ పరిహసించిరి. సుమా రేనూరువత్సరముల క్రిందట వినుకొండ వల్లభామాత్యుడు నట్లే విద్యాధికుడగు కాసలనాటి గోవిందమంచనశర్మను గుఱించి భావగర్భితముగ వర్ణించి గేలియొనర్చె. ఈగ్రంథమందలి కవిత ధారాళమై ప్రౌఢమై రసపుష్టికలిగియున్నది. శృంగారవిషయముల నత్యుత్కటముగ స్పృశింపకపోయినయెడల నిది సర్వజనాదరణీయమగు గ్రంథములలో జేర్చుకొనదగినదే. కాని శైలి యెంత మనోజ్ఞముగానున్నను విషయములు నిరంకుశములై రసభావములు చాలవరకు వ్రీడావిహీనములై యుండుటచే గొంతయేవగింపు గలిగించుచున్నది. తత్కారణమున నీగ్రంథమున కున్నతస్థాన మిచ్చుటకు వలను

పడదు. ఐనను మేలైన యాంధ్రచారిత్రకవిషయముల నెక్కుడుగ నిచ్చుటచే నీగ్రంథ మాంధ్రుల కనూనమగుసాయ మొనరించుచున్నది. కాన దీనిని నమూల్యాంధ్ర గ్రంథములలో నొకటిగఁ బరిగణింపదగినది ♦

---

# ఆఱవ అధ్యాయము.

## మల్లికార్జునరాయలు I 1447—1465
## రాజశేఖరరాయలు ?
## విరూపాక్షరాయలు 1465—1485.

# దూబగుంట నారాయణకవి: పంచతంత్రము.

మల్లికార్జునరాయలు, విరూపాక్షరాయలు:—ప్రౌఢదేవరాయలు తరువాత నతని మొదటిభార్యకుమారుఁ డగుమల్లికార్జునరాయలు సింహాసన మెక్కి క్రీ. శ. 1447 మొదలు 1465 ప్రాంతమువఱకు రాజ్యముఁ జేసెను. అతనికాలములో విజయనగరరాజ్యము విస్తరింప

---

♦ ఇదివఱలో నాచన సోమనాథుని గుఱించి నేవ్రాసినప్పుడాతడు నియోగియా వైదికియాయని నిర్ణయించుటకు జరిగిన వాదప్రతివాదముల గురించి ప్రాసంగికముగా సూచింపవలసివచ్చినది. ఆసందర్భమున వ్రాయుచు నాకాలమంలి బ్రాహ్మణులలో వైదిక నియోగి భేదము గగనకుసుమవలె నుండెనని చెప్పితిని. కీ. శే. వంగూరి సుబ్బారావుగారును, కం. వీరేశలింగం ంతులుంగారును నాకాలపు కవులలో గొందఱు నియోగులనియు గొందరు వైదికులనియు భేదముగా నున్నట్లువ్రాసిచ్చిరి. సుబ్బారావుగారు నాచన సోమనాథుడు నియోగియని చెప్పుట దటస్థించెను. సోమనాథుడు నాచిరాజు కొడుకని యొకానొకకవి చెప్పుటచేతను 'రాజ' శబ్దము నియోగులకే గాని వైదికుల

కపోయినను బగతురచేఁ గేవలజీర్ణదశకు రాలేదు. కటకపురిముఖ్యస్థానముగు కళింగదేశపురాజైన కపిలేంద్రగజపతి విజయనగరరాజ్యముపై దండెత్తి మల్లికార్జునరాయలుతో ఘోరయుద్ధముఁ జేసి పరాజయము నొందెను. మల్లికార్జునరాయలమరణానంతరమున క్రీ. శ. 1465 లో

---

కుండదన్న విశ్వాసముచేతను ఆయన యట్లభిప్రాయపడెను. వీరేశలింగముగారు అవిశ్వకముగానే కొందఱు ఆంధ్ర కవులను నియోగులని జెప్పుచువచ్చిరి.

ప్రస్తుత మీ 'క్రీడాభిరామ' మా కాలపు గ్రంథమగుట స్పష్టమేకదా! ఇది సాంఘికప్రబంధమగుటచే బ్రాహ్మణుల వ్యవస్థనుగుఱించికూడ గొంత తెలియవచ్చుచున్నది.

నాయకుడగు కాసల్నాటి గోవిందమంచనశర్మ వినాసాల అప్పయ్య ద్వివేదికి మేనల్లుడు కాబట్టి యితను కాసల్నాటి వైదిక బ్రాహ్మణుడని స్పష్టము. అయినను ఇతనిగుఱించి పేర్కొనిన స్థలములలోఁ గొన్నిటియందు 'శర్మ' యనియు, గొన్నిటియందు 'రాజ' యనియు భేదములేకుండ వాడబడినవి.

1 "గోవిందమంచనశర్మ" (పు.5) 2 గోవిందశర్మమాధవునిపట్టి (పు 6, 3 'మాయలేడిపైతి మంచి రాజ' (పు.5) 4. 'మించుటుద్దంబు చూపరా మంచిరాజ', (పు. 23) గనుక 'రాజ' శబ్దమా కాలమున నియోగిభేద సూచకము గాదని మనవిచేయుచున్నాను.

అట్లే 'సచివ' 'అమాత్య' 'మంత్రి' శబ్దములను కేవలము వైదికులని యీ కాలమునఁ బరిగణింప బడదగినవారి విషయమున గూడ నానాడు వాడుక చేయబడినవి. సంగమరాజమహామంత్రిణా మాయణపుత్రేణ సాయణాచార్యేణ', 'సాయణసచివాత్తుత్తంసంగమరాజస్య పశ్య రాజ్యమిదం,' 'కర్మబ్రహ్మధ్వనీనస్య మంత్రీ భూపతి భూపతేః వ్యాచష్టే చౌండపాచార్యః ప్రకృతే దర్శపూర్ణిమే' ఇత్యాది వాక్యములనుబట్టి కేవలము వైదికబ్రాహ్మణుల కుటుంబములలోను కొందఱు మంత్రులయి రాజకార్యములను నడపుచుండుటయు కలదు. లౌక్యకుటుంబములలోని వారు కొందరు వైదికులుగనే వ్యవహరించుటయు కలదు. 'నియోగి'యని 'వైదికి' యని భేదించి చెప్పుటకా కాలమున నవకాశము లేదు. మహామనీషులు వైదిక మొక కేలను లౌకిక మొక కేలను నిర్వహింపగల సమర్థులుగానుండెడివారు. వారు బ్రాహ్మణులే గాని వైదికులనియు లౌక్యులనియు (నియోగులు) వేఱుపరచుట ఎంతమాత్రము వీలు లేదు. అట్టివారిలో తిక్కయజ్వ, శంభుదాసుడు, నాచనసోముడు, విద్యారణ్యమాధవాచార్యులు, సాయణాచార్యులు, శ్రీనాథుడు, మున్నగువారు ముఖ్యులు. "సాంగవేదవేదియైన" కొమ్మనకు పుత్రుడై "జాతకర్మ ప్రముఖ

నతనిసవతి తమ్ముఁడగు విరూపాక్షరాయలు రాజ్యమునకు వచ్చెను. అతఁడు స్త్రీలంపటుఁడును, విషయలోలుఁడును, మద్యపానప్రమత్తుఁడు నగుటచే రాజ్యము క్షీణదశనొంది పరరాజుల హస్తములఁ బ్రాంత భాగము లన్నియుఁ జిక్కుకొని యుండెను.

---

సంస్కారానంతరంబున వేదాగసమస్తవిద్యాభ్యాసి" యగుచు ననుదినప్రవర్ధనంబుఁ జెందిన, తిక్కన్న సుమంత్రికుటుంబమునఁ బుట్టిమనుమసిద్ధికిమంత్రియైన కారణమున నియోగియని చెప్పిన యెడల మంత్రియైన మాయణకు పుత్రులైతాము ను మంత్రులై సాంగ వేద వేద్యులై వేదములకు భాష్యము రచించిన సాయణమాధవులను వైదిదికులని చెప్పుటకవకాశమేది? వైదికులు కాని యెడల శంకరాచార్య పీఠము నధిష్ఠించుట కర్హతయేది? కావున ఈ కాలమందు వలె యాకాలమందలి బ్రాహ్మణులను వైదికులని నియోగులని విభజించుట గొప్పతప్పని నాయభిప్రాయము. నన్నయభట్టు వైదికియైనయెడల తిక్కయజ్వాయు వైదికియే. వైదికాచార సంపత్తిలో తిక్కన సోమయాజి యేవిషయమున దగ్గనో నిర్ణయింపుడు? సాంగ వేద వేదియై సమస్త శాస్త్రాగమ కూలంకషవిద్యాభ్యాసియై హరిహర బ్రహ్మైక్యమును స్వానుభూతము చేసికొనిన మహాకర్మయోగియై అధ్వరములు చేసిసోమయాజియై వేద వేదాంతముల ప్రత్యక్షమూర్తియైన తిక్కన వైదికి కాక యెట్లునియోగి యయ్యెనో యోచింపుడు! ఇట్టిమహావైదిక శిఖామణిని నియోగి యనిపిలుచుట యందు ఆశబ్దమున కేవిలక్షణమైన యర్థమిచ్చెదరు? మంత్రియగుటయే నియోగిత్వ సూచకమనిన యెడల సాయణమాధవులు గూడ నియోగులే యని చెప్పవలసి వచ్చును. ఈవాదమెంతవిపరీతముగాను హాస్యాస్పదముగా నుండునో యాలోచించు కొన్నయెడల ఆకాలము నాటి బ్రాహ్మణులను వైదికులనియు నియోగులనియు విభాగించుట యందలి తప్పిదము మనకు విస్పష్టమగును.

ఈనావాదనంతయు సుమారు పదునేడవ శతాబ్దము మధ్యవరకు బ్రాహ్మణుల యందు నియోగివైదిక భేదములు లేవని మాత్రమే. అటుతర్వాత తురకలతోడి పోట్లాటలును తురకలరాజ్యములలో ఉద్యోగములును బ్రాహ్మణులకు కలిగినకొలది ఈభేదమేర్పడి క్రమముగా హెచ్చినది. ఇదిముఖ్యముగా హిందూమతమును సంరక్షించుటకొఱకే యని నాయభిప్రాయము. యుద్ధములలో పాల్గొనుచున్న నియోగిదండనాయకులును, తురకల ప్రభుత్వములో ఉద్యోగములు చేయుచున్న నియోగి అమాత్యులును హిందూమతసంబంధమైన కర్మలను చేయలేకపోవుట చేతను, వైదికాచారములను భిన్నముగా జీవింపవలసి యుండుటచేతను, మతప్రవర్తకులు గానున్న బ్రాహ్మణులు

కపిలేంద్రగజపతి కొడుకగు పురుషోత్తమదేవుఁడు సమయముఁ జూచి విజయనగరరాజ్యముపై దాడివెడలి విరూపాక్షరాయల నోడించి కొంతదేశము నాక్రమించుకొనెను. విరూపాక్షరాయల తరువాత నతని పెద్దకుమారుఁ డగు రాజశేఖరుఁడును తరువాత రెండవకుమారుఁ డగు విరూపాక్షరాయలును నామమాత్రముగ రాజ్యముఁ జేసి సంగమవంశ మును నంత మొనర్చిరి.

ఉదయగిరిరాజ్యము:—విజయనగరసామ్రాజ్యమందలి తూర్పు భాగము (ప్రాజ్నాడు) ఉదయగిరిరాజ్య మనుపేర నుదయగిరి ముఖ్య స్థానముగ సామంతరాజులచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఈయుదయ గిరిరాజ్యమునందుఁ గొంతకాలము ప్రధానిత్వము చేసిన వెన్నెలగంటి సిద్ధనమంత్రికి జక్కనకవి తనవిక్రమార్కచరిత్రముఁ గృతియిచ్చిన

అనగా, వేదోక్తమైన జీవనముచేయుచున్న వారు వైదికులని విడిపోవలసివచ్చినది. ఆ భేదము క్రమముగా సంబంధ బాంధవ్యములకు గూడ వ్యాపించినది' పదునారవ శతాబ్దము ప్రారంభములో ననగా, శ్రీకృష్ణదేవరాయల కాలములో దక్షిణ హిందూదేశములో సంచారము చేసిన "పేయిజు" అను పోర్చుగీసు రాయబారి ఆకాలపు బ్రాహ్మణ్యము గురించి యీమాటలువ్రాసెను' "బ్రాహ్మణులలో రెండు తెగలున్నవి. ఒక తెగవారు పట్టణములలోను, బస్తీలలోను, రాజకార్యములను, చేయుచుండువారు. వీరిలో వాణిజ్యము కూడ కొంతమంది చేయుచుందురు. మరియొక తెగవారు మతగురువులుగా నుంటుటయు, దేవాలయపుపనుల యందుండి చాల చదువుకొన్నవారై యున్నారు. వీరిని రాజులు చాల గౌరవించెదరు. గ్రామములలో నున్న బ్రాహ్మణులు కొంతమంది అవినీతివర్తనులై రాజపూజితులైన బ్రాహ్మణులకు భిక్షులుగా నున్నారు."

పైవాక్యముల బట్టిచూచినయెడల యిప్పుడు బ్రాహ్మణులలోనున్న మూడు తెగలును, ఆకాలమున కూడనున్నట్లు కాన్పించుచున్నది. అనగా, వైదికులు, నియోగులు, వ్యాపారులు. వైదికులు మతసంబంధమైన పనులను, నియోగులు రాజకార్యములును, వ్యాపారులు వాణిజ్యమును చేయుచుండెడివారు. ఆవృత్తులు కాలక్రమమున తారుమారైనను యావృత్తిభేదజనితమైనశాఖాభేదము మాత్రము నిలిచిపోయినది. ప్రాజ్ఞులీవిషయమును సాకల్యముగా చిత్తగించి శాఖాభేదనిర్మూలనమునకు గడంగుదురుగాక!

ట్లిదివఱలో వింటిమి. విజయనగరసామ్రాజ్యధ్వంశములోనివా రగుకంప భూపతి మొదలగువారు రాజప్రతినిధులుగ నుండి ఉదయగిరిలోఁ బ్రజాపాలనముఁ జేయుచుండిరి. విజయనగరరాజ్యమందలి కేంద్రస్థానము బలహీనముకాఁగా మాధవవర్మవంశోద్భవుఁడైన బసవభూపాలుఁ డీతూర్పునాఁడునకురా జగుటయుఁ దటస్థించెను.

పూసపాటిమాధవవర్మ:—మాధవవర్మ సూర్యవంశజుఁ డగు క్షత్రియోత్తముఁడు. అతనిఁగూర్చి కవి యిట్లు పలికె.

"మును బెజవాడదుర్గఁ దనముగ్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథదంతివాజిభటభూరిబలంబులచేఁ గళింగ భూ
జనపతిఁ ద్రుంచి చేవఁ దనసంతతికై మహిఁ బాడిఁనిల్పి వి
క్రమ్మనఁ జిరకీర్తులం గనియె మాధవవర్మ తదన్వయంబునన్."

ఈమాధవవర్మయే, ప్రస్తుతము కళింగదేశమందలి విజయనగర రాజు లగు పూసపాటివారు తమమూలపురుషుఁ డని చెప్పుకొనుట కలదు. ఎట్లనిన.

సీ. మా. "అలఘువిక్రముఁడు కో
సలజుమూదిత్యుండు దక్షిణవిజిగీష దాడి వెడలి
నిగమాంతపారగుఁ డాజిభీష్ముండు
శ్రీదేవవర్మ సైన్యాధిపతిగ
నఖిలసీమలవిజయ స్తంభములు నాటి
దివికేగెను; త్రిలింగదేశభూరి
వాహినీపతి దేవవర్మ ప్రభుండయ్యె;
నడ్డూరిసీమ పేరాజిలోన
వల్లభు నోడించి వైభవంబులమించి
సార్వభౌమపదంబు జగతిగాంచె
అతనిసుతుండు బుద్ధావనీశుఁడు రాచ

తబిసిమై గాంచెను ధర్మనృపుని
తనయులాతనికి బుద్ధయదేవవర్మలు,
బుద్ధరాజందుఁ బ్రసిద్ధుఁడయ్యె
అతనితనూజుఁ డాతతబలోన్నతుఁడు మా
ధవవర్మనృపతియుత్రాఁతబోలి
జనకునాజ్ఞను సప్తశతిసాంగముఁగ రామ
దేశికుచే నుపదేశమంది
కనకదుర్గా కటాక్షప్రాప్తవిభవుఁడై
మళియసింగని బోర మ్రందఁజేసి,
చౌబళహత్తమల్ల బలాధిపునిరక్త
ధారచేఁ బరదేవతనుభజించి
వసుదిగింద్రియశకవత్సరంబుల జయ
వాటికాదుర్గవైభవము గాంచి
గగనవాణీవాక్యగౌరవంబునఁ బూస
పాటిభూమిని పురీవరముగట్టి
వాసిగాంచుటఁ బూసపాటివారను నింటి
పేరు గాంచిరి రాచ పెద్దటికము
అమలరాజాదిగా ప్రముఖులు మావారు
తద్గృహనామంబు దాల్చివెలసి"

(విజయనగరము మహారాజకళాశాలాపత్రికనుండి యుద్ధృతము)

పూసపాటిబసవరాజు:—ఈపూసపాటి మాధవవర్మవంశములో నాఱవ పురుషుఁడుగా బసవక్షితీంద్రుఁడు జనించెను. ఈబసవభూపాలుఁడు క్రీ. శ. 1460 సం॥ ప్రాంతములలో రాజ్యముచేసి రణరంగభైరవుఁ డనియు, రశికశిఖామణియనియు, మహావిద్వాంసుఁ డనియు

మనుచరిత్రప్రియుఁ డనియు నిం కేమేమో యనేక సుగుణములకు నెలవనియుఁ గవులచేఁ బ్రస్తుతింపఁబడినవాఁడు. ఈతఁడు కళింగ భూపతు లగుగజపతులకుఁ గుడిభుజముగా నుండి వారిదుర్గములకు వజ్ర పుకవాటముగానుండెనఁట. ప్రథమమున విజయనగరసామ్రాజ్యములో సామంతరాజుగానుండి యొకవంకఁ "దనప్రభువుల దౌర్బల్యావస్థయు మఱియొకవంక గజపతుల నిరాఘాటాటోపమును జూచి గజపతుల పక్షమునఁ జేరి వారి *యుదయగిరిరాజ్యము స్వాధీనపఱచి తాను బల మైన సహాయుఁడుగా నుండె"నని తలంచుట సరియైన దని తోఁచు చున్నది.

బసవభూపాలుఁడు విద్వత్ప్రియుఁడును, గవీశ్వరులకుఁ బట్టుఁ గొమ్మయు నగుటచే నతనికాలమునం దాంధ్రకవిత్వము బాగుగ విలసిల్లినది. ఈమహనీయుడు మనుచరిత్రప్రియుడని వర్ణింపబడి నాడు.........కావున ఈతను కృష్ణదేవరాయల కాలములోగూడ నుండెనా? ఈతని రాజ్యమం దొకచిన్నయుద్యోగిగా నుండి యాంధ్ర కవిత్వవిశారదుఁ డగుదూబగుంట నారాయణకవి గీర్వాణభాషలో నున్నపంచతంత్రమునుఁ దెనుఁగుభాషలో రచించి తన యేలిక కంకిత మొనర్చెను.

దూబగుంట నారాయణకవి. క్రీ. శ. 1480

జన్మస్థానము:—ఈకవి తనగ్రంథములో "దూబగుంటపురిశాస ను నారయ నామధేయునిన్" అని తన్ను గుఱించి చెప్పికొనుటచే నెల్లూరిజిల్లా ఉదయగిరి తాలూకాలో నున్న దూబగుంటగ్రామవాసి యుఁ దద్గ్రామాధికారియు నైనట్లు గనఁబడుచున్నది. ఈతనితండ్రి బ్రహ్మయమంత్రి. తల్లి నాగమ్మ. ఆంధ్రమహాకవు లగుతిక్కనసోమ

* ఈ యుదయగిరి ప్రస్తుతము నెల్లూరుజిల్లాలో నున్నది.

యాజి, ఎఱ్ఱాప్రెగ్గడ మున్నగువారికవితాసౌరభములచే సువాసితమైనదేశమునఁ బుట్టి పెరిఁగి యాంధ్రకవిత్వపటుత్వము నగ్గుఁబాలతోఁ గ్రోలి యుండెను. వారియుద్గ్రంథములు బాల్యాదిఁ బఠనముచేసి యుండుట నిస్సందేహము. కావునఁ దన కవిత్వమందలి శయ్యాపాక రీతులు కొంతవఱకు వీరిగ్రంథములనుండి యలవరించుకొనె నని చెప్పుట యస్వాభావికము గాదు. ప్రాయశః ఎఱ్ఱాప్రెగ్గడకవివరుఁడు తన కిరుగుపొరుగుతాలూకాలోనే జీవించి యుండుటచే శంభుదాసునికవిత్వ మితనికి మార్గదర్శి యయ్యెనని చెప్ప సాహసింపవచ్చును. గ్రంథాదిని జేసిన కవిస్తుతియం దాంధ్రకవీశ్వరులలోఁ గవిత్రయము వారిని దక్కఁ దదితరుల నీకవి పేర్కొని యుండమి గుర్తింపఁదగిన విషయము.

"నన్నయభట్టారకునకు మ్రొక్కి, తిక్కనసోమయాజుల నతిస్తుతులఁ గొలిచి, శంభుదాసుని మదిలోన సంస్మరించి" - - - -

ఈకవియొక్క గురువు కొండయమంత్రి యెఱ్ఱయకుఁ గూరిమి నందనుండును, త్రికాలములందు నీశ్వరారాధనతత్పరుఁడు నగు నాగనార్యుఁడను బ్రాహ్మణశ్రేష్ఠుఁడఁట.

హరిహరారాధన:—మహనీయమహిమాఢ్యుఁ డగు తిక్కన సోమయాజి యాదిగా నెల్లూరిప్రాంతమందలి ప్రాచీనకవులయం దొకవైచిత్ర్యము గానవచ్చెడి. అది యేది యన హరిహరారాధనము. తిక్కనసోమయాజి తన మహాభారతమును హరిహరనాథున కంకిత మొనర్చుట లోకవిదితమే కదా! సోమయాజుల యనుయాయి యగునాచన సోముఁడు హరిహరాత్మక మగుపరతత్త్వమునందలి భక్తి నుత్తరహరివంశమున నుద్రేకస్ఫూర్తితో నుడివెనుగదా! ఇంక 'విక్రమార్కచరిత్ర' గ్రంథకర్త యగుజక్కన హరిహరారాధకుఁడు. ప్రస్తుతము దూబగుంట నారాయణకవియు హరిహరభక్తుఁడే కావున నీవిషయసంచయ

ముఁ జూడ హరిహరారాధనవిధానము మహనీయుఁ డగుతిక్కయజ్వచేఁ బ్రారంభితమై యాతనియురుకీర్తి గౌరవసంపత్తిచే విస్తృతమైన దని చెప్పవచ్చును.

ఈయూరాధనాతత్త్వముయొక్క యావశ్యకత యెయ్యదియో విచారణీయము. హిందూదేశచరిత్రముఁ, బ్రాచీనాంధ్రగ్రంథములను గొంతవఱకుఁ జదివి చూడఁ నాకుఁ దోఁచినయభిప్రాయము నిటఁ గ్లుప్తముగా వ్రాసెద. దక్షిణహిందూస్థానమునఁ బండ్రెండవశతాబ్దమునుండి పదునైదవశతాబ్దము వఱకు హిందూమతములో వివిధసంస్కరణములుఁ దత్కారణమునఁ స్పర్థలుఁ గలవరములుఁ గాలక్రమోద్ధతముగాఁ బెరిఁగినవి. పండ్రెండవశతాబ్దమున నొక దిక్కున బసవారాధ్యులచే నుద్ధరింపఁబడిన వీరశైవమతమును, వేఱొకదిక్కునను శ్రీరామానుజులవారిచే నుజ్జీవితమైన వీరవైష్ణవమతమును శ్రీశంకరులవారి యద్వైతమతమును డిందుపఱిచి పరస్పరవిజిగీషచే ముఖ్యముగాఁ గన్నడదేశము, అరవదేశములలో దురహంకారప్రేరితములై చిందులు ద్రొక్కుచుండెను. పటుతరవాగ్వాదమున నేమి, చటులకరవాలసహాయమున నేమి యాయా మతావలంబకులు ప్రతిపక్షులను ఖండన మొనరించుచు సంకులసమరము గావించుచుండిరి. ఇట్లుండఁ బదుమూఁడవశతాబ్దమున మధ్వాచార్యులవారు మఱియొకవిధముగ వైష్ణవవిభాగమును గావించి కయ్యపువేడుకను ముప్పిరిగొల్పిరి. ఇట్లావేశపూరితముగాఁ బెనఁగులాడుచుండిన వ్యవస్థలో హిందూమతముయొక్క నిజతత్త్వమహిమ గుప్తమై యదృశ్య మయ్యెను. "శ్రీయుతమైన దివ్యమణిఁ బాఱవైచి తచ్ఛాయ యొకింత గల గాజుపూసకై" పెనఁగు లాడుచుండిన కక్షిదారులకొఱకు, ఆత్మైకతత్త్వమును బోధచేయుటయు, నానారూపధరుఁ డగుభగవంతుఁ డొకఁడే యని నిర్ధరించుటయు నవశ్యాచరణీయమని

కొండఱు మహాత్ము లుపలక్షించి కలహకారణమైన హరిహరవిభేదము మాయారూపిమైన మృగతృష్ణవలె నిరాస్పద మని యుద్ఘోషింపసాగిరి.

అట్టిసుస్థిరమతులును, సనాతనధర్మానుష్ఠాన నిరతులును, వేద శాస్త్రపారంగతులును, శాంతిశీలవ్రతులు నగుమహాత్ములలో నొకరు తిక్కనసోమయాజి. ఈ మహనీయుని స్థితి యనన్యసామాన్యమైనది. ఆంధ్రదేశమందుఁ దత్కాలమందేగాక యింక నెల్లకాలములకును నాం ధ్రకవీశ్వరులలో నత్యుత్తమస్థాన మలంకరించుచు లౌక్యరాజకీయ వ్యవ హారములలోఁ దనయేలికమైన మనుమసిద్ధియొద్దఁ బ్రధానామాత్యుఁ డుగా నుండి యుభయభాషాప్రపంచము నుద్ధరించుచు హిందూసనాతన మతగౌరవమును సంస్థాపించుచుఁ దనజీవితము నన్నివిధముల దేశసేవా దీక్ష కర్పించినవాఁడు. శ్రీశంకరులవారు నెలకొల్పిన స్మార్తమతమం దుఁబుట్టి యీశ్వరారాధనతత్పరుఁడై యజ్ఞములఁజేసి సోమయాజియై నిశ్చలాద్వైతబుద్ధిని హరిహరాత్మక మగుపరమాత్మను ధ్యానించు చుండెను.

'శ్రీయన గౌరినాఁ బరఁగుచెల్వకుఁ జిత్తముపల్లవింప'......

(భారతవిరాటపర్వము)

ఆకాలమందు శైవులకును వైష్ణవులకును గల కలహకల్లోలము లు తనదేశమం దెక్కుడుగ వ్యాపింపకపోయినను దానోరుగల్లు పోయి ప్రతాపరుద్రుని యాస్థానమునఁ గొంతకాల ముండినతఱి శ్రీరామా నుజ బసవారాధ్యమతములకుఁ గల ఘోరవైషమ్యములఁ బ్రత్యక్ష ముగఁ జూచినవాఁ డయ్యెను. అట నన్యమతములవారితో వాదప్రతి వాదప్రౌఢి నెఱపి తనజ్ఞాన విజ్ఞానప్రతిభాతేజమున నచ్చటివారియుల్లం బుల సనాతన హిందూమతము యొక్క యనాదిజ్యోతిని వెలిగించి హరిహరాద్వైతమున నెప్పటికంటె నెక్కుడు విశ్వాసమును బట్టుదల యుఁ గలవాఁ డయ్యెను.

అట్టిమహాపురుషుఁడు హరిహరారాధనఁజేయఁ గడంగు టొక వింతయే! కావున భేదరహిత మైనసూతనమతమును శాంతిస్థాపనకొఱకును, హిందూమతమునకుఁ గీటురాయివలె నున్నయద్వైత పరమసిద్ధాంతమునుఁ బునర్నిర్మాణము గావించుటకొఱకును నీ మహానుభావుఁ డుద్భవించె నని చెప్పుట సత్యమని తోఁచుచున్నది.

ఈప్రకారము నిర్ణయించుటయే సత్య మైనయెడల హరిహరనాఁథుడను దేవతావిగ్రహము నెల్లూరిలో నుండెనా లేదా యని యీనడుమ జరిగిన వాదప్రతివాదములకుఁ బ్రత్యుత్తరము కూడఁ జేకూరుచున్నది. అనేకవిధములఁ జూడఁగా హరిహరాత్మక మగునద్వైత తత్త్వోపాసన మొనరించుటయే కాని తద్ధ్యానముకొఱకు నెలకొల్పబడిన విగ్రహరూప మైనదేవత నారాధించి యుండలేదని తేలుచున్నది. అట్టివిగ్రహము గలదేవాలయము నెల్లూరిలోఁగాని యాప్రాంతమందలి మఱియొకస్థలములోఁ గాని యుండిన యెడల నద్వైతనిత్యోపాసి యగుతిక్కమనీషి వర్ణింపకపోయినను గేవలము కవులుమాత్రముగనే పరిగణింపఁబడిన యతనిశిష్యులును భక్తులునై నను వర్ణించియుండరా?

నారాయణకవివలెఁ బంచతంత్రమును దెనుఁగుబాస రచించిన పర్వతరాజు వేంకటనాథుఁడు తనగ్రంథమును హరిహరనాథున కంకిత మొనర్చుచు వ్రాసినభాగము ప్రస్తుతవిషయమునుఁ గొంతదనుక ద్యోతకపఱుచుచున్నది గావున దానిని నిటఁజేర్చెద:—

"అని యిష్టదేవతానుతియును బురాతనకవిస్తుతియు నాచార్య పురస్కృతియుఁ గుకవితిరస్కృతియుఁ గావించి యే నొక్కనాఁడు పంచతంత్రం బాంధ్రభాషం జంపూప్రబంధంబుఁ జేయం బ్రారంభించి యేతత్కావ్యకన్యకారత్నంబున కనుకూలవల్లభుం డేదేవుండొకో యని యని విచారించి శయ్యాతలంబున శయనించిన—

శ్లో. హృన్నిత్యయాచ రమయా ప్యుమయా ప్రభుత్వం
మాళీతుపారఘృణినా జగతాం గురుత్వమ్
సందీపయ న్నభసికోపి మహా న్పుమాన్మే
స్వప్నే శుభేఽసితసితద్యుతి రావిరాసీత్.

క. కలలో నలువుం దెలువుం
గలవేలుపుదొర యగణ్యకారుణ్యరసం
బొలయ ననుఁ జూచి ద్రాక్షా
ఫలమధురపరిణయపూర్వభాషలఁ బలికెన్.

క. నను హరిహరనాథునిగా
మనమునఁ దలపోయు నృపకుమారకవిద్వ
జ్జనసేవ్యము నీకావ్యము
దనకి మ్మభిమతవరప్రదాతకు భక్తిన్.

అని యానతిచ్చి యావేల్పు విచ్చేసిన నానందకందళితపులక దంశితుండ నై మేలుకొని

క. ఏచనువుగలదు హరిహర
సాచివ్యము నొంద నన్యజనులకు మదినా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

... ... ... ... ...

ఈ స్వప్నవృత్తాంతమునకును భారతములో నున్న తిక్కన సోమయాజి స్వప్నవృత్తాంతమునకు నెక్కుడు వ్యత్యాసము గాన్పింపదు. కావున భారత మందలి హరిహరనాథుఁడే యేదో యొకస్థలమందుఁ బ్రతిష్ఠింపఁబడిన దేవతాప్రతిమ గాక కేవల ముపాసనదైవ మని నమ్మవచ్చును. ఈహరిహరారాధనచర్చయంతయుఁ బ్రస్తుతవిషయము

కాకపోయినను సందర్భానుసారముగ వచ్చిన చరిత్రాంశము గాన నొకిం చుక విపులముగఁ జర్చించితిని. సుహృదయులు మన్నింతురుగాక.

పంచతంత్రము:—విష్ణుశర్మచే సంస్కృతమునఁ బంచతంత్రము క్రీ. శ. 5వ శతాబ్దములో రచింపఁబడినది. ఈగ్రంథము చిత్రవిచిత్ర కథలతో విరాజిల్లుచు నాబాలగోపాలమునకు నీత్యుద్బోధకముగానుండి ముఖ్యముగా రాజనీతినిఁ బ్రకటించుచున్నది. కాలక్రమమున భరత దేశమం దంతటను దేశభాషలలోఁ బరివర్తన మొందుటయేగాక, అర బ్బీ, పారశీకభాషలద్వారా పాశ్చాత్యప్రపంచమునకుఁ గూడఁ బ్రాఁకె నది. పాశ్చాత్యభాషలలో నిది 'బిల్పై (లేక) బిడ్పైకథ'లనునామాం తరమునఁ బిలువఁబడుచుండెను. బిల్పై (లేక) బిడ్పైయనుమాట 'విద్యాపతి' లేక 'బిద్యాపతి' అను సంస్కృతశబ్దముయొక్క యాభాస మని రైసుదొరగారు తమ "కర్ణాటకవాఙ్మయచరిత్రములో" వ్రాసియు న్నారు. ఈ నిర్వచన మంతసాధువని నాకుఁ దోఁపదు. 'విద్యాపతి' శబ్దముకంటె 'విష్ణు' శబ్దభవమగు 'విఠు' శబ్దమునుండి పుట్టినట్లు నాకుఁ గాన్పించుచున్నది. ఏలయన గ్రంథకర్తనామమగు 'విష్ణుశర్మ' యందు 'శర్మ' శబ్దము గౌరవసూచకమగు బిరుద మని యెల్లరెఱిఁగిన విషయమే కావున మొదటిపేరు 'విష్ణు' లేక 'విష్ణప్ప' కుఁ గన్నడమహా రాష్ట్రభాషలలో 'విఠు' లేక 'విఠప్ప' యని గ్రామ్యవ్యాహృతి గలదు కదా. అకారణముననే పంధరపురములో నున్న విష్ణుదేవునకు విఠలదేవుఁడని నామాంతరము గూడఁ గలదు. 'విఠప్ప' యొక్కయా భాసము 'బిడ్డప్ప,' 'బిడ్ప' లేక 'బిడ్పె' యనియు దాని కన్యదేశరూపాం తరము 'బిల్పె' యనియు నూహింప సమంజసమని తోఁచుచున్నది.

విష్ణుశర్మ 'పంచతంత్రము' అనేకగ్రంథములకు మాతృక. కొన్ని కేవలము భాషాంతరీకరణములు. కొన్ని కొలఁదిమార్పులతోఁ జేరిన యనువాదములు. కొన్ని నామాంతరముఁ బొందిన నిజప్రకృతులు.

మఱికొన్ని పుట్టినబిడ్డలు ఇట్లు వేఱువేఱువిధములుగ వేఱువేఱు గ్రంథకర్తలచే నీగ్రంథరాజము చాలకాలమునుండి యన్ని దేశములందు వెల్లడి యగుచున్నది. సంస్కృతభాషలోనే 'హితోపదేశ' మను నామాంతరమున నారాయణభట్టనుకవి దీనినే కొలఁదిమార్పులతో వ్రాసినాఁడు. ఆభాషయందే క్షేమేంద్రకవి విరచితమైన మఱియొకపంచతంత్రమున్నట్లును నీరెంటికిని సామ్యముకంటె భేద మెక్కుడుగా నున్నట్లును దెలియవచ్చుచున్నది.

ఇంక దేశభాషలలోని పరివర్తనములఁ గూర్చి చెప్పనలవికాదు. కన్నడమందు 12-వ శతాబ్దమున దుర్గసింహుఁ డనుకవివరుఁడు చంపూప్రబంధముగా వ్రాసెను. ఆంధ్రవాఙ్మయమందుఁ బంచతంత్రమును భాషాంతరీకరణముఁ జేయుటలో నీనారాయణకవియే ప్రథముఁడు. ఈతనితరువాత వేఱు వేఱు శతాబ్దములలో వేఱు వేఱు గ్రంథకర్తలచేఁ బద్యమునగానిఁ, గద్యమునఁగాని యీగ్రంథము వ్రాయఁబడినది. 15-వ శతాబ్దముననే నెల్లూరిప్రాంతము వాఁడైన పర్వతరాజు వేంకటనాథుఁడను క్షత్రియ కవివరుఁడు దీనినే పద్యగ్రంథముగా రచించెను. వీనిగ్రంథమునకును నారాయణకవి దానికిని గలసామ్యభేదములను, గుణావగుణములను స్థలాంతరమునఁ జర్చించెదను. ఇదిగాక కడచినశతాబ్దమున అనఁగా 19వ శతాబ్దమునఁ బంచతంత్ర మనేకులచేఁ దెనిగింపఁబడినది. కారణము విద్యసార్వజనీనక మగుటచేఁ బాఠశాలలలో దేశభాష కఱపుటకుఁగాను సులభమైనట్టివియు రుచ్యమైనట్టివియుఁ గథలు కావలసివచ్చెను. అట్టివి పంచతంత్రమందు వందలకొలఁది యుండుటచే నాంధ్రగ్రంథకర్తృత్వవిశారదులగువారు కొందఱీ గ్రంథమును గద్యమునఁగాని పద్యమునఁగాని వ్రాసిరి. అధునాతనంబున నాంధ్రవచనరచనయందుఁ బ్రథమమార్గదర్శియని చెప్పనొప్పు పరవస్తు చిన్నయసూరిగారు "నీతిచంద్రిక" యనుపేర నీగ్రంథమందలి కొంతభాగము నొకించుకమార్పులతో వచనగ్రంథముగ

వ్రాసిరి. అందలి శైలి పండితుల కాహ్లాదజనక మగునట్లుగా భాషాప్రౌఢిమమనెఱపుచున్నను సామాన్యజనావళికి సులభభేద్యముగాక రుచింపఁ జాలదు. ఈకొఱంత దీర్చుటకో యనబహుళాంధ్రగ్రంథనిర్మాతయగు కందుకూరి వీరేశలింగముగారు సూరిగారివల్ల శేషింపఁబడిన భాగము నుఁదన సహజమృదుమధుర గంభీరశైలి ననువదించిరి. ఇంతియ కాక చిన్నయ్యసూరిగారికిఁ బ్రత్యర్థిగా మెలఁగుచు వచ్చిన శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారును (వీరేశలింగముగారికిఁ బ్రత్యర్థిగానున్న కొక్కొండ వెంకటరత్నముగారునుకూడ తెనిగించిరి.) నీగ్రంథమును తెనిఁగించిరట. అది నాకు లభ్యముకాలేదు. కావుననది పద్యమోగద్యమో చెప్పఁజాలను. మఱియు ఉల్లంగి రామచంద్రరావుగారను నెల్లూరివారుఁడు దీనిని బద్యగ్రంథముగా వ్రాసెను. ఇట్లే యింకను ననేకములుండవచ్చును. మొత్తముమీఁద నీకాలమందుఁ బంచతంత్రము చాలవఱకు బాలురవిద్యావిధానమున కుపయోగ్యమయ్యె నని యొప్పుకొనక తీఱదు.

కథాభాగము:—రాజనీతియందుఁ జేరిన యయిదుతంత్రములఁ గూర్చి వ్రాయఁబడినది గాన నియ్యది పంచతంత్ర మనుపేరఁ బరఁగుచున్నది. ఆయా తంత్రము లేవన:—మిత్రభేదము, మిత్రలాభము, సంధి, విగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము. వీనిలో సంధివిగ్రహమునకు కాకోలూకీయ మను వేఱునామమునఁ గూడఁ గొన్నిప్రతుల యందుఁ గాననయ్యెడి. ఈతంత్రము లైదును పాటలీపుత్రరాజగు సుదర్శనుని కుమారులకు విష్ణుశర్మచే రాజనీత్యుద్బోధకముగాఁ జిత్రకథారూపమునఁ జెప్పఁబడియె.

భాషాంతరీకరణము:—నారాయణకవి యనువాదము గాని తదితరులవి గాని మాతృకకు శబ్దప్రతిశబ్దసమములుగావు. మూలగ్రంథమందలి కథాభాగముల ముఖ్యాంశముల మాత్రము గైకొని మిగిలిన విషయములలో యథేచ్ఛావిహారముగా వ్రాయఁబడినవి. హేతువివ

రణ సంభాషణాదులలోఁ బ్రతి గ్రంథకర్తయుఁ దనయిచ్చవచ్చినట్లు వ్రాయుటయే గాని మాతృకకు విధేయుఁడై యుండలేదు. నారాయణ కవియు నటులే యొనర్చెను. మఱియొక భేదము. మాతృకయం దలి యాంతరకథలును యథాయాపముగా నైనను దీసికొనఁబడలేదు. కొన్ని కేవలము విడిచిపెట్టఁబడి వానిస్థానమునఁ గ్రొత్తకథలు కల్పిం పఁబడినవి మఱికొన్ని కొలఁదిమార్పులతో స్వీకరింపఁబడినవి. కావున భాషాంతరీకరణము నిర్భిన్నమాతృకానుయాయి గాక కించిద్యథేచ్ఛా విహారిగా నుండెను.

నారాయణకవియు, వేంకటనాథుఁడును:—మూలగ్రంథములో నున్న దంతిలునికథయు, కౌలికునికథయు నుభయకవులచేఁ బరిత్య క్తము లయ్యె. బహుశః రెంటిలో రాజస్త్రీల యనులోమవ్యభిచార విషయిక మగువృత్తాంత ముండుటచేఁ బరిత్యజింపఁబడియెఁ గాబోలు. అటులే నీలితొట్టెలోఁ బడిన నక్క_కథయు_దీనిని విడుచుటకుఁ గార ణము మృగ్యము. దండనాథునకు వానికొడుకునకు సమానబంధకి యగు గొల్లదానికథ విసర్జితమై యాస్థానమందు జారత్వకళంకరహిత మైన వేఱొకకథఁ గాన్పించుచున్నది. ఈదృశంబు లగు భేదంబుల నారయ నా కొండు రెండభిప్రాయములు పొడసూపుచున్నవి. ఇట్టికథలు లేని గీర్వాణమాతృక యొకటి యుండుటయో లేక యాంధ్రకవులే యాక థలను నీతిబాహ్యము లని వీడుటయో కానోవు. నాకుఁ జిక్కిన గీర్వాణమూలగ్రంథము లన్నిటిలో నీకథ లున్నవి. బహుశః రెండవ యూహయే సరియని నమ్మవచ్చును.

ఇఁక వర్ణన సంభాషణాదికములలో నుభయకవులును నచ్చట చ్చట మూలగ్రంథముకంటె భిన్నమార్గములనే దొక్కిరి. నారాయ ణకవి వర్ణనలయందును సంభాషణలయందును జాల హ్రస్వభావము నగపఱిచెను. వేంకటనాథుఁ డట్లుగాక సమయోచిత వర్ణనలతోను రస

పూరితము లగుసంభాషణలతోను దనగ్రంథము నలంకరించి సాహితీ ప్రపంచమునకు విందొనరించెను. స్థాలీపులాకముగా నీయుదాహరణ ములఁ జూడుఁడు:—

1. హంసకచ్ఛపముల కథ:—

i. మూలగ్రంథమున "కస్మింశ్చిజ్జలాశయే" యని మాత్ర మున్నది. నారాయణకవి దాని నిట్లు పెంచెను.

ii. "నిరంతరసౌఖ్యాడంబర మగునొకకొలను"

iii. వేంకటనాథుఁడు దానినే

క "కేలెత్తి యిసుముఁ జల్లిన, రాలని యొక కానలో మరాళీవికస
న్నాళీకమధూళీమ, త్తాళీనాళీఖురాళి యగుకొల నొప్పున్."

వ. అది సమగ్రశరంబును సమదసారంగభాసురంబును స్వర్ణ పత్రరుచిరంబును నై సంగ్రామంబును ననిమిషకులాధారంబును - - - బురుడించు - -

2. సూచీముఖ మనుపిచ్చుక కథ:—

i. మూలగ్రంథము. "కదాచిత్ హేమంతసమయే అతికఠోర వాత సంస్పర్శవేపమానకళేబరం, తుషారవర్షోద్ధత ప్రవర్షఘనధారానిపా తసమాహతం కథంచిత్ శాంతిమగమత్. అథ కేచి ద్వానరాః" దీనికి నారాయణకవి.

సీ "ప్రాలేయభూధరప్రాంతకాంతార ప్రదేశభాసురసరిత్తీరములను
దాలతమాలతక్కోలహింతాలాది రాజితానేక మహీజములను
- - - - - -సారిదివిహరించుఁ గపు లొకచోటఁగూడి - - -

ii. వేంకటనాథుఁడు:—(66. వ పుట.)

ఉ. అంత నితాంతశైత్యకరమై కర మొప్పవహించి మించు హే
మంతము సేవమానలసమాన బకౌఘవళక్షితాఖిలా
శాంతముపాంత - - - - - - - - - - -

iii. జోలిమాలినపనికిఁ బోయి ప్రాణముఁగోల్పోయిన క్రోఁతికథ:—

i. మూలగ్రంథము:—"కస్మింశ్చిన్నగరాభ్యాసే కేనాపి వణిక్పుత్రేణ తరుషండమధ్యే దేవతాయతనం కర్తు మారబ్ధం తత్రచ యేకర్మకరాః స్థపత్యాదయః తే మధ్యాహ్న వేలాయా మాహారార్థం నగర మధ్యే గచ్ఛంతి అథ కదాచిత్తత్రానుషంగికం వానరయూథ మితశ్చేతశ్చ పరిభ్రమ దాగతం - - - -"

ii. నారాయణకవి.

చ. "ఒకనగరంబుచేరువ మహోన్నత దేవగృహంబు జీర్ణమై
వికలతనొంది యర్ధము భువింబడి యుండఁగ దానిఁ జూచి యు
త్సుకమతి నొక్కవైశ్యుఁడది తొల్లిటి యందము నొందునట్లుగా
నకుటిలవృత్తిఁ జేయుఁ డని యర్థమొసంగిన శిల్పకారులున్"

iii వేంకటనాథుఁడు:—

ఈ స్వల్పవిషయము శృంగారరస ప్రాధాన్యముకొఱకు బహువిపులముగఁ బెంచఁబడినది. అది యెట్లన:—ఉజ్జయినీపట్టణమం దొక వేశ్యాంగన యుండెను. ఆమెరూపలావణ్యము లతిరమణీయములు. విటుల యుల్లంబుల నామె కొల్లవెట్టుచుండెను. ఇట్లుండ నొకానొకరాత్రి యామెయథాపూర్వముగా దేవాలయమున నాట్యసేవయొనర్చి యింటికి మగిడి వచ్చుచుండఁగా నొకనాగుఁబా మామెను గఱచెను. అనేకవిధములఁ జికిత్సఁ జేసినను నామె మృతినొందెను. ఆమె బంధువులు దహన సంస్కార మొనర్చుటకుఁ బూర్వ మాకళేబరమును దేవాలయమునకుఁ గొనిపోయి దుర్గాసాన్నిధ్యమున నుంచి తమబంధువురాలు పునర్జీవిత యయ్యెనేని యామహాశక్తి కొకమంటపము గట్టించెదమని మ్రొక్కులిడిరి. అంత నత్యద్భుతముగ నా వారాంగన పునర్జీవిత యయ్యె. తరువాతఁ దాముచేసిన ప్రతిజ్ఞ చొప్పున మంటపము గట్టుటకు వలయు తరుకాండముల వారు సమకూర్చిరి- - - -ఆతరువాయి మామూలుకథ.

ఇట్లు గ్రంథపరివర్తనములో నారాయణకవికంటె వేంకటనాథుఁడు పిచ్చిపిచ్చికల్పన లల్లియు, నద్భుతవర్ణనలఁ జేసియు గ్రంథమును జాలవఱకుఁ బెంచెను.

నారాయణకవి కవిత్వము:—ఈయనకవిత్వ మంతయు మృదువుగాను మధురముగా నుండును. సంస్కృతశబ్దభూయిష్ఠమైన దీర్ఘసమాసములు సామాన్యముగాఁ గానరావు. విద్వత్ ప్రౌఢిమతో వెలిపించు కఠినపదములను నద్భుత పాండిత్యముతోఁ గలవరించు కథాసంప్రదాయములను జిగిబిగిగాఁ జొప్పించి యుండలేదు. గ్రంథ మంతయు సులభమైనదియు స్వాభావికమైనదియు నగు శైలినే వ్రాయఁబడినది. సామాన్యముగా దేశీయపదముల నెక్కువగాఁ గవివాడినాఁడు. ఈవిషయములో సయితము తిక్కనసోమయాజి వర్గమునే కవిపోలినట్లు చెప్పవచ్చును. ధారాశుద్ధి చాల నిరర్గళమై యనంతామాత్యునిదివలె నిరాడంబరమై సహజమనోజ్ఞతను గనఁబర్చుచున్నది. భావసంపుటియందును భావనావిస్తృతియందును నెక్కువగఁ బ్రతిభాగాంభీర్యములు కాన్పింపవు. అయిననుఁ గవనధోరణి యెచ్చోట నైనను రసవిహీనత నొందదు. అయోగ్యములు, అశ్లీలము లగువిషయములఁ బరిత్యజించుటచే గ్రంథమామూలాగ్రముగ స్త్రీపురుషులును బాలవృద్ధులును జంకు గొంకులు లేక చదువవచ్చును. శృంగారరసావేశమున భ్రమఁజెంది వీటిఁడివలె నెచ్చటను వ్రాయలేదు. ప్రతిపట్టున సహజమైన బుద్ధినైర్మల్యమును గనఁబఱచెను. అలంకారములయందును వర్ణనలయందు నతిమాత్రముగాఁ బోలేదు. కవిత్వము సహజసౌష్ఠవ కోమలత్వములఁ బొంది, నానావిధ భాషాభూషణములఁ బోనాడి, సౌహృద హృదయంగమముగా నుండును. నారాయణకవి గొప్పపండితుఁడని చెప్పుట కవకాశము లేదు. మహాకవీశ్వరుఁడని చెప్పుటకు వీలులేదు. సామాన్యకవి యనియే భావింపఁదగినది. బహుళః యీకవివరుని రచన యంతప్రౌఢముగా లేదని

కాఁబోలు వేంకటనాథుఁ డాకాలమందే యాగ్రంథమునే వేఱొకరీతిని దెనిఁగింప సమకట్టెను. వేంకటనాథుని కవిత్వము ప్రాయశః పండితా స్వాదనీయముగాని సామాన్యజనులు చవిచూచుటకైన శక్యముకాదు. తిక్కనసోమయాజివంటి మహాకవిపుంగవుఁ డాంధ్రావళికై తనభారత మును సులభశైలిని వ్రాసియుండెను గాని వేంకటనాథకవి మున్నగు వారు ముఖ్యముగాఁ బాండిత్యప్రకర్షయే ప్రధానముగ నెంచి తమకవి త్వము దురవగాహ్య మగునట్లు చేసిరి. పాపము నారాయణకవి మాత్ర మట్లూహింపలేదు. ఈకవీశ్వరుని కవిత్వముఁ గూర్చి బసవభూపాలుఁడు చెప్పిన మాట లిట్లున్నవి.

చ. సురుచిరమైన నీకవిత సూరిసభాంతర యోగ్యతామనో
హరసరసార్థగుంభనల నందము గావున నారనార్య సు
స్థిరగతిఁ గీర్తి నన్నొనరఁజేసి సమస్తజగత్ప్రసిద్ధమై
పరఁగుచునుండ మాకొకప్రబంధ మొనర్పు ప్రియం బెలర్పఁగన్.

ఇందతిమాత్రస్వోత్కర్ష లేక కేవల మర్హ మగువఱకే కవి తన్ను గుఱించి చెప్పికొనెను. ఈకవియొక్క వినయసంపత్తిని పరావగుణసహి ష్ణుతయును జూపెడు మఱి యొకదృష్టాంతము సామాన్యముగా నాంధ్ర కవులు తమగ్రంథాదియం దిష్టదేవతాప్రార్థనంబుఁ జేసిన తరువాత, సు కవిపురస్కృతియుఁ గుకవితిరస్కృతియుఁ జేయుట వాడుక. ఈవిధ మునఁ బెద్దనాదిమహాకవులు వారివారి క్రోధానలజాలంబులు నల్ప కవులపైఁ బ్రయోగించి మితిమీఱినపరుషవాక్యంబులచే వారినిదూషిం చిరి. నారాయణకవి యట్లుచేయక తనసహజమృదు మధురమానసా మృతమునఁ గవులను గవిబ్రువులనుదనిపి యందఱకును సర్వతోభిమత మైన విజ్ఞప్తి నిట్లుచేసినాఁడు.

ఉ. చెప్పిన నాకవిత్వము రుచింపనివారలు చూచి చెప్పుఁడీ
తప్పులు లేనిచో నవుగదా యని తీర్పుఁడు మాటిమాటికిం

జెప్పఁగఁ డొప్పఁ దప్పనుచుఁ జెప్పఁగ నేర్చినవాని కొక్కచోఁ
దప్పులు లేకమానవని వని తద్జ్ఞు లెఱుంగుఁడుమీరు మొక్కెదన్.

ఇదియ నిజమైన సౌహార్దతయు వివేకతయు. ఈతనికవనశైలి యందలి మార్దవమును గోమలత్వమును దెలిపెడు పద్యములు లెక్కకు మిక్కిలి గలవు గాని యొండు రెంటిమాత్రి మిటఁగూర్చెద.

మ. హాలికుం డొపి సమస్తబీజముల నయ్యైవేళలం జల్లుచో
నెలమిం బుట్టిన కోమలాంకురముల న్వీక్షించి నున్మన్న తాఁ
దెలియుఁ సస్యఫలంబు లాకరణి నర్థిన్ బుద్ధిమంతుండు మ
ర్త్యుల యాకారము సూచి నిశ్చయము సేయుం దన్మనోవృత్తులన్.
(మిం. భే)

ఉ మారుతముల్ వనంబులను మానుగ షట్పదపంక్తి పుష్పవల్
హారివిహారిచారుకలహంసము లంబులఁ బక్షు లంబరా
ధారము గోరునట్లు ప్రియదంబుగ నేనును నిన్నుఁ జూడఁగా
గారణమాటఁ జేసి ఫలకాంక్షలఁ జేరితి మివ్విధంబునన్.
(సుహృల్లాభము)

ఉ. హారపటీరహీరరజతాద్రితుషారధరాధరేంద్రమం
దారమరాళరాజహరనారదపారదకుందచంద్రికా
క్షీరమృణాలశంఖసురసింధురఫేనఫణీశకాశక
ర్పూరసమానకీర్తివరభూషణ సజ్జనలోకపోషణా. (సంధి విగ్రహము)

క్రిందిపద్యమునఁ బారుష్యము లేని నిష్ఠురవాక్యపరంపరలను జూడుఁడు.

సీ. కలకంఠిగర్భంబు కాఁగిపోయిన మేలు
పుట్టినప్పుడ మృతిఁబొంద మేలు
తగ బుతుకాలంబు దప్పిపోయిన మేలు
కన్యయైనను నంతకంటె మేలు

కాంతుఁడు పరదేశ గమనుఁడైనను మేలు
మగువ గొడ్రాలైన మఱియుమేలు
పల్లవాధర పతి నొల్లకుండిన మేలు
పడఁతుక తెగులుచేఁ బడిన మేలు
గాక శాస్త్రపరిజ్ఞానఘనులు గాని,
సుతులు గల్గినఁ దండ్రికి సొంపుగలదె
రూపబలవిక్రమాద్భుతాటోపులైన,
నధిక ధనవంతులైన నయ్యధము లేల.

గ్రంథఫలశ్రుతి:—

చ కదిసిపఠింప లోకహితాకార్యము లెల్లను దోఁచు మూఢులై
చదువనివారికిం దెలివి చాల నొనర్పదు నీతిసంపదా
స్పద మగు నీప్రబంధము విశాలగుణోన్నతి నెల్లనాఁడు న
భ్యుదయముఁ జేయు భక్తి వినుచుండినఁ బాఠముచేయుచుండినన్.

---

# ఏడవ అధ్యాయము.

## దగ్గుబల్లి దుగ్గనకవి—నాసికేతోపాఖ్యానము.

నారాయణకవి పంచతంత్రమును కృతినొందిన బసవభూపాలుని యాస్థానమునందలి దైన మఱియొక గ్రంథమును మనకు లభించినది. దగ్గుబల్లి దుగ్గనయను కవివరేణ్యుఁడు రచించిన 'నాసికేతోపాఖ్యాన' మను గ్రంథమును బసవ భూపాలుని మంత్రియగు చెందలూరి గంగయ మంత్రి యంకితమొందెను. ఆ గ్రంథ మాంధ్రదేశమంతటను రూపు

మాసి పేరునకైనను లేనిస్థితి నుండగా నొక ప్రతి మాత్ర మాంధ్రుల మహాదృష్టము చేత ప్రాచ్యలిఖిత గ్రంథాగారమున లభించినది. దానిని బట్టి కృష్ణాజిల్లాలోని ముత్యాల సంస్థానపువారీ గ్రంథమును ముద్రించిరి. కావున నాంధ్రలోకమునకు వారొనర్చిన యుపకారము పేర్కొనదగినది. ఈ యుత్కృష్టగ్రంథముయొక్క విలువ యనిర్వచనీయము, అప్రతిమానము. ప్రాచీనాంధ్ర గ్రంథములలో దీనికిసాటి మఱియొక దానిని బేర్కొనుట కవకాశము లేదు. ఆంగ్లేయభాషలో 'పారడైజు లాస్టు,(Paradise Lost), ఇటాలియను భాషలో "డివైనా కొమీడియా" (Divina Comedia) మున్నగు గ్రంథములు నిర్మాలమయినయెడల నాయాభాషల కెట్టియుపారనష్టము వాటిల్లునో యట్టి నష్టమే యీగ్రంథ ముత్సన్నమైన యెడల మనభాషకును గలిగియుండు నని యాంధ్రు లందఱును నమ్మవలసినదే. ఈగ్రంథ మద్వితీయము; మహత్తరము; సర్వదా యుత్కృష్టము. పశ్చిమఖండవాఙ్మయముల పరిచయము నొంది వానియందలి యుద్గ్రంథముల జదివిన మన యాంగ్లేయ విద్యాధికులగు యువతీయువకులు ఈగ్రంథమును జదివిన నాంధ్రభాషలోగూడ కేవలము శృంగార రసభూయిష్ఠములే కాక సర్వోత్కృష్ట గ్రంథము లున్నవనియును, స్త్రీపురుషులు వానిని నిరాక్షేపముగ జదువవచ్చుననియును దెలిసికొన గలుగుదురు. ఈయద్భుతగ్రంథమును అద్భుతతరమగు రీతిని రచియించిన కవిశిఖామణి యగు దగ్గుబల్లి దుగ్గన కవినిగుఱించి యించుక విచారింతము:

## కవి వంశము

పదునొకండవ శతాబ్దమున నన్నయ భట్టారకుని వలెను, పదుమూడవ శతాబ్దమున తిక్కనసోమయాజి వలెను, పదునేడవశతాబ్దమున నాంధ్రవాఙ్మయ సింహాసనమెక్కి కవిలోకమునకు బెక్కురీతుల మార్గ

దక్షుఁడై కవిసార్వభౌముఁడను బిరుదుగాంచిన శ్రీనాథమహాకవి "కూరిమి సేయు మఱఁది" యని తన్నుగురించి దుగ్గకవియే చెప్పుకొనెను.

"సీ. సంస్కృత ప్రాకృతశౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబుఁ
బన్నగపతి సార్వభౌమ భాషితమహా
భాష్యవిద్యాసమభ్యాస బలము
నక్షపాదకణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతి సాంఖ్యసిద్ధాంత
కబళనవ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్యవిరచితా పూర్వకావ్య
భావరసనుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండ నైష
ధప్రముఖ వివిధప్రబంధము లొనర్చి.

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
†శ్రీనాథసుకవి కూరిమిసేయు మఱఁదిని
దుగ్గయకవిరాజు దగ్గుఁబల్లి
.................. ........

† ఎ. శ్రీనాథుని జన్మస్థానము కృష్ణాజిల్లాలోనున్న సముద్రతీరమందలి కాళీపట్టణము గావచ్చునని బ్ర॥శ్రీ॥వే॥ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. అట్లయినచో శ్రీనాథుడు చెప్పిన "వారిధితటీ కాల్పట్టణము" ఈ కాళీపట్టణము గావచ్చును. కాళీపట్టణమను శబ్దమును కాల్పట్టణముగా స్త్రీవాచకములో 'ఈ' కారమును లోపము చేసి శ్రీనాథమహాకవి ఛందోనియమముకొఱకు ప్రయోగించునాయను విషయమును పండితలోకము నిర్ణయింపవలయును. అట్లు ప్రయోగింపబడనేరదని నాదృఢమైననమ్మకము. క్రీ. శే. కో. వెం. లక్ష్మణరావుగారు వ్రాసినట్లు కృష్ణాజిల్లాలో కాళీపట్టణము

దుగ్గకవి యింటిపేరు దగ్గుబల్లివారు. దగ్గుబల్లి అనుగ్రామము బహుశః గుడివాడ తాలూకాలోనున్న *దగ్గుమిల్లియై యుండునేమో యని యూహించుచున్నాను. ప్రభాకరశాస్త్రిగా రీగ్రామమే యై యుండునని తలంచిరి. ఇంకను విచారణీయము. దగ్గుమిల్లియే యైన యెడల శ్రీనాథుని తాతగారియూరగు 'కలపటము' దుగ్గకవి గ్రామ

నకు సామీప్యముననున్న 'కలపటము' అను గ్రామము గావచ్చునని నేనుగూడ నభిప్రాయపడుచున్నాను. ఈగ్రామము సముద్రమునకు గొంతదూరములో నున్నది గాన యిప్పుడు 'వారిధికిటీ' గ్రామమని చెప్పుటకు వీలులేదు. పూర్వము సముద్రశాఖకు దగ్గరగానుండెనేమో? కాళీపట్టణము ప్రాచీనపట్టణమని చెప్పుటకు పాటిదిబ్బలు వగయిరా చిహ్నములేవియు నచ్చోట గానరావు. కలపటములో పాటిదిబ్బ లున్నవి. ప్రాచీనగ్రామమనుటకు సూచనలుగలవు. శాసనాద్యాధారములుగూడ నున్నవియట. ఈవిషయములిట్లుండ పరిశోధకులు మఱియొకవిషయము గనుగొనవలయును. గుంటూరుజిల్లా, నెల్లూరుజిల్లాలయందలి సముద్రప్రాంతములందు 'కాలూరు', 'కాల్పురము' అను పేరుగల గ్రామమేదైన గలదేమో విచారింపవలయును. 'కాలూరు' కాల్పట్టణము సులభముగానగును. అట్లే తిక్కన పేరులును- కాళూరి యను నింటిపేరుగల బ్రాహ్మణులు యున్నారు. వారి అసలుగ్రామమేదో తెలిసికొన్నయెడల కాల్పట్టణపువివాదము తప్పకతీరగలదు.

(బి) శ్రీనాథుని యింటిపేరునుగూర్చి విచారణ జరుగుచున్నది. 'పాకనాటింటి వాఁడవు, బాంధవుఁడవు' అని బెండపూఁడి అన్నయ్యమంత్రి చెప్పినట్లు శ్రీనాథుడు వ్రాసికొనెను. పాకనాటింటివాడవు అనువాక్యము పాకనాటిదేశస్థుడని యర్థమిచ్చునని బ. శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. 'ఇంటివాడవు' అని చెప్పుటలో గృహనామము చెప్పబడెనని నేనూహించుచున్నాను. పాకనాటివారను బ్రాహ్మణుల మున్నదియు, లేనిదియు, యింకను పరిశోధనీయము. బహుశః ఉండవచ్చునని నా యభిప్రాయము. గంజాంజల్లా, పర్లాకిమిడి పట్టణములో పాకనాటివారను స్థితిమంతులు, కులీనులు నగు చతుర్థకులజు లున్నారు. అట్లే బ్రాహ్మణులుగూడ నచ్చోటనో యుండవచ్చును. ఇది విచారణీయము.

* గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో గోవాడగ్రామమునకు సమీపమున నున్న దగ్గుమల్లియొకటి యున్నది దగ్గుబల్లిగ్రామము యీదగ్గుమల్లియైనను గావచ్చును. ఈవిషయమంతయు సమ్యగ్విచారణీయము.

మగు 'దగ్గుమల్లి' ఈ రెండు ననతిదూరములోనుండి యిద్దరి కుటుంబముల యొక్క పరస్పర బాంధవ్యములకు జాల ననుకూలముగా నుండియున్నవి. పైగా వారితో సమకాలికులైన, అనంతామాత్యుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, మున్నగువారు సామీప్యములో నుండుటచే, కవిత్వ విషయములలో వీరందరకును మిథస్సంఘర్షణముగూడ గలిగియుండ వచ్చును.

దుగ్గకవితండ్రి తిప్పన; తల్లియెఱ్ఱమ; అన్నలు పోతన్నయు, ఎఱ్ఱనయు; గోత్రము శాండిల్యగోత్రము. బహుశః ఇతడు నియోగిబ్రాహ్మణుడు; శైవారాధన తత్పరుడు. సామాన్యముగ మతవిషయక గ్రంథముల జదువుట, వేదశాస్త్రవిధ్యనుష్ఠానమును, యిట్టియాధ్యాత్మికవిద్య యీతని కెక్కువ. గ్రంథముబట్టియు, కృతిపతివాక్యముల బట్టియు, చూచిన నిర్మలాంతఃకరణుడనియు, విశుద్ధజీవియనియు దోచుచున్నది. కృతిపతియగు చెందలూరి గంగన్నమాత్రి, కవి నుద్దేశించి పలికిన వాక్యములు.

"చ. శ్రుతులవిహారదేశములు సుస్థిరవాక్యపదప్రమాణశా
స్త్రతతులయిక్క లాగమ పు రాణచయమ్ముల కేళిసద్మముల్
స్మృతులనివాసముల్ కవి స మీహిత సత్కవితాగుణప్రసా
దితములు దగ్గుబల్లికవి తిప్పయ దుగ్గని గద్యపద్యముల్.

క. హితమతివి సకలవిద్యా చతురుండవు చాటుపద్యజాలంబుల నా
కతులితకీర్తులఁ గలిగించితి దుగ్గనకవివరేణ్యా! శివకారుణ్యా!"

గంగయమంత్రి యాస్థానములో నుండుటచే నీగ్రంథ మంకితము సేయకపూర్వమే యతనిమీఁదననేక చాటుపద్యములు చెప్పి దుగ్గకవి మెప్పువడసియుండెను. గంగయమంత్రి పినతండ్రికొడుకగు దేవయమంత్రికంకితముగా కాంచిపురనాథుడగు నేకామ్రనాథుని దివ్యకథను ప్రబంధరూపముగా విస్తరించి రచించెను. వీని నన్నిటిని దిలకించినచో ఈ

కవివరుడు గంగయమంత్రి వంశజుల కాశ్రితు డనియు, వారి వలన ధనధాన్యాది సత్కారములను బొందుచు గౌరవజీవనము చేయుచుండె ననియు నూహింపవచ్చును.

## కృతిపతివంశము

గంగయమంత్రి యింటిపేరు* చెందలూరివారు. వీరు ఆర్వేల నియోగులు. కాశ్యపసగోత్రులు. చాల కాలమునుంచి లౌకికవ్యవహారములో నారితేరినవారు. కవి వీరికి నాశ్రితుడగుటచే దన ముఖ్యగ్రంథములను రెంటిని ఈకుటుంబమువారికి సంకితము చేయుటయు, అనేక చాటుపద్యముల గంగయమంత్రిమీఁద జెప్పి యతనిని బహువిశ్రుతకీర్తివంతునిగ జేయుటయు దటస్థించెను. ఈగంగయమంత్రి మాధవవర్మ వంశజుడైన బసవరాజు నొద్ద నమాత్యపదవియం దుండెను.

"సీ. చతురంగబలముల జయవాడ దుర్గాంబ
వరమునఁ బడసి దుర్వారలీల
జగతీస్థలం బెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతిదంతముల సలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుత మోహంబు
పట్టక బెజవాడ పాడినిలిపి
కలయంగఁ బురమున గాంచనవర్షంబుఁ
గురియించి దేవతాకోటి పొగడ
వసుధనెగడిన మాధవశర్మవంశ
వర్ధనుండగు తమ్మభూవరునిబసవ
పార్థివున కార్యుఁడై కృపాపాత్రుఁడగుచు
ఘనత మెరెసె ననంతయగంగవిభుఁడు."

---

*'చెందలూరు' అను గ్రామము గుంటూరిజిల్లా ఒంగోలుతాలూకాలోనున్నది. ఇది వెలనాటిచోడులకు ముఖ్యపట్టణము.

గంగనమంత్రి వంశస్థులు శివభక్తులు. అతని యొక్క శైవారాధన తత్పరత యిట్లు వర్ణింపబడినది:

"మ. శివచింతామయ మంతరంగము, శివ శ్రీపాదపద్మార్చనా
ప్రవణంబుల్ కరపంకజంబులు, శివా పాదిప్రసిద్ధాగమ
శ్రవణోదీర్ణము కర్ణయుగ్మము, శివప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞ రసజ్ఞ యిమ్మహి ననంతామాత్యు గంగయ్యకున్"

ఈమహనీయుడు సంగీత మభ్యసించి సరససాహిత్య కళాసంగతమతియై యుండెను. కావుననే కవిత్వమం దభినివేశము గలుగుటయు, చాటుపద్యముల జెప్పించుకొనుటయు, గొప్పప్రబంధముల నంకితమొందుటయు, ఇట్టిసారస్వతాభిలాష చూపించి యాచంద్రార్కస్థాయియగు కీర్తిని గడించెను. ♦

## కవికృతులు—కాంచీపురమాహాత్మ్యము

దుగ్గకవి ప్రథమమున కాంచీపురమాహాత్మ్యమను ప్రబంధమును వ్రాసి చెందలూరిదేవయమంత్రికి కృతి యిచ్చినట్లు పైన నుడివితిని. ఆగ్రంథ మిప్పటికిని నుపలబ్ధము గాలేదు. కావున నందలికథావిషయము గాని, కవిత్వవిషయముగాని మనకు దెలియదు. కృతికర్తయు, కృతిభర్తయు సమానమగు శైవమతావలంబకు లగుటచే శివకంచియం దధిదేవతయగు ఏకామ్రనాథుని దివ్యకథను విస్తరించి రచించియుండు ననియూహింపదగినది.

* ఈ కాంచీమహాత్మ్యకథ స్కాందపురాణమందలి సనత్కు

---

♦ నందిసింగయ ఘంటమల్లయలను జంటకవులు తమప్రబోధచంద్రోదయమను ప్రబంధము నీయమాత్యశేఖరునకే కృతియిచ్చిరి.

* కాంచీమాహాత్మ్యమను నైదాశ్వాసముల ప్రబంధము నిటీవల కొప్పరాజు సుబ్బరాయకవి రచించి ముక్త్యాల పురాధీశ్వరుడగు వాసిరెడ్డి ముక్తీశ్వర ప్రసాద నాయనికి గృతి నిచ్చెను.

మారసంహితాంతర్గతమైన కాళికాఖండమున తీర్థస్థల ప్రశంసలో జెప్ప బడినది. కాంచీపురము, లేక, సత్యవ్రతక్షేత్రమందున్న క్షేత్రపాలకు లందఱికథలున్నూ, అనగా కచ్ఛపేశ్వరుడు, సిద్ధేశ్వరుడు, త్రిదశేశ్వ రుడు, వల్మీకమాహేశ్వరుడు, మున్నగు నుపదేవతలకథలున్నూ—ఆదివ్య క్షేత్రమునకు ప్రధానముగానున్న యేకామ్రనాథుని చరిత్రమున్నూ— ఇత్యాది మాహాత్మ్యము లెన్నియో అభివర్ణింపబడి యుండవచ్చును.

చతుర్వేదముల యేకమయమూర్తి కాంచననగర మందలి కంపా నదీతీరమున నొకమామిడిచెట్టు (ఏకామ్రము) రూపము నజనించెను. ఆచెట్టుమొదట నర్ధేందుమౌళి యంబికాసహితుడై స్థిరనివాస మేర్పఱ చుకొనెను. కావున నప్పరమేశ్వరునకు నేకామ్రనాథసంజ్ఞయు, అంబికకు కామాక్షీసంజ్ఞయు గలిగెను ♦

## 2. నాసికేతోపాఖ్యానము

దుగ్గకవి రచించిన రెండవగ్రంథము నాసికేతోపాఖ్యానము. ఈగ్రంథముయొక్క పేరునుగూర్చి తొలుదొల్త భిన్నాభిప్రాయము లున్నవి. కొంతమంది నాచికేతూపాఖ్యానమనియు, కొందఱు నాచి కేతోపాఖ్యానమనియు, మఱికొందఱు నాసికేతో పాఖ్యానమనియు, నిట్లు వివిధనామము లిచ్చియున్నారు. ఈనామనిర్ణయముల గూర్చి తారానాథతర్కవాచస్పతిగారు తమ వాచస్పత్యమం దిట్లు చెప్పియు న్నారు.

"నాచికేత—పుం. నచికేతశబ్దార్థే, (౧) అనలే (౨)ఋషిభేదే, (౩) తదుపాఖ్యానేచ; త్రికాండే నాచికేతురితిపాఠః లిపికరప్రమాద కృతః; నాచికేత ఇత్యేవపాఠః శ్రుత్యాదిసంవాదీ. నాచికేతోపాఖ్యా

♦ కాంచీపురమున విష్ణుకంచియను నొకభాగమున్నది. అందు హస్తిగిరిమీద వరదరాజస్వామి వారి యాలయమున్నది. ఇదివైష్ణవ క్షేత్రము.

నంచ—భారతే: అను 21 అధ్యా. ఆదా దృశ్యమ్"

వాచస్పత్యమ్.

వాచస్పత్యకారుడు నాచికేతశబ్దముగాని, నాచికేతుశబ్దము తప్పనియు లేఖకప్రమాదజనితమనియు జెప్పియున్నాడు. ఈపేరు కఠోపనిషత్తునందును, భారతమందును గాన్పించుచున్నది. కఠోపనిషత్తునందును, భారతమందును 'నాచికేతః' యనియే యున్నది. మనప్రస్తుతగ్రంథమందు నాసికేతయని యున్నది.

(నాసికేత + ఉపాఖ్యానము=నాసికేతో పాఖ్యానము.) ఇందు చకారమున్న స్థలములో సకారమున్నది. మిక్కిలి మల్లికార్జునకవి రచించిన నాచికేతూపాఖ్యానమను తెలుగుప్రబంధమున, "నాచికేతుః' అని పేరియ్యబడినది.

ప్రొఫెసర్ క్లేయస్ అను జర్మన్‌పండితుడు "నాసికేతరి చరితే' యని వ్రాసినాడు. అందుకూడ నాసికేత యనియేయున్నది. పునహాలో నున్న భండారకరు లిఖితపుస్తకభాండాగారమున రెండు సంస్కృతలిఖితగ్రంథములలో 'నాసికేతః, అను శబ్దమేయున్నది.

కాబట్టి వీనినన్నిటిని పరిశీలించిచూడగా మనప్రస్తుతగ్రథమందున్నటులే "నాసికేతః' శబ్దమే సమంజసమని నాకు దోచుచున్నది. ఏలయన కథానాయకుడగు నాసికేతుడు నాసిక (ముక్కు) ద్వారా తల్లి గర్భములో ప్రవేసించెను.; కావున నాసికద్వారా పుట్టినవాడు అనునర్థమిచ్చెడు "నాసికేతః' శబ్దమే సరియైనదని నిర్ణయింపవచ్చును [నాసిక + ఇతః'=ముక్కు(ద్వారా) + ప్రవేసించిన (వాడు.)

కథావిషయము

దుగ్గకవి గ్రంథమందలికథ యిట్లున్నది—బ్రహ్మ మానసపుత్రుడగు నుద్దాలకుడనుమహర్షి నిత్యబ్రహ్మచర్య వ్రతమునబూని నిష్కాముడై యుగ్రతపమును జేయుచుండెను. ఇట్లుండ పిప్పిలాదుడనుమహర్షి యతనియొద్దకు వచ్చి గార్హస్థ్యమును స్వీకరిం

పుమని యనేకవిధముల జెప్పెను. కాని యాతడు వినలేదు. తండ్రియగు చతురానను డు పుత్రునికడ కేతెంచి 'యోపుత్రకా! నీవు గృహస్థాశ్రమము స్వీకరింపు'మని యెన్నియో విధముల నుపదేశించెను. కాని యాతనిప్రయత్నము నిష్ఫలమయ్యె. అంత పరమేష్ఠి యాగ్రహచిత్తుడై 'నీకుబుట్టిన కొడుకు తనతల్లిని నీకు వివాహముసేయు' నని యాశ్చర్యకరమగు మాట చెప్పి తటాలున నంతర్హితు డయ్యెను. ఉద్దాలకుండును దండ్రిమాటల నమ్మకచేసెడు తలంపున ద్విగుణీకృతమైన పూనికతో ఘోరతరమైన తపమాచరించుచుండెను. ఇట్లుండ నొక్కనా డాజితేంద్రియుడు తన కృష్ణాజినముపై సుఖముగ నిద్రించుచుండ కలలో నొక యతిలోకసుందరి యగు కన్యక యుపగూహనము సేయ స్ఖలితరేతస్కు డయ్యెను. అంత మేల్కాంచి దిగులొంది యాధాతువును కుశేశయపుటమున నించి నళినీతంతువుల జుట్టి జాహ్నవిలో విడిచెను.

భగవత్ప్రేరితముగ నాసమయముననే రఘుమహారాజు తనయయగు చంద్రవతి చెలికత్తెలతో జలకమాడుటకు జాహ్నవికేగి మజ్జన మాచరించుచు వీచీడోలికల నూగుచు వచ్చుచున్న యాపద్మ ముకుళము నందికొని బాల్యచాపల్యముచే నాఘ్రాణించి నదియందు విడిచెను. తరువాత చెలికత్తెలతో నాపె యంతఃపురమునకు బోయెను. కతిపయదివసములు గడచినపిదప నామె యందు గర్భచిహ్నములు పొడసూపెను. ఆ కన్యకా లలామ యావైపరీత్యమునకు వెఱగొంది తోడిచేడియలతో జెప్ప వారు భీతచేతస్కులై రఘుమహీజానికి నివేదించిరి. అంత నాపృథ్వీశుడు క్రోధోద్రిక్తమనస్కుడై తనతనయ నరణ్యమున విడువుడని యాజ్ఞాపించెను. చంద్రవతి నట్టడవిపాలై దైవవశమున తృణబిందు డను తాపసోత్తము కంటబడ నమ్మహానుభావు డామె నూరార్చి తన పర్ణకుటీరమునకుం గొనిపోయెను. అచ్చట నాకన్యక కొంతకాలమునకు దివ్య తేజోమూర్తి యగు పుత్రుని గనియెను. ముని తనదివ్యదృష్టిచే నామెయుదంతము సాంతముగ గని పెట్టి తత్తనయునకు నాసికేతు డను పేరిడెను. ఆబాలుడు శుక్లపక్షచంద్రుని కైవడి దినదినప్రవర్ధమానుండగుచుండ నొకనాడు చంద్రవతి తండ్రిలేని తనయుడు స్తన్యమునకు గోపించి "ఓరీ, నిర్భాగ్యుడా నీవు పుట్టి నాకన్నవారికి నన్ను వేరు సేసితివి. నీవుగూడ నట్లే యగుదువుగాక" యని పుత్రుని నొకపేటికయందుబదిలముగ బెట్టి సూర్యచంద్రులకును' బంచభూతములకును, సమస్తదేవతాగణములకును గేల్మోడ్చి నేను నిక్కమగు పతివ్రత నగుదునేని యీయర్భకుడు తనతండ్రిపాలికి బోగలవాడని దీవించిమందాకినియందువిడిచెను. ఆపేటిక మలయమారుతసంచలితోర్మిహస్తములసహాయమున మందమందముగ బోవుచునుద్దాలకుడు స్నానము సేయుచుండ నతని మ్రోలనిలిచెను. ఆమునిపుంగవు డాపేటికనుజూచి యాశ్చర్యము నొంది పట్టికొని చూడ నందొక

బాలకుడు గాన్పించెను. ఆబాలునియందాత్మతేజఃస్ఫూర్తిఁవీక్షించి విస్మయమునొందితన యాశ్రమమునకు దీసికొనిపోయి తనతనయునివలె బెంచుచుండెను. కొంతకాలమునకు చంద్రవతి కొడుకైనను లేని యేకాకినీజీవితమునకు రోయుచు నాయరణ్యమున వానికై వెదకికొనుచు నొకానొక స్థలమున బుత్రుని గాంచి యాలింగనమొనర్చి "నాయనా యిక్కడ నెవ్వరియొద్దనున్నా"వని యడుగ నాపిన్నపాపడు తనయుదంతము సవిస్తరముగా జెప్పెను. అంత నామె యా ఋష్యాశ్రమమునకు జేరి తపోధనుని కొఱకునిరీక్షించియుండ నాతాపసవర్యు డప్పుడే వచ్చి నాసికేతునితల్లినిజూచి "అమ్మా! నీవెవ్వతెవు. ఈశిశువునుజాహ్నవియందు విడుచుటకు గారణమెయ్యది" యనిప్రశ్నింప నామె తనకథ నామూలాగ్రముగవిన్నవించెను. అంత నాముని శ్రేష్ఠు డచ్చెరువొంది పరమేష్ఠి చేష్టలకు మెచ్చికొని రఘుమహారాజుకడకు బోయి యావద్వృత్తాంతమును జెప్పి, చంద్రవతిని తనకు బెండ్లిసేయుమని కోరగా, నామహీవల్లభుడు కృతాంజలియై పావనియగు తనతనయను విధాతృసమక్షమున మహావైభవముతో వివాహ మొనర్చెను.

దంపతులిరువురును బుత్రసహితముగా నాశ్రమమునకు బోయిరి. అచ్చటసుఖముగ నివసించుచు నుద్దాలకుడు నిత్యము నగ్నిహోత్రాదికర్మములగాలముగడుపుచుండెను. నాసికేతుడు బాలకుడయ్యు జ్ఞానమార్గమున దృష్టినిల్పి నిత్యము జ్ఞానయోగసమాధియందు నిరూఢుడగుచు తండ్రికి సమిత్కుశేధ్మములదెచ్చుచు యజ్ఞచర్యలం చేయుచుండెను. ఒకనాడు యోగసమాధినిష్ఠుడైతండ్రికొఱకు సమిత్కుశములం దేమఱచియుండ నగ్నిహోత్రకాలాత్యయమునకు గోపించి తండ్రి కొడుకును బిల్చి "పుత్రకా సమిథల దెచ్చినావుకావు. హోమకాల మతీతమైనది." యనిపలికెను. నాసికేతుడు సవినయముగ దండ్రితో "నాయనా, యజ్ఞాదికర్మలకంటెజ్ఞానసిద్ధి యెంతయో మేలైన" దని ప్రత్యుత్తర మిచ్చెను. అంత నుభయులకు ఘోరమైన వివాదము సంఘటిల్లెను. తండ్రి గెలువలేక "శేషం కోపేన పూరయేత్" అను న్యాయము ప్రకారము నహంకరించి కుమారుని యమనగరము జూడబొమ్మని శపించెను. నాసికేతుడు తత్క్షణమే చాపకట్టుగ పడి ప్రాణముల విడిచెను. ఉద్దాలకు డుపశమించి తననిష్ఠురకర్మమునకు లజ్జించి శోకింపసాగెను. నాసికేతుడు యమాలయమునకు బోయి యచ్చటయమునానతిగైకొని నరకప్రదేశమంతయు గలయజూచి శమనుని దీవనలొంది, వీడ్కోలువడసి మగిడి తనతల్లిదండ్రులకడకు వచ్చెను. తరువాత తన ప్రయాణవృత్తాంతమును, కృతాంతునిపురదర్శనవిశేషములను విన గుతూహలులైన తండ్రికిని, యితరమునిబృందమునకును సావధానముగ జెప్పెను.

నాసికేతునికథ కఠోపనిషత్తునందును, భారతమునందును గాన్పించుచున్నది. అయినను దుగ్గకవి గ్రంథమందలికథకును భారతోపనిషత్తులయందలి కథలకును జాల వ్యత్యాసము గాన్పించుచున్నది.

### కఠోపనిషత్తునందలి కథ:

వాజశ్రవసుడను మునికి నాచికేతుడను కుమారుడుండెను. ఆపిల్లవాని తల్లిపేరుగాని. యతనిజనన ప్రకారముగాని జెప్పబడియుండలేదు. వాజశ్రవసుడు విశ్వజితమనెడు యజ్ఞమును జేయుటకు సమకట్టి తన సర్వస్వమును బ్రాహ్మణులకు ధారవోసి యిచ్చివేయుచుండగా కుమారుడు బాల్యచాపలమున దండ్రితో "నాయనా నన్నెవరికిచ్చెద" వని రెండుమూడుసార్లడిగెను. వాజశ్రవసుడు విసిగికొనుచు "నిన్ను యమునికిచ్చెద" నని కుమారుని నొవ్వబలికెను. మునిమాట యమోఘముగాన బాలుడు తత్‌క్షణమే మృతినొంది కట్టెవలె క్రింద వాలెను. తండ్రి మేఱలేనిశోకమునమునిగెను. నాచికేతుడు యమపురికేగి యము డింటలేకపోవుటచే నతిథి సత్కారములు జరుగక మూడురోజులు కుపోషపవాసముచేసెను. అనంతరము యముడు వచ్చి నాచికేతుని సగౌరవముగ సత్కరించి త్రిరాత్రోపవాసమునకు విచారించి మూడువరముల గోరుమనియానతిచ్చెను. నాచికేతుడు సంతోషించి యామూడువరముల నీక్రింది విధముగ గోరెను.

(1) తండ్రి తనయెడల నెన్నడును గోపము బూనకుండుటయు; (2) యముడు తన కనూన మగు నొకయజ్ఞవిధానము నేర్పుటయు; (3) మనుష్యుడు మరణించినతర్వాత గొందరు జీవుండుండుననియు, గొందఱు లేదనియు జెప్పుదురు కనుక సత్యమేదియో తెల్పుటయు అను మూడువరముల గోరెను. యముడు వరములనిచ్చి జ్ఞానోపదేశముచేసి యాతనిని భూలోకమునకుబంపెను.

### భారతమందలి కథ:

భారతమున నీకథ వేరొకవిధముగ గాన్పించుచున్నది. ఔద్దాలకుడను మహర్షికి నాచికేతుడను కుమారుడుండెను. ఒకనాడు తండ్రి సమిత్కుశముల దెచ్చి గంగయొడ్డున బెట్టి మఱచి యింటికివచ్చెను. అగ్నిహోత్ర సమయ మాసన్న మగుటచే గొడుకునుం బిలిచి శీఘ్రముగ నాకుశేధ్మముల దెమ్మని పంపెను. నాచికేతుడు వెళ్లి చూడగా సమిధలు, పుష్పములు మున్నగునవన్నియు ప్రవాహమున గొట్టుకొనిపోయియుండుటచే దిరిగి వచ్చి లేవని తండ్రితో జెప్పెను. క్షుత్పిపాసాకుపితుడగు ముని కోపతీవ్రమున గొడుకును, యముని జూడబొమ్మని శపించెను. బాలుడు తత్‌క్షణమే మలిశతుతమైన వృ

త్తునువలె భూమికొరిగి విగతజీవుడయ్యెను. ఆ కళేబరమును తన యొడిలో నిడుకొని మునిపుంగవుడేడ్చుచు నశ్రుధారలచే దడిపెను. కొంతసేపటికి నాకళేబరము దిగ్గనలేచి కూర్చొనతండ్రిపుత్రు నూరడించి యేమిజరిగెనని యడుగ నాచికేతుడు తాను యమపురికి బోతిననియు, యమునిసత్కారములబడసి పురమంతయు గలయజూచితిననియు' కాలుడు తనకు గోదానఫలము సంపూర్ణముగ దెలియజెప్పెననియు నిత్యాదివిషయముల నివేదించెను.

కావున నీరెండుగ్రంథములందలి కథలును దుగ్గకవికథకు సరిపోలేదు.

♦ మిక్కిలిమల్లికార్జునుడనుకవి రచించిన నాచికేతూపాఖ్యానమందలి కథ దుగ్గకవిగ్రంథమందలి కథకు బహుస్వల్పభేదములు దప్ప చాలవరకు సరిపోవుచున్నది. కాని దుగ్గకవిగ్రంథమును చూచి మల్లికార్జునుడు వ్రాసినట్లు కానిపించదు. వీరిద్దరేదోయొకమూలగ్రంథము నుండి యీకథను సంపాదించియుందురు. దుగ్గనగ్రంథమందు నాసికేతుడనియు మల్లికార్జునునిగ్రంథమందు నాచికేతుడనియు నున్నట్లిదివఱకేవ్రాసితిని. ఇంతియేకాక దుగ్గకవిగ్రంథమున చంద్రిమతియనియు మల్లికార్జునునిగ్రంథమందు చంద్రవతియనియు పేరు గాన్పించుచున్నది. నాసికేతునికి చెల్లెలు గలిగినట్లుగాని, అతడు యోగసమాధియం దుండి సమిత్కుశేధ్మముల దెచ్చుటకు తండ్రినియోగమును వినకుండుటగాని—మల్లికార్జునుడు వ్రాసియుండలేదు. ఇట్లు కొన్నిస్వల్పభేదము లుభయగ్రంథముల ] గాన్పించుచున్నవి.

ఈగ్రంథములు రెండు నేదో సంస్కృతమాతృకనాధారముచేసికొని రచింపబడినవి. ఆమాతృకయేది?

---

♦ మల్లికార్జునకవి గోదారిజిల్లా, రామచంద్రపురముతాలూకా పెద్దాడగ్రామస్థుడు. ఈయన తననాచికేతూపాఖ్యానమును పీఠికాపురసంస్థానములో గొంతకాలము దివానుపనిచేసిన వాడ్రేవు చలమయ్యపంతులుగారి జ్యేష్ఠకుమారుడగు వెంకటరావుగారికి నంకితముచేసెను. ఈ కవి 19-వ శతాబ్దాంతమువరకును జీవించినట్లు దెలియవచ్చుచున్నది. ఈయున వేగినాటివైదికబ్రాహ్మణుడు.

దీనినిగురించి కడుదీర్ఘ విచారణ చేసి యనేకస్థలములకు వ్రాసి విఫలమనోరథుడనై తుట్టతుదకు మ. రా. రా. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిసాహాయ్యమున పునహాలోనున్న భండారుకారుపుస్తక భాండాగారమునుండి రెండువ్రాతప్రతులను దెప్పించి వానిలోనున్న కథ మన దుగ్గకవియొక్కయు మల్లికార్జునునియొక్కయు గ్రంథములందలి కథలకు సరిపోవుట చూచితిని; కనుక నీయుభయకవులు తమగ్రంథములకథలను దీనినుండియే స్వీకరించిరని స్పష్టపడినది.♦

## మూల కథ

బ్రహ్మమానసపుత్రుడగు నుద్దాలకుడను ఋషి తపము సేయుచుండెను. ఆయన యొద్దకు పిప్పలాదుడను ఋషి యొకనాడు వెళ్లి యాతనిని వివాహము చేసికొనుమని యుపదేశించెను. ఉద్దాలకుడందుల కంగీకరింపక తండ్రియగు బ్రహ్మకడకు సలహాన డుగుటకు వెళ్లెను. చతురాననుడు సహితము వివాహము చేసికొమ్మనియే హితము చెప్పుచు "నీకుబుట్టినకొడుకు తనతల్లిని నీకు వివాహముసేయు" నని నుడివెను. ఉద్దాలకుడు సంతసించి పరిగ్రహోత్సుకుడై అనుకూల కన్యకాన్వేషియై తలపోయుచు కొండొక రేయి నిద్రలో దన్నొక కన్యక యాలింగనము చేసినట్లు కలగని పతితరేతస్కుడయ్యెను. ఆచరమధాతువును పద్మపుటమందుబెట్టి దర్భలజుట్టి జాహ్నవిలోవిడిచెను.

ఆసమయమునందు రఘుమహారాజుకుమార్తెయగు చంద్రావతి యనుకన్య (చంద్రప్రభయను నామాంతరము గూడగలదు) చెలికత్తెలతో వినోదించుచు మదనావస్థలనొందుచు జలక్రీడార్థము పరివారముతోను తూర్యవాద్యములతోను భాగీరథికి వెళ్లి స్నానము సేయుచుండ నదియందు గొట్టుకొనివచ్చుచున్న తామరపూవత్యద్భుతముగ తనయొద్ద నిలిచియుండ జూచి దాని నందుకొనుడని చెలికత్తెలతో జెప్పెను. వారట్లు దానిని తీసి యిచ్చిరి. ఆమె దర్భలను సడలించి పువ్వును వాసన చూసెను. కాలక్రమమున నామె గర్భము దాల్చెను. గర్భదోహచిహ్నములు తల్లియగు మనస్విని చూచి దిగులొందెను. ఈమనస్విని పూర్వజన్మమున దేవతా కన్యకయైయుండి

♦ ఈమాతృకకథ యేపురాణమునుండి యెత్తివ్రాయబడినదో నా కిప్పటికిని ద్యోతకము గాలేదు తజ్జ్ఞులు నాకు దెలియపఱచినచో కృతజ్ఞుడనై యావిషయము నిందు బొందుపరచెదను.

శాపకారణమున మర్త్యలోకమున నిట్లు జనించెను. మనస్వినీదేవి తనభర్తయగు రఘుమహారాజునకు కుమార్తెకుఁ గలిగిన గర్భధారణ విషయమును నివేదించెను. రాజు శోకించియు, గోపించియు నామెను కానలకు బంపించెను. ఆమెయార్తనాద మెంక ఋషి♦ విని యామెను జూచి తిలోత్తమయో లేక మన్మథుఁడులేని రతియో యని సంబోధించి యామె సర్వాంగసౌందర్యంబును వర్ణించి-అనగా కుచములు, నితంబము నాభి ఇత్యాదులను వర్ణించి-ఆమెయుదంతమును దెలిసికొని తన యాశ్రమమునకు గొంపోయెను. అచ్చట నామె కొకమగశిశువు ముక్కుద్వారా జన్మించెను. కావున నాశిశువునకు నాసికేతుఁ డను పేరిడిరి.

"నాసికాంతస్సముద్భూతః సర్వలక్షణసంయుతః,
నాసికేతు రితిఖ్యాతః మునిభిః కృతమంగళః."

ఆయాశ్రమమున నాసికేతుడు పెరుగుచుండెను. ఒకనాడు బాలుడు స్తన్యము కొఱకు నేడ్వ తల్లి కుపితయై "ఓరీపాపుడా, నీమూలమున నాతలిదండ్రుల కెడమైతిని; నీవును అట్లే యగుదువుగాక!" అని యాపాపని దర్భగడ్డిలో జుట్టి గంగలో విడిచెను. ఆగడ్డి చుట్ట ప్రవాహమున గొట్టుకొనుచు నదిలో స్నానము చేయుచున్న ఉద్దాలకుని సమీపించెను. అందున్న బాలుని రోదనము విని యుద్దాలకు డాచుట్టవిప్పి చూడగా బాలుడొకడు గాన్పించెను. తరువాత తన తపోమహిమచే నాబాలుడు తనకుమారుడే యని కనుగొని తనయాశ్రమమున బెంచుచుండెను.

అక్కడ చంద్రావతి కుమారుని గోల్పోయి చింతించి యతనికై వెదకుచు నరణ్యములలో దిరుగులాడుచు నొకమున్యాశ్రమమందు వానిజూచెను. అంత నాసికేతుడు తన్నెవరు పెంచుచున్నదియు తల్లితో జెప్పెను. అప్పు డామె ఉద్దాలకుని యాశ్రమము వాకిలి నలికి రంగవల్లులు పెట్టి నదీస్నానము చేయబోయెను. ఆపిమ్మట ఉద్దాలకుడు నదినుండి స్నానముచేసి వచ్చి శృంగారింపబడిన యాశ్రమమును జూచి సంతసించి యెవ రిట్లు కైసేసిరని యడుగ దనతల్లియే యట్లు నేసెనని పిల్లవాడు మాఱుపలికెను. వెంటనే ఉద్దాలకు డామెను బిలిచికొని రమ్మని పిల్లవానిని బంపెను. వాడు పోయి చెప్పగా నామె "నేను రాజకుమార్తెను; యౌవనవతిని; సుందరిని, ఎట్లు పరపురుషునియొద్దకు బోగల"నని ప్రత్యుత్తరమిచ్చి పంపివేసెను. ఉద్దాలకు డావచనమువిని ఆమె యెవరో, ఎట్లు పిల్లవానిని గనెనో

♦ ఈమునిపే రిచ్చటలేదు. ఈయన తపోమహిమచే నామెగర్భకారణమును గన్గొనలేదు.

తెలిసికొనిరమ్మని నాసికేతుని మఱలబంపెను. ఆమె తనచరిత్రము నాసికేతునితో జెప్ప నాతడు తండ్రికి సర్వము నివేదించెను. అంత నుద్దాలకుడు రఘుమహారాజునొద్దకు వెళ్లి చంద్రావతి యుదంతమును తనచరిత్రమును జెప్పి ఆపుత్రికను తనకు బెండ్లిచేయుమని కోరెను. రఘుమహారాజందుల కియ్యకొని కూతుని మనుమని రావించి మహర్షికి గూతు నిచ్చి వివాహము చేసెను.

నాసికేతుడును తల్లిదండ్రులును, తమ యాశ్రమమునకు మఱలివచ్చిరి. ఒకనాడుద్దాలకుడు కొడుకును సమీపముననున్న సరోవరమునకు బంపెను. (ఎందుకో అకో యిది గ్రంథమందులేదు.) ఆసరోవరమునొద్ద నాసికేతుడు శివు నారాధించుచు యోగసమాధి యందు లీనుడై యొకటిన్నరసంవత్సర ముండెను. తరువాత పుష్పములు. సమిధలు పట్టికొని యింటికిరాగా తండ్రి "యింతకాల మెచ్చటనుంటివి. నాయజ్ఞవిధులు నీయాలస్యకారణమున జెడిపోయిన" వని కోపించెను. అందుకు నాసికేతుడు "సంసారబంధకమైన కర్మకంటె యోగ మెంతో యెక్కు"డని చెప్పెను. అపైన ఇద్దరకును తీవ్రమైన వివాదము జరిగెను. నాసికేతుడు వెనుదీయలేదు. తండ్రికోపించి కొడుకును యమాలయమునకు బొమ్మని శపించెను. వెంటనే నాసికేతుడు క్రిందబడెను. తండ్రియేడ్వసాగెను. నాసికేతునిసత్త్వము తండ్రియేడుపునువిని యాతనినూరార్చి తన వాక్సత్యమును నిల్పుకొనుమనియు, సత్యమువలననే సమస్తలోకములు నిలిచి యున్నవనియు, తాను యముని దర్శించి శీఘ్రమే దిరిగివచ్చెద ననియు జెప్పి పోయెను.

నాసికేతుడు యమునిజూచి తావచ్చినకారణము జెప్పి కృతాంతుని యాజ్ఞవడసి పుణ్యపాపలోకముల బూర్తిగ విలోకించి యమునిచే జ్ఞానోపదేశము బొంది మరణమున కతీతుడగునట్లు వరము చేకొని తండ్రి కడకు వచ్చెను. ఉద్దాలకు డాశ్చర్యపడి "వత్సా యేమిచేసితి" వని ప్రశ్నింప యమపురీవర్ణనము తండ్రికిని అచ్చటి మునిబృందమునకును జెప్పెను.

ఈమూలకథను, దుగ్గన మల్లికార్జునుల గ్రంథములందలి కథలను సరిజూచి సామ్యాభేదములను నిర్ణయించినయెడల దుగ్గకవి కంటె మల్లికార్జునకవియే మూలకథ యథోక్తముగా వాడికొనెనని తోచుచున్నది. ఇంతియెకాక మల్లికార్జునకవి మూలములోనున్న అనౌచిత్యాశ్లీలాది లోపముల నట్లే యుంచి, యుక్తమగు భాగముల గూడ గొంత

వఱకు జెడగొట్టి కథాక్రమమును రసహీనముగ జేసెను. దుగ్గకవి యట్లుచేయక మూలకథలోనున్న అనౌచిత్యములను విడనాడి కథాంశ ములనెల్ల గొంతవఱకు స్వతంత్రకల్పనలతో మెరుగువెట్టి కథాప్రణా ళికను సర్వవిధముల నిర్మలరసస్ఫురితముగను, అనూనపుణ్యశీల ప్రతి ష్ఠాపకముగను, శాశ్వత జగద్వంద్యముగను రచించి యాంధ్ర సారస్వత మునందు చిరకీర్తి గడించెను.

## కథాసంవిధానము

ఈ యద్భుతమగు గ్రంథము నద్భుతతరముగ గవి రచించెనని ముందే చెప్పియుంటిమి. నాసికేతునికథ ప్రాయికముగా సామాన్యప్ర బంధములోని కథలమాదిరిగ నున్నదికాదు. సామాన్యముగ నాంధ్రప్ర బంధములలో దేవతాపురుషుడో, లేక రాజకుమారుడో నాయకుడుగా నుండుటయు, దేవతాకన్యయో, లేక రాజకన్యయో నాయికగానుండు టయు, వారియిద్దరియందు నుదయించిన పరస్పరానురాగము పరిణయ మగువఱకు శృంగారాదిరసములతో నిచ్చవచ్చినట్లు వర్ణించుచు నొక రిద్దరుబిడ్డలు పుట్టినపిమ్మట నాకుటుంబము నైహికాముష్మిక సౌఖ్యస్థితిలో నుంచి కవి విడిచిపెట్టును. నాసికేతునికథ యట్లుకాదు. ఇందు నాయకు డొకతాపసోత్తముడు; నాయిక యొకరాచకుమారిత. ఈతాపసోత్తము నకు వివాహమన నెంతమాత్రము నిష్టములేదు. నాయికయగు రాజ కన్యకకు కామవికారమన నెద్దియో తెలియదు. ఉభయులు వారివారి స్వకీయ నియమాచరణములలోనుండి యొండొరులు గని విని యెరుగ కయే పరిణయ ఫలమనదగు పుత్త్రభాగ్యము బొందగలిగిరి. ఇది కడు నద్భుతమగు విషయము. పుత్రుడు జనించినతరువాతనైన గొంతకాల మువఱకు భార్య యెవరో భర్తకుగాని, భర్తయెవరో భార్యకుగాని తెలియదు. కథానాయకుడైన తాపసోత్తముడు యథాక్రమముగా నిష్ఠా

గరిష్ఠుడై తపోనియమములలో బడియుండెను. నాయికయగు రాచ కన్నియ కన్యాత్వము తొలగిపోయినను కామవికారము బొందు టెరుగదు. ఇట్లుండ పిల్లవాడగు నాసికేతుడు పెరుగుచుండెను. పిల్లవానితల్లి తనభర్తకొఱకు వెదకుట కంటె తనపిల్లవానితండ్రికొఱకు వెదకుచుండెను. తపోనియమనిమగ్నుడగు బ్రాహ్మణుడును, నిర్వికారయువతీ లలామయగు రాచకన్నియయు శృంగార వ్యవస్థలు బొందుటెట్లు?

వారిజీవితమంతయు నాధ్యాత్మికమగు చిత్తశాంతియందేయుండి భగవంతునికి నివేదింపబడియుండ పూవిల్తుని చెయిదములకు తావు కలుగుటెట్లు? పరమేశ్వరుడు హిమవత్కూటమున మహావిలయ దీక్షా పరికల్పితుడై తపమాచరించుచుండ పరమేశ్వరియగు హిమగిరి రాజ కన్య నిర్వికల్ప సమాధినిరూఢ నిమీలితలోచనయై జగదీశ్వరునికొఱకు తదేకధ్యాన మొనరించుచుండ మానసముల ప్రముచ్చిలు మనోభవునకు స్థానమున్నదా? కన్నుపదొంగవలెవచ్చి కసిమిసియొనర్చిన పూవిలుకాడు నిక్కముగ తుంటవియకదా!

శాంతరస వాతావరణము, భగవత్ జ్ఞాన వినోదపరిస్ఫూర్తి, నిర్వికల్ప నిగూఢ యోగముద్ర, యిట్టివియే యీకథయందలి ముఖ్య లక్షణములు. ఈలక్షణములు చెడకుండ నాయికానాయకులకు వివాహము జరుగవలెను. సంసారక్రమము జరుగవలెను. పుత్రపుత్రికాది సంతానము గలుగవలెను. ప్రాపంచిక వ్యవహారక్రియము జరుగవలెను. కథయందలి యాధ్యాత్మిక మాధుర్యము చెడకుండ కథారసపోషణము జరుగవలెను. ఇట్టి యనన్యసామాన్య సంవిధానక్రమమును గవి యెట్లు నిర్వర్తింపగలిగెనో మనము విచారింపవలసి యున్నది.

కథాప్రారంభమున బ్రహ్మమానస పుత్రుడగు నుద్దాలక మహామునియు, నాతనియాశ్రమమును వర్ణింపబడినవి. సత్యబ్రహ్మచర్యవ్రతమునసున్న ఉద్దాలకునికడకు పిప్పలాదుడను మహాముని వచ్చి

యానంయమివరుని దారపరిగ్రహణ మొనరింపుమని యుపదేశించెను. పదంపడి తండ్రియగు కమలగర్భుడు పుత్త్రునికడకు నేతెంచి గార్హస్థ్యముసు స్వీకరింపుమని యానతిచ్చెను. ఉద్దాలకు డెవరుచెప్పినను వినక మొండిపట్టుపట్టి బ్రహ్మచర్యవ్రతమునే నిర్వహింప సమకట్టి వైదికాచారవిధి విధానములో నిత్యానురక్తుడై యుండెను. ఈభాగమెంతయు శుచియైనకల్పనలతో నతిమనోహరముగ వర్ణింపబడినది. ఎచ్చోటనైన నాధ్యాత్మిక జీవితప్రవాహమేకాని పంచేంద్రియ వ్యాపారమిసుమంతయు గానరాదు. ప్రపంచమంతయు శాంతమగు వైరాగ్యమార్గమున గోచరింపుచున్నది. చిత్తముల సంభవించెడు కామినీజన సంపర్కముగాని, క్రీడాజల విహారములుగాని కానరావు. ప్రకృతికన్య జటావల్కలముల బూని, సదా ధ్యానపరవశయై యోగినీవృత్తి నాశ్రయించియున్నది. షట్పదములఝుంకారములు, కోకిలారవములు, పుష్పాపచయములు, వనవిహారములు; ఇత్యాది శృంగారరసవిలాసములులేక వనలక్ష్మితాపసవ్రతము సలుపుచున్నది. ఇదిన్యాయమే. అరణ్యములలో కాలము గడుపుచుపవనపర్ణాంబుభక్షులై యున్నతపోధనులు వేరుమార్గములప్రవర్తించుటెట్లు? ఈవిషయమంతయు నేసామాన్యకవి యైన నీవిధముగ జిత్రించునుగాని మఱియొకవిధముగ జిత్రించుటకు వలనుపడదు. దుగ్గకవివర్యుని శిల్పచాతుర్య విశేషమిందెక్కువగా ద్యోతకము గానేరదు.

నాయకునివిషయము వివరించితిని. ఇంక నాయికా విషయము చూడవలెను. నాయికావిషయములో దుగ్గకవియొక్క కవితాప్రాగల్భ్యము, సంవిధాననైపుణ్యము, ఔచిత్యపరిజ్ఞత, ఇత్యాది మహాకవి లక్షణము లత్యుత్తమముగా గాన్పించుచున్నవి. ఈప్రసంగభాగము నంతయు దుగ్గకవి గ్రంథమందును, సామాన్యకవియైన మల్లికార్జునుని గ్రంథమందును తారతమ్యముగ బరిశీలించినచో దుగ్గకవియొక్క కవితాప్రతిభ యెంత యుత్కృష్టమైనదో మనకు స్పష్టముగ తెలియగలదు.

కథానాయికయగు చంద్రవతి భరతవర్షమునంతయు నఖండసామ్రాజ్య ధౌరంధర్యముగ, బరిపాలించిన రఘుమహారాజకుమార్తె. రాజాంతఃపురములోనుండి, దాసీజనపరివృతయై, ఇచ్ఛామాత్రమున సమస్తభోగభాగ్య పరితృప్తయై నిరంతర కేళీవినోదాసక్తయై యుండదగిన రాజకన్యక నిమ్మహాకవి యెంత విపరీతచరితగా జిత్రించెనో జూడుడు:

సీ. అనుదినం బును నతిభక్తిఁ దల్లిదం
 డ్రులకు నన్నలకు శుశ్రూషసేయు
సతివృద్ధులైన బ్రాహ్మణపురంధ్రులతోడ
 ధర్మకథాగోష్ఠిఁ దగిలియుండు
సంతతంబును భాగ్యసౌభాగ్యదములనఁ
 బొలిచిన వ్రతములు సలుపుచుండు
పెద్దలు తనకుఁజెప్పిన బుద్ధితప్పక
 విమలసదాచార విధులొనర్చు
దాలిమియు, జిత్తశుద్ధియు, ధర్మమతియు,
దయయు, దాక్షిణ్యమును, సావధానతయును,
వినయమును, బంధుహితమును, వెరవుఁదగవుఁ
గలిగి చంద్రవతీ కన్యకాలలామ.

క. అన్నయును దల్లిదండ్రులు
మన్ననఁ దను గారవింప మహనీయములై
యెన్నిక కెక్కినగుణముల
నన్నియు గలిగించె చంద్రవతి కులమునకున్.

క. ఆచంద్రవతి వివేకము
నాచారము గౌరవంబు నడకువయునునా
లోచింప నెందుఁ గానము
భూచక్రములోన రాజపుత్రికల యెడన్.

ఈమెసౌందర్యము నాపాదమస్తకము వర్ణించుటలేదు. ఈమె యుద్యానవన విహారములను, జలక్రీడలను, చెలికత్తెలతోడి సరససల్లాపములను, వీనినైన మనసార వర్ణించుటలేదు అష్టైశ్వర్యములతో తులతూగుచున్న యీ రాజకన్యను సామాన్యసంసారుల బిడ్డవలె తల్లిదండ్రులకు సదా సేవచేయుచుండుననియు, వృద్ధబ్రాహ్మణ పురంధ్రులతో ధర్మకథాగోష్ఠి సల్పుచుండుననియు, అనవరతము వ్రతములు సేయుచుండుననియు, తాలిమియు, చిత్తశుద్ధియు, ధర్మమతియు, దయయు, దాక్షిణ్యమును, వినయమును ఇత్యాద్యాధ్యాత్మిక సుగుణసంపత్తి గలిగియున్నదనియు నభివర్ణించినాడు. ఇది దుగ్గకవిమార్గము.

ఇంక మల్లికార్జుని పంథ గాంచుడు:—

"గీ. ఆమహామహు పుత్రియై యవనిఁ బరగి
సజలజలధరనిభ వేణి జలజపాణి
కుందసుందరరదన రాకేందువదన
చంద్రమతి యనుపేరిటి జలజగంధి."

అని మొదలుపెట్టి వెంటనే యీమె సౌందర్యమును నఖశిఖపర్యంతము వర్ణించెను. పదములు కూర్మముల వలెను, జానుయుగ్మము శాలిగర్భములవలెను ఉన్నవి. పిఱుదులు, పొక్కిలి, నూగారు-వీనికి సరిచెప్పుటకు వస్తువులే కనబడలేదు. కుచములు పుష్పగుచ్ఛములు; వర్ణనాతీతములు. ఇట్లాపాదమస్తకము సుమారు ఇరువదియేనుపద్యములకు మించునట్లుగా వ్రాసి కవి తన యావచ్ఛక్తిని వినియోగించియు, సకలకావ్యబంధురవర్ణనాచమత్కృతిని సేకరించియు, సమస్తసాహిత్యసంవిధానవిస్తృతి ననుకరించియు నారీతిలకమగు చంద్రమతికి రంభ, ఊర్వశి, తిలోత్తమ ఇత్యాదిలోకోత్తర మత్తకాశినుల నపహసించి యధఃకరించెడు అప్రతిమానసౌందర్యము కలదని వర్ణించినాడు. ఇంత శ్రమపడెను. గాని

పాపము, కవియొక చిన్నసంగతి మనస్సులో నూహించుకొన్న నె తబా గుండెడిదో! ఇట్లగణితరూపలావణ్యరాశియై కొమరొందియున్న కన్య నుపరిగ్రహించెడు పురుషుడెవ్వడో? కంతుడా, జయంతుడా వసంతుడా? ఈయొప్పులకుప్పను, ఈసొంపులగనిని పరిగ్రహించెడు మానిసి యెట్టి స్వభావము గలవాడు? శరీరసౌష్ఠవమును, ప్రత్యవయవనిరతిశయసౌకు మార్యమును పరీక్షించి యానందించెడు శృంగారరసశేఖరుడా, మదనో ద్విగ్నమానసుడా, యను స్వల్పవిషయమునుయోచించిన నెంతబాగుం డెడిది? కవికి శ్రమయూ తగ్గిపోవును; నాయికానాయకుల కననుకూల దాంపత్యసంయోగమూ సంఘటింపదు; కథాసంవిధానమునకు రసభావ ముల ఔచిత్యమూ సమకూడును.

నిత్యవైదికకర్మానుష్ఠానపరుడు, అనవరతబ్రహ్మచర్యవ్రతదీక్షా కలితుడు, మహాసంయమి యగునుద్దాలకునకు గృహిణియై యుండదగిన స్త్రీ యెట్లుండవలసినది? భువనమోహనసుందరియా, లేక, సద్గుణసమ న్వితయగుపతివ్రతయా? క్షణికమోహవివశుడై విశ్వామిత్రుడు మేనకను బరిగ్రహించెను. కాని తత్సంగమసంజాతపుత్రికనుజూచి నిరాదరుడై దారపుత్రికలయెడల పెడమొగముపెట్టి చనెను. చంద్రవత్యుద్దాలకుల సంబంధ మిట్టిదియా? కాదు. అరుంధతిని వసిష్ఠుడు చేపట్టినట్లును, రేణు కను జమదగ్ని వరించినట్లును, చంద్రవతిని ఉద్దాలకుడు పరిగ్రహింపవల సియున్నది. అట్టివిషయములో చంద్రవతినిగురించి వర్ణన మెట్లుండ వలెనో కవియూహింపదగినది. ఇటువంటివిచారణమందు దుగ్గకవితల్లజుని భావనాశక్తి యెంతయుచితజ్ఞతగలిగి సారవంతమైనదో మనకు తెలియు చున్నది.

తరువాతియంశములకు బోవుదము. విధిప్రేరితమైన చంద్రవతి భాగీరథితో యమునలందు మజ్జనమాడుచు ఉద్దాలకునిరేతఃపూరితమైన యరవిందపుటము నాఘ్రాణించి సద్యోగర్భవతియై,రోషావమానరూపి

తనేత్రుడైన తండ్రిచే కానలకునంపబడి, తృణబిందుమహర్షిచేసత్కారముల బొందినవాడై, నాసికేతుని గని, యట ఘోరవిపినముల నివసించియుండెను. ఈభాగమును సామాన్యకవులందరు స్వాభావికరసస్ఫూర్తిగనే వ్రాయగలరు. దీనియందైన దుగ్గకవిరచన తనయసదృశశోభ నిక్కముగ బొడసూపగల్గినది.

ధీరోదాత్తుడగు రఘుమహారాజువర్తనము, తాపసోత్తముడగు తృణబిందునికుశలప్రశంస, ఇత్యాదివిషయములలో మల్లికార్జునునికంటె దుగ్గకవి యెంతమిన్నయగు కవియై యుండెనో యాయాభాగముల జదివిన తెలియగలదు. ఈభాగమునింతటితో వదలి మఱియొకముఖ్యఘట్టమును బరిశీలింతము.

కాలక్రమమున జందవతిఉద్దాలకులాశ్రమవాటిక చెంత కలిసికొనిరి. పుత్రుడగు నాసికేతుడు వారికుపరకు సహావేశము గలుజేయుటయు, నొండొరుల నెరింగించుటయు, నిత్యాదిదాత్యకార్య మొనరించెను. అప్పు డుద్దాలకుడు చంద్రవతీపరిణయోత్సుకుడై తమకపడుచుండ వీరిమువ్వురకును జరిగనసంభాషణాదివిషయము బహుసుకుమారశృంగారవిషయావస్థను గనపఱచును. ఈభాగమునుమనము జాగ్రత్తగా బరిశీలించినచో దుగ్గకవివతంసుని అశేష శేముషీవిలాస మగ్గలముగ ద్యోతక మగును.

మల్లికార్జునుని గ్రంథమందునుద్దాలకుడు చందవతిని జూచిన వెంటనే కొడుకును బిలిచి యిట్లనియె:

"క. నీతల్లి యెచటనుండెను
రా తనయ యెరుంగఁ దెల్పరా నాకడ కీ
వాతతగతిఁ జని తోడ్కొని
యాతలిరుంబోడి వేగ నరిగి కుమారా!

గీ. నీలవేణి విడిచి నిమ్మనస్మైననుఁ దాళఁ
జాల భూరిసుగుణశీల యనిన
నాచికేతుఁ డప్పుడు నయమలరఁగఁ దల్లి
పాలి కరిగి యిటులు పలుకఁజొచ్చె."

చంద్రమతి యెవరో తనకు దెలియకుండగ, నుద్దాలకుడెవరో ఆమెకు తెలియకపూర్వమే, ఆమానినిని బరిగ్రహించుటకు వెళ్ళిత్తిన విటునివలె నుద్దాలకుడు గంతు లిడజొచ్చెను.

ఆపైని నాచికేతుడు తల్లికడకేగి ఉద్దాలకునిమనఃస్థితిని గుఱించి యిట్లు నుడివెను:

"క. జననీ, వడి రమ్మా మ
జ్జనకునిపాలికి నతండు తృణమైన నినుం
గనుఁగొనక నిలువఁజాలక
పనిచెన్ నన్నునఁగ నానృపాత్మజ యనియెన్.

గీ. తల్లిదండ్రులు లన్నదమ్ములు బంధులు
గన్య నొసఁగు టవఁ గలదు గాక
కొమరుఁ డంబ నియ్యఁగూడునే యొరునికై
కలదె యియ్యయుక్త కార్యములను!"

ఇట్లాసాధ్వి మృదుమధురముగా మందలింప నాచికేతుడు తండ్రికడకు పోయి తానుదెచ్చికొన్న చీవాట్లను పది రెట్లుగ నాతనికొప్పగించెను!

"ఉ. అయ్యెడ నాచికేతుడు మహాగ్రహ మొప్పగఁ దండ్రిపాలికిన్
జయ్యన నేగి యిట్లనియె సం యమి యీ కిటులాడఁ జెల్లునే
నెయ్యములేక పావనముని ప్రవరాశ్రమవాటియందు నేఁ
డయ్యయొ యిట్టిదుర్వచన మాడఁగ నో రెటులాడెఁ దెల్పుమా?"

అని యింక మరెన్నియో దూషణవాక్యములను ధర్మోపదేశములను

ఆచిరుతకూన తండ్రియగు మునిపుంగవునకు దెల్పెనట. ఈదౌత్యమును, ఈసంధానక్రమమును ఎంతఅపహాస్యముగను. అశ్లీలముగను నున్నదో చూడుడు!

ఇట్టి విషమపరిస్థితిలో దుగ్గకవి బోయినమార్గమరయుడు: ఉద్దాలకుని యాశ్రమవాటికయొద్ద చంద్రవతి యుండగా నుద్దాలకుడు సమిత్కుశలను బట్టికొని వచ్చుచుండెను. అప్పుడు తనయొద్దనున్న తనయుడు తనతండ్రివచ్చుచున్నాడని యాయామకు జెప్పెను. ఆమునిపుంగవుని దీర్ఘప్రసారితదృష్టిని పరికించుచుండ నామె కెన్నడును గలుగని మదనవికారము గలిగెనట.

"క. మదనుని యరవిరియమ్ముల
కద లెన్నడు నెఱుఁగ కింతకాలము మిగులన్
బదిలంబగు చంద్రవతీ
హృదయంబున మదనవికృతు లీరక లెత్తెన్."

అప్పుడు తృణబిందుడు చెప్పిన గర్భధారణముచొప్పు మనసునకు స్ఫురించెను. తరువాత తన తనయుడగు నాసికేతునియందా మునియొక్క శరీరలక్షణములు సర్వము గాన్పింప నామునివరుడే తనను పుత్రవతిం జేసెనని నిశ్చయించుకొనెను. ఇట్లుండ నామునిపుంగవు డామెను జూచి మున్నెరుగని మన్మథవికారము లోబొడసూపుట గ్రహించి యీవరారోహ యానాడు తన్ను కలలో నుపగూహన మొనర్చినదని వితర్కించుచు సమీపింపగా నావ్రీడావతి మునిప్రవరునకు మ్రొక్కి దీవనలందెను. అటుపైన నుద్దాలకు డామె తెలిదండ్రుల వృత్తాంతము, అచ్చటకు వచ్చినకారణము నడిగెను. అందుకు సవినయముగ నాతన్వి తన వృత్తాంతమును సర్వశేషముగ దెల్పి తృణబిందుడు చెప్పిన గర్భధారణము చొప్పును, తా నర్భకుని పేటికలో బెట్టి మందాకినిలో విడచిన క్రమమును సవిస్తరముగా జెప్పెను. అంత తాపసోత్తముడు తన జీవిత

కథకు నాయుడంతము సరిదాకుట చూచి తనకథ నంతయు నాయకుకు నివేదించెను. ఇట్లు కడు దీర్ఘ ప్రసంగములు గావించి యనేక గూఢవిశేషములను గుర్తించి వా రొకరినొకరు విశ్వసింపగలిగిరి. మునివర్యుడామెను పత్నిగా గ్రహించెను. ఆమె యాతపోధనుని పతిగా నిశ్చయించుకొనెను. తరువాత వివాహము చేసికొనుటకు తత్తరపడుచున్న సంయమిని జూచి యామానవతి మృదుమధురోక్తుల నిట్లూరడించెను.

"క. నీచేవడ్డది సామ్మిది
వాచంయమ వేగపడగవలవదు కృపతో
నాచనువు లీయకొని కా
లోచితధర్మకృతనిశ్చయుఁడ వగు మనఘా!"

ఈ ప్రసంగ మంతటిలో నాసికేతునిమాట యెక్కడైనను లేదు. ఆ యర్భకుడు తల్లిదండ్రుల సంభాషణము వినుటయే కాని పాల్గొనుట కెట్టిసందర్భ ముండును? స్త్రీ పురుషుల మనోవికార ప్రసంగములు బిడ్డల కేమి యెరుక? ఈ విధముగా నిమ్మహాకవివర్యు డతిసుకుమార రసభావ కల్పనాచమత్కృతియుతంబైన యీ యపూర్వ కథా కావ్యంబును అత్యుత్తమక్రమంబున రచించి యౌచిత్యమును, పారిశుద్ధ్యమును రసపోషణమును నిర్వహించి శాశ్వతమగు నుద్గ్రంథము నాంధ్రదేశమున కిచ్చెను

పాత్రపోషణము.

కథాసంవిధానపు నేర్పు చూపించుటలో గొంతవఱకు ముఖ్యపాత్రలగు నాయికానాయకుల గుణవర్ణనములు వర్ణింపబడినవి. ఉద్దాలకుడును చంద్రవతియు సహజమగు ఔదార్యగాంభీర్య సౌశీల్యాది శుభ ప్రవర్తనము లెన్నడును వీడక పరమపవిత్ర జన్మమునకు దగిన జీవితాంతశ్శుద్ధియే నిత్యజీవికగా నిడికొని బాహ్యేంద్రియసౌఖ్యములకు లోను గాక అంతరాయ పరంపరల నతిక్రమించి చిరస్థాయియగు పుణ్యదంప

తుల యతులిత జీవితము గాంచిరి. ఇట్టి యనూనకావ్య ఫలపరిపాకము నొనగూర్చిన మహాకవి దుగ్గకవియే. అరుంధతీవసిష్ఠులు, అనసూయా త్రులు వలె నీ నిత్యనిర్మలచరిత్రులగు దంపతులు బాల్యయోగసిద్ధుడగు నాసికేతునకు దగిన దల్లిదండ్రులు. వారి దివ్యతేజస్సు ఈ పిన్నపాపని యం దావిర్భవించి పుట్టుకనుండియే నిర్వికారయోగసమారూఢత నతని యందు నెలకొల్పినది. ఈ తాపసమిథునము సమాన పావనాంతఃకరణు లుగా నుండినను, ఒకరికంటె నొకరెక్కువ తక్కువ యని నిర్ణయించుట కెడము లేకుండినను చంద్రవతి చరిత్రము ఉద్దాలకునికంటె నొకవాసి యెక్కువ మెరుగు చూపుచున్నట్లు నాదృష్టికి ననుమానము గలుగుచు న్నది. చక్రవర్తి కుమార్తెయై మహావైభవమున బెరిగిన ఆగాజకన్య యరణ్యవాసు లగు తాపసకన్యలవలె ఆజన్మవిరాగిణియై పెరుగుట యత్యద్భుతము. అన్యాయముగ గఠినదండన విధించినతండ్రి యెడల నొక్కపరుషవాక్య మైనను బలికియుండలేదు. ఘోరవిపత్తుల నన్నిటిని నిశ్చలనిర్మలాంతఃకరణముతో సహించి సర్వంసహయగు భూదేవివలె ధైర్యస్థైర్యములను బూని నిష్కళంకముగ విజయము గాంచినంతవఱకు నిర్భీతచిత్తయై నిలువబడెను. అపనిందలన్నియు క్రమ క్రమముగా నప సరిల్లి శుద్ధతేజోవంతమగు నామె పవిత్రచరిత్రము పతివ్రతోచితముగ భర్తృజీవితమున నంతర్లీనమయ్యెను.

ఉద్దాలకుడు కర్మఠుడు; వైదికవిధికృత్యములయం దున్నయుత్సా హమును నమ్మకమును జ్ఞానసంసిద్ధియందు లేవు. ఆయన మనస్సు వికారచేష్టితముల కతీతము కాలేదు. బహుశః ఈ కారణముచేతనే పిన్న లాడుదును, బ్రహ్మయు వివాహము చేసికొనుమని కోరిరి. క్రోధాది మనోవికారములను నిర్మూలముగ త్యజింపలేదు. కావున జ్ఞానయోగి యైన నాసికేతుడు కర్మానుష్ఠానమును గుఱించి యించుక సందియింప నుద్దాలకుడు నిష్కారణముగ క్రోధావిష్టుడై కొడుకును జంపుమని

శపించెను. కాని నాసికేతు డెంతమాత్రమును వైరాగ్యధర్మమును వీడ లేదు. తండ్రియెడ భక్తిప్రేమరసముల నించుకైనను వర్జింపలేదు.

## నాసికేతుడు

కథాపురుషుడగు నాసికేతుడు పుట్టుకనుండియు మానవప్రకృతికి నతీతుడు; ఆజన్మవిరాగి; అతిలోకజ్ఞానసంపన్నుడు; నిత్యనిర్మల నిశ్చలచిత్తుడు; అనవరత పితృసేవాదీక్షితుడు; అద్వైతసిద్ధమానసుడు; చిన్నవాడయ్యు సుజ్ఞానతేజస్సతనియందు మూర్తీభవించి యుండుటచే ధర్మకర్మవిచారణలో నప్రమత్తుడు. తండ్రియగు నుద్దాలకుడు తాపసుడైనను మానవప్రకృతికి నతీతుడుగానోపక పిన్నవాడైన తనయుని యందలి దివ్యప్రభావమును గుర్తెరుంగలేక యతని యమాలయవీక్షణాద్యద్భుత కృత్యములను విని వెఱగందెను. నాసికేతుడు మానవవిషయములలో బాలుడుగను, దివ్యవిషయములలో నతిప్రౌఢుడుగను చిత్రింపబడెను. ఇట్టిగుణవర్ణనము ఉపనిషత్ పురాణానుసారమే కాని భిన్నము కాదు.

## రఘుమహారాజు

ఇంక ముఖ్యపాత్రలలో శేషించిన రఘుమహారాజును గుఱించి యోచించెదము. ఈ మహామహుని పాత్రపోషణము బహుసుందరముగ, స్వభావసిద్ధముగ నౌచిత్యనిబద్ధముగ నిరూపింపబడినది. రఘుమహారాజు

సీ. "...... ........................
.........అకలంకచారిత్రుఁ
డార్య సన్నుతుఁడు సత్యవ్రతుండు
సహజవిక్రమశాలి శరణాగతత్రాణ

నానూనకరుణార్ద్రి మానసుండు
హారిహితాదిష్ట కాలోక పరివృత
త్మాతలుం డసమాన మానధనుఁడు
..........................."

ఈ మహానుభావుడు మనస్వినియను సార్థకనామయగు కరుణార్ద్రి హృదయను వివాహమాడెను.

కాలక్రమమున తమయేకపుత్రికయగు చంద్రవతి కన్యకగానుండియే గర్భముదాల్చిన సంగతి భూవిభుడు విని కొంత దుఃఖించి "త్యజేదేకం కులస్యార్థం" అను న్యాయమున కూతును కానలకుపోనాజ్ఞాపించెను. అకలంకచారిత్రుడై, సర్వదా నీతివర్తనుడై, ధర్మానుష్ఠానపరాయణుడుగాన ఈమానవనాథుడు మానవుల పరిమితదృష్టికి గోచరించినంతవఱకు నిష్పక్షపాతముగ నిర్భయముగ నాచరింప గలిగిన ధీరోదాత్తుడు. రాజధర్మ నిర్వహణములో తన పితృహృదయ పరివేదనము పరిగణింపలేదు. కేవల మున్నతకుల ప్రతిష్ఠయే దృష్టియుం దిడికొనెను.

కూతుని వనమున కంపినప్పుడైన వ్యర్థప్రలాపములను దీర్ఘపరిదేవనములను జేయక చిత్తసంక్షోభమును నిగ్రహించి ధీరశాంతత వహించెను.

తరువాత కూతు సుశీలత నిశ్చయింపబడి వంశగౌరవము నిల్చినప్పుడైనను ధీరశాంతతయు, మితభాషణమును, భావవికార నిరోధమును జూప గలిగెను:

"ఉ. శుద్ధుఁడనైతి భూప్రజకుఁ జుట్టలకుం సరియిండ్లవారికిన్
సిద్ధఫలంబులయ్యె మును జేసిన పుణ్యము లుర్విలోన సం
బద్ధములైన యాడికలఁ బాసితి నిట్లు త్రికాలబోధసం
సిద్ధులు మీరు చంద్రవతి | శీలము మేలని యాదరించుటన్."

ఈకొలది మాటలతో డెందమునందు సందడిగొన్న యానంద తరంగముల నిస్తబ్ధముచేసి వెంటనే యవసర కార్యాచరణమునకు బుద్ధి మరల్చెను. భూపరిపాలనదక్షులగు నృపోత్తముల గాంభీర్య మిట్టిదియే కదా!

బృందారక పితామహునితో వియ్యమందెడు భాగ్యము లభించినదని యపరిమితానందము బొంది, భూనంభోంత రాళములు పెల్లుమని ప్రతిధ్వానము లీను నట్లు మహావైభవముతో పుత్రీవివాహము గావించి సహజౌదార్యవిశాలగుణాదిమహాగుణముల వెలయ జేసెను.

## కవితా లక్షణములు

### శిల్పము, శైలి

దుగ్గకవీశ్వరు డాశ్వాసాంతగద్యములయందు బాన మఱదియగు శ్రీనాథకవిసార్వభౌముని బేర్కొని తన భక్తికృతజ్ఞతలను వెల్లడించెను:

"ఇది శ్రీమత్కమలనాభ పౌత్ర మారయామాత్య పుత్ర సకల విద్యాసనాథ శ్రీనాథ మహాకవీంద్ర ప్రసాద లబ్ధకవితావిశేష దగ్గుబల్లితిప్ప నార్యప్రియతనూజ దుగ్గ ననామధేయ ప్రణీతంబైన......"

ఇందు శ్రీనాథుడు తనకవితా గురువని, విస్పష్టముగా వ్రాసినాడు. శ్రీనాథునికి తనయెడల గూరిమియు, ఇతనికి శ్రీనాథునియందు గౌరవము నున్నట్లు దృష్టాంతములు గ్రంథస్థములే. దుగ్గకవికి కవిచక్రవర్తి యగు శ్రీనాథుని యందున్న సారస్వత గౌరవము బంధుప్రేమ నినుమడించెను. తనకు బంధువు మాత్రమే కాక శిష్యుడై అనవద్యకవితా మహిమచే జెన్నొందిన యితనియందు శ్రీనాథునికి గూరిమి హెచ్చయ్యెను. ఇట్లన్యోన్యగౌరవ ప్రేమాతిశయముల నుభయులు వర్తిలుచుండిరి. కవితా విద్యయందు గురుశిష్యసంబధ ముండినను వీరిద్దరికావ్య రచనలయం దెంతయో భేదమున్నది. ఇద్దరికవితల

యందు శయ్యాపాకరీతులు చాల వఱకు భేదించుచున్నవి. ఏలకో, గురువుగారి పద్ధతులు శిష్యుడనుగమించుట లేదు! బహుశః దుగ్గన్న తన గ్రంథములను శ్రీనాథునికి గనుపఱచియే యుండును. వాని యందు తన కవితా మార్గములు గాన్పింపక పోయినను శ్రీనాథునకు దుగ్గనయందు గౌరవము తగ్గలేదు. ఉభయుల వ్యక్తిమహిమల కిదియే గొప్పనిదర్శనము.

శ్రీనాథు డపారశృంగారప్రియుడు. భగవద్భక్తి వర్ణనాఘట్టము లందుగూడ నతిమాత్రముగ శృంగారము చొప్పించుట యతని కభ్యాసము. దుగ్గకవి శృంగారవర్ణనములో సంకుచితబుద్ధి; ఆధ్యాత్మిక తత్త్వ నిరూపణము నం దసాధారణ గౌరవము గలవాడు. శయ్యావిషయములో దీర్ఘసమాసములుగాని, క్లిష్టశబ్దబంధుర వాక్సరణిగాని మహాపండితు డగు శ్రీనాథునకు వాడుక. కొలది మాటలతో జెప్పదగినవిషయము నాడంబరముగా పదజాలమున బెంచి విస్తరించి చెప్పుట యతని ప్రకృతి. దుగ్గకవి యట్లుగాక బహుమితముగా శబ్దముల బ్రయోగించి సుకుమారముగ విషయమును స్ఫురింప జేయుచుండును.

ఇట్లు శిల్పశయ్యాపాకరీతులలో నుభయులకు విశేషభేదము గాన్పించుచున్నది. ఒక్కవిషయమున మాత్ర మిద్ద రేకీభవించెదరు. ఏదియన నుభయులు శైవమతాభిమానులు; వీరికి శైవసంబంధమైన గ్రంథములు వ్రాయుటయం దాసక్తి యెక్కువ.

గురువు ననుకరింపక కేవలము స్వతంత్రమార్గమును ద్రొక్కి దుగ్గకవి తన యద్వితీయ వ్యక్తిత్వమును శాశ్వతముగ బ్రకటించెను.

## కవితాశిల్పము

దుగ్గనకవిత్వ మందలి శిల్పచాతుర్యమును గుఱించి కొంతవఱకు గథాసంవిధాన సందర్భమునను, పాత్రపోషణ సందర్భమునను సూచింప

బడినది. అతడు సృజింపబోవుచున్న గ్రంథస్వరూపమునకు దగిన పరికర సమార్జనమును, కథాశరీరసౌష్ఠవమును నిర్ణయింపగలిగెనా లేదా యని విచారింపవలెను. చిత్రకారుడు చిత్తరువు లిఖించు నప్పుడు మేలైన పటములను రంగులను గూర్చుకొనుట సగముపని. తావ్రాయబోవు చిత్తరువుయొక్క ఆకారము సర్వావయవసౌష్ఠవము (Symmetry) పొంది తనభావనయందలి యాదర్శమును సర్వాంకషముగా విశదీకరింపజేయుట తక్కిన సగముపని. కాబట్టి చిత్రలేఖనమందును (Painting), విగ్రహనిర్మాణమందును (Sculpture) కావలసిన సృష్టిచాతుర్యమే కవిత్వమందు గావలయును ఇట్టినిర్మాణప్రావీణ్యమునకుగదాశిల్పమని పేరు!

దుగ్గకవి శిల్పమందు రెండు శుభలక్షణములు ముఖ్యముగా గాన్పించుచున్నవి: ఒకటి-వస్తుపరికరశుచిత్వము: రెండు-వానిని వాడుకచేయుటలో నుచితజ్ఞత. తానొక పావనచారిత్రము వ్రాయబోవుచున్నట్లు నిర్ణయించుకొనెను. దానికి గావలసిన పాత్రములు, గాథలు, ఇతిహాసములు, సంప్రదాయములు, వర్ణనలు ఇత్యాదు లాయాదర్శమునకు భంగకరము గాకుండ నుండవలెను. అందులో నేవి యయోగ్యములైనను సర్వాంగసౌందర్యమునకు గొంతవెలితి గలుగుచుండును. ఇట్టి యున్న తాదర్శప్రమాణముబట్టి మనము దుగ్గకవి కావ్యముల బరీక్షించినను గొంచెమైనను లోపము గాన్పింపదు. సమస్తభావములయందును, రసములయందును, అలంకారములయందును ప్రధాన రసభావము లెవ్వియో వానికి వ్యతిరేకముగా నేవియు సంకల్పింపబడలేదు. అనగా నితని రసపోషణమున విరుద్ధసంచారీభావము లుండవు. కావుననే యీతని కావ్యశిల్ప మత్యద్భుతము. ఈయద్భుతకథ నద్భుతతరముగ వ్రాసెనని ప్రప్రథమునం జెప్పగలిగితిని.

కథయందలి ప్రధానరసము శాంతరసము లేక జ్ఞానరసము. (ఈకొత్తరసమునుగల్పించుటకు నాలంకారికులు క్షమింతురుగాక!)

ఈరసమును ప్రధాన రసముగా నుంచుటకు పావనమూర్తులగు నాయికా నాయకులను, వారికుమారుడగు జ్ఞానమూర్తియైన నాసికేతుని తత్తదుచితముగా వర్ణించినాడు. శృంగారరసము కథాసందర్భమున దటస్థించినను దానిని చాలమట్టుకు బంధించి కదించి వెల్లివిరియకుండ నిరోధించి ప్రధాన రసమును గాపాడినాడు. ఇట్టి శృంగారరసమునకు * మోక్ష శృంగారమని పేరు.

ఈరసమును బోషించెడు భావనలు, కల్పనలు, అలంకారములు అన్నియును విశుద్ధస్వరూపమున కనువైనవియే సమకూర్చెను. ఈలాగున ప్రధానరసభావములను బ్రతిశబ్దమునందును, ప్రతిపద్యమునందును బోషించి నిలువబెట్టుటయం దీకవి యగ్రగణ్యుడు

కథాసందర్భమున వచ్చినపాత్రావస్థావర్ణనలను కథాసరణికి నంతరాయము గలుగకుండ సాధ్యమైనంతవఱకు క్లుప్తపఱచి కథాకథనమును రసోన్మేషముగా సాగించెను. చంద్రవతికి గలిగినవిపత్పరంపరలు తొలగిపోయి యామె కుద్దాలకునితో వివాహము నిర్ణయింపబడగా కథాప్రణాళికయం దొకవిశ్రాంతి సమయము తటస్థించినది. శుభాంతమైనందు

---

*భోజుని "శృంగారప్రకాశము" (౧౧వ ప్రకాశమున) మోక్షశృంగార మిట్లు నిర్వచింపబడినది:—

"తత్త్వజ్ఞానాదిభి ర్నిశ్శ్రేయసమీహమానస్య గార్హస్థ్యేఽపి తదధిగతయోగ్యతాభిమానో మోక్షశృంగారః, తథాహిః అస్తి మే మోక్షాధిగమేయోగ్యతా; అధీతాని మయా మోక్షశాస్త్రాణి; నిరంతరా నివర్తకధర్మోత్పత్తిహేతవః క్రియాకలాపాః; నవీయంతే నిత్యనైమిత్తికాని; సీదంతి చిత్తవృత్తయః; ప్రాప్తో నిరాలంబనోపాయయోగః; సాధితాని యోగసాధనాని; స్థిరోహి బీజోవా సమాధిలాభః; నివర్తంతే యోగవిఘ్నాః; ప్రకాశతే ప్రత్యగాత్మా; ఉన్మీలయంతి తత్త్వసంవిత్తయః; ప్రత్యాసీదంతి జ్యోతిష్మత్యాదయో యోగావస్థాః; ఇత్యాది ర్యోగ్యచేతసోఽభిమానః స మోక్షశృంగారః. తత్ర సాత్వతీ వృత్తిః, అవంత్యా ప్రవృత్తిః, లాటీయారీతిః, స్వకీయా నాయికా, ధీరప్రశాంతశ్చ నాయకః"

నకు కథకుడును, శ్రోతలు నానందించుట కవకాశము కలిగినది. ఆసమయమున కవి తనయద్వితీయభావనాశక్తిని వినియోగించి చంద్రమతీపరిణయోత్సవము విపులముగను శ్రవణోత్సవముగను వర్ణించినాడు. దేవలోకమున రాజాధిరాజును, మనుష్యలోకమున రాజాధిరాజును వియ్యమందిరి:—

"శా. నానాదైవతకోటితో నిల కజుఁ డరప్పించి యావేల్పుతో
శ్రీ నిండారఁగ వియ్యమందిన నృపశ్రేష్ఠుఁడు దిగంతాగత
క్ష్మానాథుల్ గొనియాడి రొక్కట శిరఃకంపంబు గావించి రా
స్థానం బెల్లను రత్నకుండలరుణ త్కారంబు తోరంబుగన్."

(ఆ 2, ప. 212.)

నభోమండలము భూమ్యంతరాళముల నావహించి నట్లయ్యెను. దివౌకసులు తమ దివ్యవిమానముల నెక్కి యామహోత్సవమును జూడ నేతెంచిరి.

"మ. విలసద్రశ్మినకుత్రీరనక్రి మగుచున్ విస్తీర్ణలీలాకృతిన్
జలధిం బోలె నభంబు దానచటఁ జంచల్లీల నేతెంచునో
డలచందంబున నవ్విమానములు చూడం బేర్చె దత్కర్ణధా
రులమాడ్కిన్ జెలువొంది రయ్యెడసుపర్వుల్ స్త్రీసమేతాత్ములై."

(ఆ. 2 ప. 176.)

మేదినీతలమున నున్నరాజులెల్లరు తమతమ పరివారములతో వచ్చి యుత్సవస్థలము నలంకరించిరి. ఈ యసదృశవైభవోపేతమగుపరిణయము*పార్వతీపరిణయమును జ్ఞప్తికిదెచ్చుచున్నది. ఈయుత్సవమును

* శ్రీనాథుడు తన 'హరవిలాసము' నందు నాల్గవయాశ్వాసమున పార్వతీపరిణయమును వర్ణించెను. ఆవర్ణనమును, దుగ్గకవి యీవర్ణనమును ఏకత్ర చదివినచో గురుశిష్యులశిల్పముల సామ్యభేదములు దెలియును. శ్రీనాథునివర్ణనమునం దపారమగు విస్తృతి, అమేయమగు ఉన్నతి కానబడును. త్రిదశాధీశులును వారిభార్యలును ఔదార్యగాంభీర్యములతో జిత్రింపబడిరి. దుగ్గకవివర్ణనమున అతిలోకౌన్నత్యముతోఁగూడిన సౌకుమార్యము గాన్పించును.

జాల రసవంతముగను పుణ్యశీలముగను వర్ణించి నాయికానాయకులను గృహస్థుల జేసెను. తరువాత నాసికేతుని కడగండ్లు ప్రారంభించినవి. ఆకథాభాగము సైతము దీర్ఘవర్ణనాదికముల కాలవిలంబనముగాకుండ సంగ్రహరూపమున దెల్పి నాసికేతునికిని దండ్రికిని పునస్సమాగమము గావించి, తదుపరి యమపురీవర్ణనము సవిస్తరముగజేసి గ్రంథమును ముగించెను. ఈవిధముగ దన యద్భుతశిల్ప నైపుణ్యమును జూపి గ్రంథము నిత్యకౌతుకావహామగునట్లు రచించెను.

## శైలి

దుగ్గకవి శైలి సామాన్యముగ బ్రాచీనాంధ్ర కవులలో మేలైనవారి శైలిని బోలియుండును. సహజమాధుర్యమును, ధారాశుద్ధియు, మృదుశబ్దఘటితియు, చక్కని లోకోక్తుల ప్రయోగమును, అర్థగాంభీర్యమును, రసపుష్టియు ఇత్యాది మనోజ్ఞములగు గుణవిశేషములు సర్వత్ర కాన్పించుచున్నవి. శ్రీనాథుడు కవితా గురువైనను ఆయన శైలి ననుకరింపలేదు. మహాపండితుడు సమస్తశాస్త్ర విశారదుడు నగు శ్రీనాథుని కవితయందు భాషాప్రాగల్భ్యము హెచ్చు. కృష్ణవేణీ గోదావరి తరంగిణులవలె నుభయభాషలను ఆంధ్రవాఙ్మయభూముల బ్రవహింపజేసి సారతరగ్రంథ సంతానముల నెలకొల్పెను. శబ్దాడంబరము, వర్ణనాధిక్యము ఇత్యాదివ్యాప్తిలక్షణము లాయనకు నైజములు. కొద్దివిషయము నైనను పదబాహుళ్యమున బెంచి యుపన్యాస ధోరణిని జెప్పుట యాయన ప్రకృతి. ఆంధ్రమహాకవులలో బిగువులేని శైలి యీయనయందును, పోతనామాత్యునియందును మాత్రము గాన్పించుచున్నది.

దుగ్గకవి యట్లుకాక శబ్దపరిమితిని అర్థపుష్టిని గౌరవించెను. తన భావనాశక్తిని విశృంఖలసంచారిగా విడిచిపెట్టక నియమనిగళముల గట్టిపెట్టి ఔచిత్యపు సరిహద్దుల నతిక్రమించకుండ బంధించెను.

శబ్దాలంకృతి చాల అరుదు. శ్లేషయమకాదులు సామాన్యముగ లేవనియే చెప్పవచ్చును. భావములు విస్ఫుటముగా చెప్పుట, గాఢాసంప్రదాయముల జేర్చుట, ఉపమాద్యలంకారముల గుదిరినట్లుగ వాడుట, దీర్ఘమైన సమాసముల నిరసించుట, పదవాక్యప్రమాణమును బాటించుట యిట్టి రసప్రధానమగు వ్యంగ్య కవితాలక్షణములు గ్రంథమంతటను వెలయుచున్నవి.

ఈయనకు సమకాలికుడగు ననంతామాత్యుడు (భోజరాజీయ కర్త) దుగ్గకవివలె భావ నైర్మల్యమును, భాషామాధుర్యమును కనబఱచెనుగాని యాతని కవితాధార దుగ్గకవిదానివలె నిరర్గళముగను, రసవంతముగను నుండదు.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవియును సమకాలికుడై, సమీపస్థుడై దుగ్గకవివలె ఋష్యాశ్రమమందలి శృంగారరససౌందర్యద్యోతక మగు ప్రబంధమును రచియించి వన్నెకెక్కెను; కాని దుగ్గకవిచూపిన గడుసు పోకడలను గనుపరుపలేకపోయెను.

మల్లికార్జునకవి శైలియందు స్వాతంత్ర్యములేదు. ఇతర కవుల వర్ణనధోరణులను చాలవఱ కనుసరించుటయే యాతని స్వభావము. అనుప్రాసయమకాదిశబ్దాలంకారములు మిగుల తఱచుగ వాడుచుండెను. మొత్తముమీద కవిత్వమందు రసపుష్టిలేదు. భావగాంభీర్యమున్న.

దుగ్గకవి శైలి సర్వాంగసుందరముగా నున్నది, పింగళి సూరనార్యుడు చెప్పినట్లు "పొసగముత్తెపుసరుల్ పోహళించినరీతి తమలోన దొరయుశబ్దములగూర్పు" ఈతని పదబంధ మతిక్లిష్టముగాక, అతివేలవమముగాక మృదులమనోజ్ఞత బొందియున్నది. ఈగుణవిశేషమును నిరూపించుట కనేక పద్యముల నుదాహరింపవచ్చును గాని స్థలసంకోచముచే రెంటిని దిక్సూచకముగా నిచ్చెదను.

"ఉ. అక్కట యాతలోదరికి నాఁడిడి చూలిటు లేలవచ్చె? రా
జుక్కివుఁడైదె కుమారునిటు లొప్పరికింపగ నెట్టులొప్పె? సొం
పెక్కిన సౌకుమార్యమున కెల్లను నెల్లగునట్టి యిట్టిమే
మెక్కడ? కానలోన వసియించుట యెక్కడ? ఏమిసెప్పఁగాన్."
(ఆ. 1, ప 194)

"ఉ. మున్నొకనాటిరాత్రి కనుమూసినచో గలవచ్చి వేమరున్
నన్ను దృఢోపగూహనము నన్ గరగించి మొఱంగి చన్నయా
పిన్నదిగాదె యాయువతి పెక్కువనొందిన దిష్టు నాఁటికిం
గన్నియగాన ప్రాయమిది కామి నెఱుంగఁగరాదు గ్రక్కునన్."
(ఆ. 2, ప. 69.)

వర్ణనలయందు జితప్రపటముల రమణీయత బ్రకాశింపజేయు శక్తిసాధ్యచిత్రాకృతినిర్వహణము చూడుడు.

"సీ. శైలశృంగముమీఁద సౌవర్ణవల్లరీ
జాలంబుక్రియ మౌళి జడలు దనర
సాకారమైన మంత్రాక్షరావళి వోలె
నక్షమాలిక గేల నమరుచుండ
సైకతస్థలిమీఁద సాంధ్యరాగము రీతిఁ
గటిమీఁద నూత్నవల్కలము మెఱయ
జందురునిపైఁ బర్వుశరదంబుదము మాడ్కిఁ
దనువున భస్మలేపనము దనర
దీప్యమానమైన తేజోవిశేషంబు
నిఖిలదిశలయందు నిండికొనఁగ
మృడునిఁ దపముసేసి మెప్పింపఁబూనిన
మరుని రీతినున్న మౌనిఁగనియె." (ఆ. 2, ప, 47.)

"ఉ. సౌహృదమొప్పగా గురుని సమ్మతి నాథుఁడు వేలుపింప వై
వాహిక వహ్నికీలముల వామవిలోచనలీల వేల్పు లా
జ్యాహుతిచూడ నొప్పెసఁగె నప్డు కళాధరఖండభృజ్జటా
వ్యూహములోపలం దొరగుచుండెడి వేలుపుటేటి కైవడిన్."
(ఆ. 2, ప. 197)

శృంగారరసావేశము నైత మెంత నిగూఢముగా వర్ణించెనో చూడుఁడు.

"చ. జిలిబిలివోవు చేతలకు సిగ్గుల నిగ్గులు వన్నె వెట్ట వే
నలి యరవీడుచుండఁ జరణంబులు దొట్రిలఁ గ్రాలుగన్నులం
దొలఁకెడు మందహాసములు తొంగలిఱెప్పలిలోన డాఁగఁగా
నలికులవేణి యోసరిలె నల్లనఁ బయ్యెద సంతరింపుచున్"
(ఆ. 2, ప. 114)

క్వాచిత్కముగా నున్న శబ్దాలంకారములను నుదాహృతి:—

"క. నారద పారద శారద, నీరద నీహార కిరణ నీహార భర
క్షీరాబ్ధి సీరిదరహార, హారసుధారస పటీరహారి యశునకున్"
(ఆ. 1, ప 79.)

ఈప్రకార మనేకములగు యోగ్యగుణవిశేషముల నుపలక్షించి శైలి నభినుతింపవచ్చునుగాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించెద.

ఇట్టి యద్భుతగ్రంథమును నాయనుంగుటాంధ్ర సోదరులందఱు చదివి యానందించెదరు గాక!

---

# ఎనిమిదవ అధ్యాయము.

సాళువ నృసింహరాయులు—1485-1493.

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి—శృంగార శాకుంతలము.

—విజయనగరరాజ్య క్షీణదశ—

నారాయణకవియేలిక యగుపూసపాటి బసవరాజునుగుఱించి వ్రాయునపుడు విజయనగరరాజ్య మెట్లు సంగమవంశపు కడగొట్టు రాజుల యసమర్థతచేత క్షీణదశకు వచ్చినదో తెలియఁబఱచితిని. ఆకట్ట కడపటిరాజగు విరూపాక్షరాయలు స్త్రీలోలుఁడై మద్యపానవివశుఁడై రాజకార్యములను దన మంత్రిసేనానుల కొప్పగించి స్వైరవిహారుఁడై యుండెను. ఇట్టి యరాజకస్థితిఁ జూచి ప్రాతశత్రువు లైన గజపతులును గ్రొత్తశత్రువు లైనబహమినితురుష్కులును దూష్పవంచెదము, నుత్తరదిశనుండియు రాజ్యమును ముట్టడించిరి. సామంతరాజులుకూడ రాజ్యమునకుఁ గలుగఁబోయెడి విప్లవమునకు భీతిల్లుచు రాజ్యమందలి మహాసేనాని యగు సాళువనరసింహరాయలకు సహాయపడిరి.

—సాళువనరసింహరాయలు—

అదివఱకే పరరాజభీకరుఁడై యున్న నరసింహరాయ లితర సామంతుల సాయముఁబొంది శత్రువులను బాఱఁదోలెను. బోనగిరి, చెంచి, ఉదయగిరి, పెనుగొండ మున్నగుదుర్గములనుండి పగతుఱ వేఁటాడి విజయనగరరాజ్యము శిథిలము కాకుండఁ గాపాడెను. సంగమ

వంశము నిస్సంతతి యగుటచేతనో, లేక రాజ్యరక్షణకర్త యని సామం తప్రభువులంద ఱేకగ్రీవముగ వీనిని విశ్వసించుటచేతనో, యీమహా వీయుఁడు క్రీ. శ. 1487 విజయనగరరాజ్య సింహాసనమెక్కి సాళువ వంశమునకుఁ బ్రథమపురుషుఁ డయ్యెను.

—సాళువవంశము—

సాళువవంశము చంద్రవంశము. ప్రథమమున గుండరాజు; అతని కొమరుఁ లార్గురిలో సాళువ మంగరాజు గొప్పపేరు ప్రతిష్ఠలఁ బొంది దక్షిణసురతాను నెదిరించి సంపరాయనికి రాజ్యము నిల్పియు, శ్రీరంగ నాయకులకు నలువదివేలమాడ లుమ్మడి యొసంగియు, మధురాసుర తాను నోడించి సాళువ బిరుదమునొందియు, నిట్టి మహాపరాక్రమాటో పములగు కార్యములు సేసి విజయనగరరాజ్య చరిత్రలో వాసిగాం చెను. మంగరాజునకు నార్గురు కొడుకులు. అందులో గౌతరాజునకుఁ బుట్టిన నలుగురిపుత్రులలో నగ్రజుఁ డగు గుండాజునకుఁ దిమ్మరా జనియు, నరసింహరా జనియు నిద్దఱు కుమారులు. ఈనరసింహరాయలే కులక్రమాగత మైనసేనానిమై విజయనగరరాజ్యమును గాపాడి తుట్ట తుదకు సింహాసనము గూడ నెక్కెను.

ఈతనికాలముననే పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁ డనెడి యొకగొప్ప యాంధ్ర కవీశ్వరుఁ డుండెను. అతఁడు తా వ్రాసిన గ్రంథములలో "జైమినిభారతము" నీసార్వభౌమున కంకిత మొనర్చెను.

కవివంశము:—పిల్లలమఱ్ఱి యనుగ్రామము నిజాంరాజ్యములో నల్లగొండ జిల్లాలో నున్నది. ఇప్పు డీకాలమునం దున్న పిల్లలమఱ్ఱివారి కుటుంబము లన్నియు వెలనాటి వైదికశాఖలోఁ జేరినవి పినవీరభద్ర కవి నియోగి యని మ. రా. శ్రీ. కందుకూరి వీరేశలింగముపంతులు గారు వ్రాసియున్నారు. వీరి వ్రాత నిరాధారము. అది యటుండ ఇప్పు

టికాలపు నియోగి వైదికభేదములఁబట్టి యిట్టి నిర్ణయముఁ జేయుచుం డుట చరిత్రముల యథార్థతకు విరుద్ధమని నాకుఁ దోఁచుచున్నది. సుమారు రెండుమూఁడు శతాబ్దముల క్రిందటివఱ కిట్టిభేదము లేద నియు, ప్రాయశః యింత ప్రబలముగా నైనను లేదనియు, చరిత్రవిమ ర్శకుల యభిప్రాయమని నొక్కి చెప్పవచ్చును. ఒకటే కుటుంబము నందుఁ గొందఱు వైదికసాంప్రదాయమున నుండుటయుఁ గొందఱు లౌకికవృత్తులలో మెలంగుటయుఁ దటస్థించుచుండెను. బహుశః యిప్ప టికాలమువలెఁ గాక సంబంధబాంధవ్యములుగూడ నుండి యుండవచ్చు ను. కనుక యానాఁటికవులునియోగులే గాని వైదికులు కారని చెప్పుట నప్పటికి లేనిభేదము నారోపించుట యని యుచితజ్ఞుల యభిప్రాయము.

పినవీరభద్రునివంశము పండితవంశము. కవివ్రాఁతలఁబట్టి చూ చినఁ దనకుఁ బూర్వమే తనవంశము ప్రసిద్ధినొంది యుండె నని తోఁచు చున్నది.

క. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయు నుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁ గలరే సుకవుల్

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయసింధు గతకైతవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బిత్రుదేవతలకు నంచితసత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ

నిలువనీడయ్యె నిందీవర ప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు
మట్టిమాత్రింబె పిల్లలమట్టి పేరు
పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు.

(జైమినిభారతము.)

వీరిది కాశ్యపసగోత్రము.; తండ్రిపేరు గాదయ్య; తల్లిపేరు నాగమాంబ. పినవీరున కన్నగా రొక రుండెను. ఇవి యింతవఱకు, పినవీరభద్రుని గ్రంథముల నుండి తెలిసినవిషయములు,

ఈవంశస్థుఁడ నని చెప్పికొన్న మఱియొకకవి పెనుమళ్ల సోమనామాత్యుఁడు తాను వ్రాసిన 'సీమంతినీపరిణయ' మందు పినవీరభద్రుని గుఱించియుఁ దద్వంశమును గుఱించియుఁ జాల విలువయైన యంశములను వ్రాసియున్నాఁడు. తన్మూలముగా నీమహాకవినిగుఱించి యెక్కుడు సంగతులను దెలిసికొనఁగలుగుచున్నాము.

గాదయ్యనాగమాంబలకుఁ జాలకాలము సంతానము లేకపోవుటచే దక్షిణమున నున్న యొకశైలగుహలోఁ దపస్సు చేయుచున్న భారతీతీర్థు లనెడు యతివరు నుపాసించి యాతనివలన మంత్రోపదేశము నొంది యిద్దఱు కవలపుత్రులఁ గనిరి. వారిలోఁ బెద్దవాఁడు పెదవీరభద్రుఁడు, చిన్నవాఁడు పినవీరభద్రుఁడు. పినవీరభద్రుడు పుట్టుకలోనె యొకజడ ధరియించెనఁట! కాలక్రమమున వీరిద్దఱు బెద్దవారైరి. పెదవీరభద్రుఁడు రాజ్యకార్యదక్షుఁడై కర్ణాటకరాజుల కొలువునకుఁ బోయి డెబ్బదివేలసామంతులకు నధికారియై మంత్రివరేణ్యులచే నుతి నొంది గొప్పయశస్సుగాంచెను.

రెండవవాఁ డగు పినవీరభద్రుఁడు వీరేశ్వరుని యవతారమే

యనఁదగినట్లు సకలశాస్త్రంబుల నభ్యసించి కాళిదాసాది మహాకవుల వలెఁ గావ్యరచనఁ జేయఁగల సమర్థుఁ డయ్యె.

పినవీరభద్రునకిద్దఱుపుత్రులు గలిగిరి. (1) వీరన్న (2) మల్లేశ్వరుఁడు. మల్లేశ్వరుఁడు కటకపురిరాజుల, అనఁగా గజపతుల యాస్థానమున నుద్యోగియై తనకార్యదక్షతాఘనతఁ జూపించి యారాజుచేఁ బెనుమళ్ళగ్రామమును బహుమానముగా నొంది యాగ్రామమున నివాస మేర్పఱచుకొనెను. ఆకారణమునఁ బిల్లలమఱ్ఱి యను నింటిపేరు పోయి పెనుమళ్ళ యని యింటిపేరు వచ్చినది. మల్లేశ్వరున కిద్దఱు కొడుకులు—వీరన్న, సోమేశ్వరుఁడు. వారిలో వీరన్నకు సర్వన్న యను సుతుఁడును, ఆసర్వన్నకు పెద్దాంబయందు నలుగురు కుమాళ్ళును గలిగిరి. i పెదబసవయ్య, ii చినబసవయ్య, iii ఉమ్మన్న, iv తిమన్న. ఈనలుగురిలో సోమనామాత్యునకు * భావమ్మయందు సరసన్న గలిగెను. ఆసరసన్న వెంకాంబను వివాహమాడెను.

పైఁ జెప్పిన సోమనామాత్యుఁడు మాధవవర్మసంతతివాఁడైన పూసపాటి తమ్మిరాజునొద్ద మంత్రియై యొక నవ్యకావ్యము రచియింపఁ గౌతుకంబు గలిగి శ్రీశైల నివాస భ్రమరాంబాసమేత మల్లేశ్వరకృపాపాత్రుఁడై, సీమంతినీ కల్యాణమును రచియించి తత్స్వామివారి కంకితము చేసెను.♦

సోమనామాత్యుఁడు చెప్పిన యీగాథ యంతయుఁ జిత్రము

---

* సోమనామాత్యునకు ననుటకుమాఱు ఉమ్మనామాత్యునకు నని యుండవలెను.

♦ ఈగ్రంథమునకు పూసపాటి అచ్యుతరామరాజుగారి యాజ్ఞచొప్పున కాళ్లకూరి సూరన్నచే శుద్ధప్రతి వ్రాయఁబడినది. ఇంకను ముద్రింపఁబడలేదు.

(ఈగ్రంథము చిత్రాడపురవాస్తవ్యులగు కీ. శే. చెలికాని లచ్చారావుగారు ఆమ్రదితాంధ్రగ్రంథసర్వస్వమున ద్వితీయగ్రంథముగ ముద్రించియున్నారు. ప॥ ఆ॥)

గానే యున్నది. గాని యొకగొప్ప సంశయము గలుగుచున్నది. ఈకవి పినవీరభద్రుని పుత్రపౌత్రసంతతిలోనివాఁడైనయెడల పినవీరభద్రుని గోత్రము కాశ్యపసగోత్రమును, ఈకవిగోత్రము భారద్వాజసగోత్రము నగుట యెట్లు తటస్థించును? కావున నీవంశావళిలో నెక్కడనో గొంచెము పొరపాటుండవచ్చును. మొత్తముమీఁద సోమనామాత్యుని సత్కీర్తిని గాని, అతనివంశగౌరవమును గాని సందేహింపనక్కఱలేదు. మన పుణ్యవశమున పినవీరనసంతతి క్రమమును జెప్పి వీనులవిందొనరించినందున కితనికులగౌరవాభిలషితమున నొకించుకగ్రించు లున్నను సరకుగొనక మగసంతతిలోనివాఁడు కాకపోయినను ఆఁడు సంతతిలోనైనను జేరి యుండుననియే తలంచెదను. సోమనామాత్యునివలనఁ దెలిసిన ముఖ్యవిషయ మేదనః—పెదవీరభద్రుఁడు కర్ణాటరాజ్యములో గొప్ప యుద్యోగము చేసెననునది. ఈయుపపత్తి నాధారణముగాఁ జేసికొని పినవీరభద్రుని జీవితవిషయములోఁ గొన్నిటికి హేతువులను మనమూహింపవచ్చును.

## —పినవీరభద్రుని కృతులు.—

శ్రీ భారతీతీర్థయతీంద్రులవారి కృపాపాత్రుఁడై విద్యానంస్కారముం బొంది కవితావైభవమునఁ జెన్నొందిన యీమహనీయుని గురుచరణారవిందముల నిట్లని పూజించెను.

శా. అర్థి న్నాత్మమక మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థింతు న్యతిసార్వభౌముఁ బరమబ్రహ్మానుసంధాత నా
నార్థాలంకృతబంధురశ్రుతి రహస్యజ్ఞాత శ్రీభారతీ
తీర్థ శ్రీచరణంబు నుల్లసితము క్తిప్రియసీవల్లభున్.

శృంగార శాకుంతలమందలి యాశ్వాసాంతగద్యమున "ఇది శ్రీభారతీ తీర్థ గురుశ్రీచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వతపవిత్ర......"

యని యున్నది. ఈ భారతీతీర్థులవా రెవరో మనకు స్పష్టముగాఁ దెలియదు.

పినవీరభద్రకవి రచియించిన గ్రంథము లనేకము లున్నవి గాని, వానిలో మన కిప్పటికి లభించినవి రెండుమాత్రమే.

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి
*నవరసదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసో
ల్లాససారము సముల్లసితశయ్య
భారతీతీర్థయతిసార్వభౌమగురుకృ
పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తి నిర్నిద్ర వీరభద్ర.

ఈపద్యమును, దనశృంగార శాకుంతలమునఁ గవియె చెప్పుకొనెను. దీనియందుఁ బేర్కొనిన ♦నాలుగు గ్రంథములును నామమాత్రావశిష్టము లైనవి. ఈమహాకవికృతులలో మన కిప్పటికి లభించినవి

* అవతారదర్పణ మని సోమనామాత్యుఁడు చెప్పెను. అదియే సరియైనపాఠ మని తోఁచుచున్నది.

♦ ఇవిగాక 'పురుషార్థసుధానిధి' యనుగ్రంథముగూడ రచించెనఁట. అదియును లభ్యముగాలేదు. విద్యారణ్యులు పురుషార్థసుధానిధి యనుగ్రంథము రచించిరి. దానికిది తెనుఁగై యుండునేమో. తైత్తిరీయభాష్యసారమునకు మానసోల్లాస మను పేరు గలదు. దాని సారమే యితనికృతియై యుండవచ్చును.

(1) శృంగారశాకుంతలము, (2) జైమిని భారతమును—బహుశః యీరెండే ప్రౌఢగ్రంథము లగుటచేత విస్మృతిలోకమున సుఖనిద్రఁ జెందక యీనాలుగైదు వందలసంవత్సరముల నుండియుఁ బాఠకమహాశయుల హృదయసీమలయందు గౌరవస్థానము నలంకరించియున్నవి.

—శృంగారశాకుంతలము—

భారతమందలి శకుంతలా దుష్యంతులకథను 'శృంగారశాకుంతల' మనెడు పేరిడి ప్రబంధరూపముగా విరచించెను.

గీ. కథప్రసిద్ధము మిగులశృంగారవతియుఁ
బరిగణింపఁగ శ్రీమహా భారతమునఁ
గథితమైనశకుంతలా ఖ్యానభంగి
నది ప్రబంధముఁజేయు ప్రఖ్యాతినొందఁ.

గీ భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసునినాటక క్రమముకొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మికృతిసేయు నాకు శాకుంతలంబు.

అని కృతినొందిన చిల్లర వెన్నయామాత్యుఁడు కవితోఁ జెప్పెను.

—సంస్కృతనాటకములను ప్రబంధములుగాభాషాంతరీకరణముసేయుట—

భారతమందలికథను, కాళిదాసుని సుప్రసిద్ధనాటక క్రమమును బాటించి యాంధ్రప్రబంధముగా నితఁడు రచించెను. ఈసందర్భమున నొకజటిలప్రశ్నకుఁ బ్రత్యుత్తర మాలోచింతము. సంస్కృత నాటక రాజములను మనపూర్వకవు లాంధ్రప్రబంధములుగా ననువదించిరి గాని, యాంధ్రనాటకములుగాఁ బరివర్తింపలేదు. విద్ధసాలభంజిక యను సంస్కృతనాటకమును మంచనకవి 'కేయూరబాహుచరిత్ర' యను పేరఁ బ్రబంధముగా మార్చెను. పినవీరభద్రునికి సమకాలికు లగు

(జంటకవులు) నంది సింగన్న, ఘంట మల్లయ్య యనువారు కృష్ణమిశ్రుని ప్రసిద్ధనాటక మగు 'ప్రబోధచంద్రోదయము' నాంధ్రప్రబంధముగా ననువదించిరి. రావిపాటి త్రిపురాంతకుని "ప్రేమాభిరామమును' శ్రీనాథుఁడు క్రీడాభిరామ మను ప్రబంధముగాఁ జేసెను. మురారి కవి రచించిన యనర్ఘరాఘవమును బిజ్జల తిమ్మకవి ఆంధ్రప్రబంధముగా రచించెను. ఇట్లింకను మఱికొన్ని దృష్టాంతములను గనుపఱుపవచ్చును. ఆంధ్రకవులు సంస్కృతనాటకములను జదివియు నాటకనిర్మాణముల గ్రహించియు నాటకములుగా వ్రాయక ప్రబంధములుగా వ్రాయుటకుఁ గారణమేమి?

ఈవిషయమునుగుఱించి యిదివఱకే నేవ్రాసిన "ఆంధ్రనాటకములు, రంగస్థలములు" అను గ్రంథమునందుఁ గొంతవఱకుఁ జర్చించితిని. ఆభాగము నిచ్చట సందర్భానుసారముగ జతపఱిచెదను.

సంస్కృతనాటకములు సుమారు రెండువేలసంవత్సరము లయి మనదేశమం దుండియు, విశేషతః ఆంధ్రదేశమున, పదిపదు నైదువందల సంవత్సరములనుండి చదువఁబడుచుండియు నాంధ్రభాషలో మాత్రము గతశతాబ్దివఱకు నిజమయిన నాటక మొక్కటియుఁ గానరాకుండుట యందఱకు నచ్చెరువు గలిగించుచుండిన విషయమే. సంస్కృతనాటకములను బండితులు చదివి సంతోషించిరే కాని యనుకరణమైనఁ గావింపరైరి. దీనిని గుఱించి పలువురు పలువిధములయిన యభిప్రాయములను దెల్పిరి గాని ముఖ్యముగా నాదృష్టికిఁ దోఁచినకారణమేమన, మన వాఙ్మయములో సంస్కృతమునందుఁ గాని మఱియే హైందవభాషయందు గాని పొడసూపని ప్రబంధస్వరూప ముత్పత్తి యగుటయే యని చెప్పఁదగియున్నది. మన ప్రబంధములు సంస్కృతనాటకములకును, సంస్కృతకావ్యములకును మధ్యవర్తులు. వీనియందు నాటకముల యొక్కయుఁ గావ్యములయొక్కయు లక్షణములు సామా

న్యముగ నుండుటచే వేఱుగా నాటకములు వ్రాయనవసరము లేకపోయినది. ఇటీవల నాంగ్లేయ వాఙ్మయమునందలి యనుభవము గలిఁగిన కొలఁది నాభాషయందున్న నవలలను నాటకములను మనవారు చదివి యామూర్తులను బట్టి ప్రతిమూర్తులను సృష్టింపఁజేసిరి.

ఇతర ద్రావిడ వాఙ్మయములు, అనఁగా, అఱవమునను, గన్నడమునను బరీక్షించినను, బైనఁజెప్పిన సిద్ధాంతము స్థిరమే యై యున్నది. ద్రావిడకర్ణాటక భాషలకంటె మనభాషయం దెక్కుడు సౌకర్య మొకటికలదు. అదేదనః- ఆభాషలయందు వలెఁగాక మనప్రబంధములు గీర్వాణనాటకములవలె, నయిదారాశ్వాసములతోఁ బూర్తిఁజెందు కథయంతయు నాటకనిర్ణయ పరిమాణములను మించక యుండును. ద్రావిడకర్ణాటకములలో నట్లుగాక కొన్ని ప్రబంధము లిరువది, ముప్పది యాశ్వాసములవఱకు విస్తరించి, సంస్కృతకావ్యములఁ బోలియుండును. అనఁగా నాంధ్రప్రబంధములు సంస్కృతనాటకములవలెను, ద్రావిడకర్ణాటక ప్రబంధములు సంస్కృతకావ్యములవలెను నిర్మాణక్రమమును సూచించుచున్నవి. కావున విద్యాభ్యాసు లగువారికి నాటకములకు బదులుగాఁ బ్రబంధములు చేకూర్పఁబడినవి. ♦

—శృంగార శాకుంతలము—

ఈపేరునకుఁ గారణము:—కాళిదాసునిశాకుంతలము నాధారముగాఁ గొని పినవీరభద్రుఁడు శృంగారశాకుంతల మనుగ్రంథమును వ్రాసెను. ఈగ్రంథమునకు శృంగారశాకుంతల మనునామ మిడుటకు

♦ పామరజనులకు 'వీధినాటకములు' 'భాగవతములు' రచియింపఁబడినవి. ఈగ్రంథములు నైకము గొప్పకవులచేతనే వ్రాయబడినవి గాని హీనప్రజ్ఞులకు విడిచిపెట్టఁబడలేదు. ఏమహానుభావుఁ డయినను ప్రాచీనకాలమందలి భాగవతము లాడుటయే వృత్తిగాఁగల కూచిపూఁడి, గడ్డిపూఁడి మొదలగు గ్రామములనుండి యీగ్రంథములను సంపాదించి యాంధ్రనాటకవాఙ్మయచరిత్రమును సవిమర్శదృష్టితో విపులముగా వ్రాసిన నెంతయో దేశసేవ యొనరింపఁగలఁడు.

బహుశః శ్రీనాథుఁడు తాను రచించిన నైషధప్రబంధమునకు శృంగారనైషధ మనిపేరిచ్చియుండుటయే యని చెప్పవచ్చును. శ్రీనాథుని వెనువెంట వచ్చినకవులలో ముఖ్యముగా పినవీరభద్రుఁ డామేటికవి ననేకవిధములుగా ననుసరించెను. పాండిత్యమునను, కవిత్వశైలిని, శృంగారరసవర్ణనములను, సీసపద్యముల గరువంపుహరువుల నీకవి శ్రీనాథుని జాలవఱకు ననుసరించియున్నాఁడు. శృంగారరసవర్ణనము విషయములో బహుశః శ్రీనాథునకుఁ దాను సమాన మయినయుద్ది యని భావించుకొని యుండె నని యూహించుట పొరపాటుకాదు.

కృతిపతిప్రశంస:—నెల్లూరుజిల్లాలో, కందుకూరుతాలూకాలో నుండు బిట్రగుంటకు సమీపమున నన్నసోమరాజుపల్లెకు కరణమైన చిల్లర వెన్నయామాత్యున కీగ్రంథము కృతి యొసంగఁబడినది. వెన్నయామాత్యుఁడు కవితో నిట్లు ప్రసంగించెనఁట.

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలననాకు
వేడ్కనడిగెదఁగవులెల్ల వేడ్కపడఁగ
షట్సహస్రకులోద్భవసచివులందు
సుకృతిగాఁజేయు నాకొకసుకృతిఁ జేసి.

కావున వెన్నయామాత్యుఁ డార్వేల నియోగి యని స్పష్టము. అతఁడు కౌండిన్యగోత్రుఁడు. నాగయామాత్యునకును పోతమాంబకును జ్యేష్ఠపుత్రుఁడు. ఉన్నతరాజకీయోద్యోగము గాని మఱి యేవిధమయిన ప్రతిష్ఠావహమగుపదవి గాని గలిగియుండినట్లు గాన్పింపలేదు. బహుశః గొప్పభూస్వామియై ధర్మకార్యానుష్ఠానపరుఁడై సప్తసంతానములఁ గావించి తనజీవితముఁ బుణ్యవంతముఁ జేయుతలంపు గలిగి యుండవలెను. ఈశ్వరభక్తుఁడును, నిత్యసోమవారవ్రతదీక్షాకలితుఁడునై బ్రాహ్మణసమారాధనలు చేయుచుండెను. ఇట్టి శుద్ధచరిత్రున కీగ్రంథము కృతి సమర్పణ చేయఁబడినది. బహుశః యాకృతి సమర్పణకాలమున

కి కను పినవీరభద్రునకుఁ గర్ణాటసంస్థానములోఁ బ్రవేశము గలిగి యుండలేదు. అతనియన్న పెద్దయుద్యోగము చేసినతరువాత, నితఁడు కూడ యారాజాస్థానములోఁ గవీశ్వరప్రఖ్యాతి నొందఁగలిగెను. ఆసమ యమి కను వచ్చియుండలేదు.

ఈశాఖాంతల ప్రబంధకృతిసమర్పణములో నొకచిన్న వింతసంగతి కానఁబడుచున్నది. అది చూడ బహువిచిత్రముగా నున్నది. కావునఁ గొంతవిపులముగా వ్రాసెదను.

ఈ గ్రంథమందలి యాంధ్రకవిస్తుతిలో నన్నయభట్టును, తిక్కన సోమయాజిని మాత్రమే యీకవి పేర్కొనెను.

క. ఇట్టుల మఱుమఱి భారత
ఘట్టమునకు నడనయచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమ ప్రీతిన్.

గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభ చరిత్రు
భానుసమతేజుఁ గొమ్మయప్రభుతనూజు
సుకృతివిభ్రాజిఁ దిక్కనసోమయాజి
బ్రణుతబహుదేశకవిరాజిఁ బస్తుతించి.

అని కవిత్రయములో మొదటి యిద్దఱినే ప్రశంసించెను. తరు వాత వెన్నయామాత్యునకుఁ గృతిపూర్వకముగా నొక్కప్రబంధము రచింపు మని నప్పుడయినను

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢివాసనా
సంపత్తి సొంపు పుట్టింప నేర్చు
దిక్కనయజ్వ వాక్ఛక్తికామోదంబు
చెలువు కర్ణముల వాసింపనేర్చు

నాచిరాజుసోము వాచామహత్త్వంబు
సౌరభంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు బాష నిగుంఫంబుల
పరిమళంబులుగూడఁ బఱపనేర్చు

... ... ... ...

ఇట్లు ప్రాచీనాంధ్రకవుల స్తుతించుచు నన్నయ తిక్కన, సోమన్న శ్రీనాథులను మాత్రము ప్రశంసించెను. గాని యుభయసందర్భములలోను గవిత్రయములో నొకఁడగుశంభుదాసుని మాట నెత్తనైనలేదు. ఇది చాలవింతగా నున్నది. ఎఱ్ఱాప్రెగడను గుఱించి, తనకు గౌరవము లేకపోయెనా లేక కృతిపతికి గౌరవము లేకపోయెనా యని విచారింప, జైమిని భారతములోఁ గృత్యాదిని "మానన్నయభట్టుఁది క్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్", అని యీకవి రచించెను. కావున నెఱ్ఱాప్రెగ్గడను గుఱించి కవి కెంతమాత్రము, ననాదరము గాని,యగౌరవము గాని లేదని స్పష్టపడుచున్నది మఱియేకారణమున నెఱ్ఱాప్రెగడ మహాకవిని బ్రశంస చేయుటలేదనిన,—ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు గ్రామస్థుఁడు అద్దంకి రెడ్డిప్రభువులయొద్ద నాస్థానకవి. గుడ్లూరు కందుకూరుతాలూకాలోనిదియు, సోమరాజుపల్లికిఁ జాల దగ్గఱగా నున్నది. చిల్లర వెన్నయామాత్యుఁడు కరణముగా నుండి రెడ్డిప్రభువులక్రింద నుద్యోగిగా నుండెను. స్వశాఖీయు లగుని యోగులై, సమీపగ్రామములలో నున్నగృహస్థకుటుంబములకుఁ జేరియుండిన వారగుటచేతను,ఏక సంస్థానాధిపత్య సేవకులగుటచేతను ఎఱ్ఱాప్రెగడకుటుంబమగు చెదలవాడ వారికిని వెన్నయకుటుంబమగు చిల్లరవారికి నన్యోన్య ద్వేషములుండి యుండవచ్చును. అందుచేతఁ గృతిపతియగు వెన్నయ శత్రుకుటుంబమువాఁడైనశంభుదాసుని గుఱించి యొక్క మాట యైనను వ్రాయ య్యలేదు.

—:కథా రచన:—

శాకుంతలమూలకథ:— భారతమునం దాదిపర్వములో శకుంతలా దుష్యంతుల కథ యిట్లున్నది. హస్తినాపురముయొక్క రాజగు దుష్యంతుఁడు వేటకొఱకు మాలినీ తీరారణ్యమునకుఁ బోయి యందున్న కణ్వమహర్షి యాశ్రమముఁ జొచ్చి యామహర్షి యుఁడు ఫలాహరణార్థము బైటికి వెళ్లియుండ నాతనికొమార్తె యగు శకుంతల రాజున కర్ఘ్యపాద్యాదు లొసంగి స్వాగత మిచ్చెను. రా జాకన్నియ రూపరేఖాలావణ్యముఁ జూచి మోహపరవశుఁడై యామెతో నీ వెట్లూర్ధ్వరేతస్కుఁ డగుకణ్వమహర్షికి జనించి తి వనియడుగ నాముగ్ధ తా నొకప్పుడు తండ్రినోట విన్న తనవృత్తాంతమును రాజనంద నునకుఁ జెప్పెను. ఈకథ సుప్రసిద్ధమైనదిగాన సంక్షేపముగా నిట వ్రాసితిని.

నృపపుంగవుఁడాయుందతమును విని యాకన్యక్షత్రియజాతయని తెలిసి గాంధ ర్వమునఁ దన్నుఁ బరిగ్రహింప వేడికొనెను. అందునకాయువతి తనకుఁ బుట్టినకు మారునకు రాజ్యపట్టాభిషేకముఁ జేయున ట్లొడంబఱచుకొని యియ్యకొనెను. గాంధ ర్వవివాహానంతరమున రాజు తిరిగిహస్తినాపురికిఁబోయెను. తదనంతరము కణ్వమహర్షి యాశ్రమమునకు వచ్చి దివ్యజ్ఞానమున నీవిషయమంతయుఁ గ్రహించి తనకూఁతునకుఁ జ క్రవర్తి భర్త యయ్యె నని సంతసించి భీతిల్లిన శకుంతల నూరార్చెను. కొన్ని నెలలు గడచినపిదప శకుంతల కొక సుపుత్రుఁడు గలిగెను. వానికి సింహదమనుఁ డను పేరిడిరి. పిల్లవాని యాఱవ సంవత్సరమున మునిపుంగవుఁడు శకుంతలను, కొడుకును దుష్యంతుని కడకు బంపుటకుఁ గొందఱి శిష్యుల సహాయముఁజేర్చి యామెను హస్తినాపురికిఁ బంపిన వారు నిందుకొలువులో నున్న రాజునొద్దకుఁ దీసికొనిపోయిరి. నృపపుంగవుఁడు భార్యను బుత్రునిఁ జూచి తెలిసియుఁ దెలియనట్లుగ మిన్నకుండెను. అంత శకుంతల క్రోధోద్వి గ్నమానసయై తనవిధి కుర్విపాకమునకు వగచుచు సభాస్థలివిడిచి పోవ నుద్యమించు చుండ నశరీరవాణి —

శ్లో॥ భర స్వపుత్రం దుష్యంత ! మావమంస్థా శ్శకుంతలామ్
త్వం చాస్య ధాతా గర్భస్య సత్య మాహ శకుంతలా.

అని యుద్ఘోషించెను.

ఆమాటలు సభవారందఱు వినిరి. అప్పుడు రాజు తనప్రజలందఱకు శకుంతల యొక్క పారిశుద్ధ్యమును దెలుపఁగోరి యిట్లు చేసితి నని చెప్పి పుత్త్రుని నాలింగనము చేసికొని భరతునకు యౌవరాజ్యపట్టాభిషేకముఁ జేసెను

కాళిదాసుని శకుంతలనాటకము:—భారతమందలి యీ యితివృత్తమును శృంగారరసప్రధాన మగునాటకనిర్మాణముఁ గూర్చుకొని నాయికానాయకుల శీలములను జెర్చియు, నూతనపాత్రములఁ గల్పించియు, కథాంశములఁ గొన్నిటి మార్చియు నిట్లనేకవిధములఁ బెంచియుఁ, గుదించియు, వ్యక్తీకరించియు సర్వాంగసుందరమగు నాటకరాజమును, కాళిదాసమహాకవి రచించెను. కాళిదాసు—

(1) శృంగారరసవర్ణనము కొఱకు నాయకున కొకనర్మసఖుఁ డగు మాండవ్యుని, నాయికకు నిద్దఱుసకియల, ననసూయాప్రియంవదలను, నూతనముగఁ గల్పించెను.

(2) శకుంతలయొక్క జన్మవృత్తాంతము నామెచే స్వయముగాఁ జెప్పింపకఁ సఖు లగుప్రియంవదానసూయలచేఁ జెప్పించెను ఏలయనఁ శృంగారరసావేశద్యోతక మగునీవృత్తాంతము నూతనానురాగకోరకము లుదయింపఁజేయుచున్న యీకన్యచేఁ జెప్పించుటకంటె, సఖులచేఁ జెప్పించుట యెంతయేని యుచితము; వీరైననుఁ గొంతవఱకుఁ జెప్పి మిగిలినభాగము సిగ్గుచే జెప్పలేకపోయిరి.

(3) విప్రలంభశృంగారముకొఱకు వనగజప్రవేశ మొకటి గల్పించెను.

(4) శకుంతలకుఁ గొడుకు పుట్టినతర్వాత నాయువయేఁట దుష్యంతునికడ కామెను దీసికొనివెళ్లినట్లు మూలకథ యుండఁగా నామె గర్భవతిగా నున్నప్పుడే రాజునొద్దకు వెళ్లినట్లు కాళిదాసు మార్చెను దీనికిఁ గారణములు:—

(i) దీర్ఘమగు కాలాత్యయ మైనయెడల నాయికానాయకుల ప్రేమరసము తగ్గుననియు (ii) నాటకమందలి యితివృత్తమున దీర్ఘకాలవిలంబన మనుచితమనియు నుండఁగా నోపును.

(5) శార్ఙ్గరవుఁడు, సోమరాతుఁడు మొదలగు చిన్నపాత్రములనుఁ దత్తదవసరము లగుపనులనిమిత్తము కొత్తగఁ గల్పించెను.

(6) మూలకథయందు దూర్వాసమహాముని శాపవిషయము లేనేలేదు. నాయకునిశీలము నిలుపుటకుఁ గా నీశాపకారణమును కాళిదాసు నూతనముగఁ గల్పించెను. ఇంక నెన్నియో చిన్నమార్పులును, కూర్పులును చేయఁబడినవి. కాళిదాసుని యప్రతిమానప్రతిభ, రసపోషణమందే గాక తత్తదనుకూల మగు కథాశరీరనిర్మాణమందును గాన్పించుచున్నది.

పినవీరభద్రకవి భారతమునందలి మూలకథను గాని, కాళిదాసుని నాటకమందలి కథనుగాని యథారూపముగాఁ దీసికొనక రెంటిని మిశ్రముఁజేసి తనప్రబంధమున కనుకూలముగా నుండునటులు వాడికొనెను. కాళిదాసు రచించినది దృశ్యకావ్య మగుప్రబంధము, నాటకముయొక్క ముఖ్యోద్దేశము ప్రదర్శనముచే రసముఁబుట్టించుట. నాటకమందుఁ బ్రదర్శనయోగ్యమగు కథాసంవిధానము స్థలకాలనియమములకు లోబడి యున్నది. ప్రబంధమందలి కథాసంవిధానమున కట్టి సంకుచిత నియమములు లేవు. కాఁబట్టి కాళిదాసు, నాటకనిర్మాణముకొఱకు నూతనపాత్రములు చిన్నవియుఁ బెద్దవియుఁ గల్పించి కథాప్రణాళికను నిరంతజీవిత వాహినీప్రతిబింబితముఁ జేసెను. పినవీరభద్రుఁడాయాపాత్రములను జాలవఱకు విడిచిపెట్టి రసవర్ణనల కనువగు క్రొత్తయవస్థలను గల్పించికొనెను. ఇట్లుభయకవులు లక్ష్యభేదములఁ బట్టి కథాసంవిధానము మార్చుకొని తగువ్యక్తిమహిమలు పోషించికొనిరి.

తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మి కృతిసేయు నాకు శాకుంతలంబు.

అని వెన్నయామాత్యుఁడు చెప్పినరీతి యొప్పిదముగా నిర్వ హింపఁ బడినది. పినవీరభద్రుని శృంగారశాకుంతలకథకును భారతమం దలి కథకును, కాళిదాసుని నాటకమందలి కథకును గలభేదములు—

(1) భారతమునందు శకుంతల తనజన్మప్రకారమును దానే దుష్యంతునితోఁ జెప్పినటులును, కాళిదాసుని నాటకమందు, చెలిక త్తెలు దుష్యంతునితోఁ జెప్పినటుల నిదివఱకే వ్రాసితి. ఈవిషయ మును పినవీరభద్రకవి పై రెండువిధముల నిరాకరించి తనగ్రంథమున కనుకూలించిన క్రొత్తమార్పుఁ జేసికొనెను. శృంగారరసపూరిత మగు నీయితివృత్తమును స్త్రీలచేఁ బురుషునకుఁ జెప్పించిన విపులవర్ణనలకు నవకాశమీయ దని కణ్వమునిశిష్యులచే రాజునకుఁ జెప్పించెను. ఈమా ర్పెంతయు సమంజసమై కవియొక్క యుచితజ్ఞతకు గొప్పదృష్టాంత ముగా నున్నది.

(II) కాళిదాసుని గ్రంథమందు వనగజమాశ్రమమునఁ బ్రవే శించినట్లును, దుష్యంతుఁడు దానిని బంధించుటకు వెళ్ళినట్లును జెప్పు టచే శకుంతలయొద్దకుఁ దిరిగి పోవుట కవకాశము లేక విరహవేదన మున రాత్రిగడిపెను. పినవీరభద్రుఁ డావిషయమున వనగజమునకు బదులు దుష్యంతునినగరి వేఁటపులిని గల్పించెను. కారణము మృగ్యము.

(III) కాళిదాసుని నాటకమందు—కణ్వాశ్రమమున దుష్యం తునిఁ గొంతకాల ముంచుటకుఁ దదాశ్రమమున నధ్వరాచరణ నియ మమును, రాక్షసాటోపంబును, దుష్యంతునిచేఁ గ్రతురక్షణంబును గల్పింపఁబడి స్వల్పమాత్రముగ సూచింపఁబడినది. రౌద్రవీర రసద్యో తనంబుగ నీఘట్టము పినవీరభద్రుని గ్రంథమున నతివిపులముగ వర్ణిం పఁబడుటచే శృంగారరస ప్రధానమగు తత్కావ్యంబున మితిమీఱి క్రొంత రసాపకర్షణముగా నున్నదని నాతలంపు.

(IV) మూలకథయందు శకుంతల తనపంచవర్ష వయస్కుఁడగు

కుమారుని దీసికొని దుష్యంతునియొద్దకు వెళ్ళినట్లును, కాళిదాసుని నాటకమున గర్భవతిగానుండియే రాజునొద్దకు వెళ్ళినట్లు నున్నదని యిది వఱలోఁ జెప్పితిని. ఈరెంటిలోఁ బినవీరభద్రుఁడు మూలకథలో నున్న దానినే గ్రహించి తనగ్రంథమున వాడుకొనెను. పురాణమునందు వలెనే ప్రబంధమునందును గాలదినియమములు లేకపోవుటచేఁ గాల విలంబనము వలన దోషములేదుగాన యీకవివర్యుఁ డట్లుచేసె నని యూహింపవలసి యున్నది.

(V) మూలకథలో లేకపోయినను గాళిదాసుని నాటకములో నున్నటులు దూర్వాసుని శాపమును, అంగుళీయక ప్రభావమును పినవీర భద్రకవి తనగ్రంథమున నుపయోగించుకొనెను.

(VI) శకుంతలావిస్మృతినిఁ జెందిన దుష్యంతునకుఁ బునఃస్మర ణము గలుగఁజేసినవి—భారతమందు నాకాశవాణియు, కాళిదాసు నందు నంగుళీయకమును; ఈరెంటిని రెండుగ్రంథములనుండియుఁ దీసి పినవీరభద్రుఁడు తన కథయందు జతపటిచెను

ఇట్లు మూలకథనుండి కొంతయు, కాళిదాసునికథనుండి కొంత యుఁ దనప్రబంధమున కుపయోజ్యము లగుభాగములను స్వీకరించి కథాసంవిధాన మెంతయు నుచితముగను, రసపోషకముగను నిర్వహించె నని నిష్పక్షపాతబుద్ధితోఁ జెప్పవచ్చును.

కవితాప్రశంస:—"కావ్యేషునాటకం రమ్యం నాటకేషు శకుం తలా" అను నార్యోక్తిప్రకారము సంస్కృతవాఙ్మయమం దత్యున్నత స్థాన మలంకరించుచున్న యీమహానాటకమును గొంతవఱకైనను ప్రాచీనాంధ్రకవులలోఁ బేరెన్నికఁబొందిన యొక కవీశ్వరునిచేఁ దెనిఁ గింపఁబడుట మనయాంధ్రుల భాగ్యవిశేష మని నొక్కి వక్కాణింపఁ దగును. ప్రపంచమందలి యుత్తమకవులలో నొకఁడుగ గణింపఁబడు చున్న మహాకవి కాళిదాసునిగ్రంథములలో నుత్తమం బయినయీనా

టకము కవిత్వమున నేమి నాటకతత్త్వమున నేమి యాదర్శప్రాయమై విరాజిల్లుచున్నదిగదా! అందలి కమనీయకవితామాధుర్యమును బ్రాచీనాంధ్రకవులనోటను మృదుమధురఫణితి వినిన వీనుల కెంతమనోహరముగ నుండునో యూహింపఁదగును.

ప్రాచీనాధునికకవులలోఁ గవితాగౌరవవిశేషాదులఁ బ్రాచీనకవులెక్కుడుమిన్నలు. మృదుమధురపదసంపదలు, రసపూరితవర్ణనలు, కావ్యనిర్మాణనైపుణ్యములు, ఇత్యాదికావ్యశుభలక్షణము లన్నిటియందు, ప్రాచీనకవులు మార్గదర్శకులు, ఆదర్శభూతులు. అట్టివారిచే సంస్కృతవాఙ్మయమందలి యుద్గ్రంథము లాంధ్రీకరింపఁబడుట యాంధ్రభాషాయోషిల్లలామ లోకప్రశస్తి నొందిన యుత్కృష్టాలంకారములఁ దొడిగినదైనది. పురాణేతిహాసములు, సనాతనధర్మసంబంధము లగుటచే బ్రథమస్థాన మలంకరించినవి. ప్రథమాంధ్రకవులు చాలవఱకు భగవద్భక్త్యుపయోగ్యము లగు గ్రంథముల దెనిఁగించిరి. కాని తక్కినవానిని—అనఁగా నాటకములను, కావ్యములను జాలవఱకు ముట్టనేలేదు. పినవీరభద్రకవి పూర్వులవలెఁగాక శృంగారరసప్రధాన మగు నీనాటకమును దెనిఁగింపఁ బూనుకొనెను. కాళిదాసుని మృదుమధురవాక్కు నిబ్బంగిఁ జవిఁజూప నిచ్చగించెను.

ఈమహనీయకృతి నిర్వహింప సమర్థుఁడు పినవీరభద్రుఁడే యని వెన్నయామాత్యుఁడు మనకుఁ దెలియఁజెప్పెను. నన్నయ్యభట్టు ప్రబంధవాసనాసంపత్తియుఁ దిక్కయజ్వవాక్ఫక్కికామోదమును, నాచనసోముని వాచామహత్త్వమును, శ్రీనాథునిభాషానిగుంఫనములును, ఈయనయందుఁ గాన్పించుచున్నవనియు, నీయనయొక్క పిత్రుపైతామహంబుగఁ గవిత్వలక్ష్మి వెలయుచున్నదనియు వెన్నయామాత్యుఁడు నిస్సందేహముగా మనకుఁ జెప్పెను. ఈతని పలుకు లనర్హము లగు స్తోత్రపాఠములు గాక, యథార్థవాక్యములే యని మన కగుపడుచున్నది.

పినవీరభద్రుని కవిత్వమునందు ముఖ్యముగా సరసవచోరచనల సుధామాధుర్యముగ గనధునీతరంగములవలె నిరంతరామోద ముద్భవింపఁజేయుచుండును. ఈతనికవితాధార నిరర్గళమైన ప్రవాహమును బోలియుండును. ఒకచోటఁ జల్లనిపిల్లవాయువులచే సంచలితమై సన్నగ ధ్వనించుచున్న సెలయేటివలెను, వేఱొకచోట నిరంతరధారాసంపాతమున నిర్ఘోషించుచు మహాప్రవాహవేగముఁ దల్లడిల్లి పెల్లున వెల్లివిరియు కల్లోలినివలెను, నైసర్గికముగా నప్రయత్నముగా నీతని వాక్ప్రవాహరి ప్రవహించుచుండును పద్యములు కమ్మచ్చునఁ దీసినబంగారుతీఁగలవలె నింపుసొంపులనీనుచు మహావేగమునఁ బరుగులిడుచుండును.

ఈయనకుఁ దెలుఁగుశబ్దములకంటె సంస్కృతశబ్దము లెక్కుడు వాడుక. అందులో దీర్ఘసమాసములు దఱచుగఁ దటస్థించును. శైలి విషయములో శ్రీనాథుని శైలిని లక్ష్యముగా నిడికొనినట్లు గాన్పించుచున్నది. శ్రీనాథుని కవిత్వమందున్న గుణావగుణము లీతనికవిత్వమునందు నావిధముగానే గాన్పించుచున్నవి శ్రీనాథునివలె, పినవీరభద్రుఁడు గొప్పపండితుఁడు. బహుగ్రంథపారంగతుఁడగుటచే నితని కవిత్వమందుపూర్వకవుల వర్ణనలు నప్రయత్నముగాఁ బ్రిసరించి తమ ఛాయనంతర్లీనముఁ జేయుచుండును.

కథాకథన మతిరసవంతముగను, మనోహరముగను, చిత్రపటవర్ణనాదికములతో నేత్రపర్వముగ నుండి విసుగుగలుగనీయకుండఁ దత్తత్కాలోచితవర్ణనలతో నలలారుచుండును. నాటకమందు నూతనపాత్రలు ప్రవేశించునపుడు తెరమాటువదలి దటాలున దృగ్గోచర మగునట్లు, ఈకవి, కథయందలి క్రొత్తక్రొత్త యవస్థలను వర్ణించునప్పుడద్భుతరసావేశము గలిగించు నూతనకల్పనలతో బ్రారంభించును. శ్రీనాథునిపద్ధతి యదియే. పెద్దవాదులు నీకథనచమత్కృతినే యనుస

రించిరి. మనుచరిత్ర వసుచరిత్రల కథాక్రమముఁ జూచినయెడల పిన వీరభద్రునితీరు వారి కెంతమార్గముఁ జూపినదో తెలియవచ్చును. విస్మయజనకము లగురుచులఁ బుట్టించు రసవికాసకలస్వరములను, మనోజ్ఞభావపుష్టిని నెలకొల్పు మృదుశబ్దపరంపరలను, కథాకథనముం దప్రయత్నముగఁ బరిపోషించి శ్రోతల నానందాబ్ధి నోలలాడునట్లు చేయుచుండును.

మ. చలదిందీవరచారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తనిం
బులినశ్రోణి మరాళరాజగమన న్బాజాని గాంచె న్నట
జ్జలకల్లోలపరంపరానినదవాచాశాలిని న్మాలినిన్.

శా. చంచత్పల్లవకోమలాంగుళకర న్సంపూర్ణ చంద్రాననన్
న్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రవాకస్తనిం
గించిన్మధ్యఁ దటిల్లతావిలసితాంగిం బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మధుకరశ్రేణీల సత్కుంతలన్.

•ఉ. ఎంచి నుతింపశక్యమె యహీశ్వరునంతటివాని కైనర
త్నాంచిత రోచిరుద్గమనిరస్త సమస్తరవీందుజాలమున్
గాంచనకందరాయువని కాయతవారి ధరాంతరాళ
నిర్వంచిత దేవతామిథున వాంఛితమూలము శీతశైలమున్.

ఈకవియందు వర్ణనచమత్కృతి చాలమెక్కువ, భావనావై శద్య మపారము. ఇతఁడసామాన్య పాండిత్యగౌరవమున జంకుగొంకులు లేక ధైర్యమునఁ గవితోద్యోగము నిరాఘాటకముగ నిర్వహింప సమర్థుఁడు. తనశక్తి తనకు బాగుగఁ దెలియును. ఉన్నదానికంటెఁ జెప్పికొనుట గూడ హెచ్చే! ఆత్మవిశ్వాస మత్యధిక మగుటచే శ్రీనాథుని

• ఈ పద్యము శ్రీనాథుని హరవిలాసములోఁగూడ నున్నది.

వలె రసనిరూపణమందుఁ బ్రమాదములు గలుగుచుండును. శకుంతల యొక్క ప్రేమానురాగము గుఱించి దుష్యంతుఁడు, అనసూయా ప్రియంవదలతో భాషించిన పరిహాసోక్తు లంతసరసముగ నుండలేదు. కూరగాయలబేరము జరిపిన ట్లుండుటయేగాక వేగిరపడి నిశ్చితాభిప్రాయముఁ జెప్పెను. తొందరపెట్టుట సుకుమారరీతిని వధూప్రేమ నాకర్షించెడివిధము కానిని నానమ్మకము.

క. మాసొమ్ము మాకునొసఁగిన
మీసొమ్ము మ్మీకు మగుడ మీపూసొమ్ము
ల్వ్రాసివడకుఁడ నూరకఁ
గోసన మేమిటికి మార్చుకొనియెద మెందున్.

గీ. ఇందులోనిష్టమెద్ది మీ యిందుముఖికి
నడుగుఁడెడమాటలకుఁ బొద్దునిడివిలేదు
సాయమవసానమైనను సవనరక్ష
కొదవవలెఁగాని యింకను నుండరాదు.

మఱియొక దృష్టాంతము :—

శకుంతలాదుష్యంతులకు గాంధర్వవివాహ మైనపిమ్మట కణ్వమహాముని శకుంతలను బ్రశ్నించినవిధము చాల విరసముగా నున్నదని నాతలంపు.

వ. అని యంతాంతరంబుల యోగక్షేమము లడిగి కాలత్రయజ్ఞానశీలుండు సకలంబు నెఱింగియు, నెఱుఁగనివాఁడుఁబోలె సమ్మోఱుంగుఁబోఁడి తెలుఁగు తన్ముఖంబున విన నున్ముఖుండై యిట్లనియె!

ఉ. ఎన్నఁడులేని క్రొత్తసిరి నీనెమనీవదనాంబుజంబుమై
చెన్నును నూత్నరేఖవిలసిల్లెడు భావము లెన్నియెన్నియున్
మున్నిటిభంగిఁగాక కడుమోహనలీలలఁ గ్రాలుచున్న వీ
యున్నవిజంబు దాఁచుకొనియుండిన నాపయి నానవెట్టెదన్.

గీ. అనిన గజగజవడఁకుచు నశ్రువారి
కన్నుఁగఁదాల గద్గదకంఠయగుచుఁ
గొంతయును మాటువెట్టక కోమలాంగి
మునికివిన్నప మొనరించె మునికిమునికి.

ఇది నూతనప్రియు సంభోగము నొందిన కూఁతుఁతో సత్య బ్రహ్మచారి యగుతండ్రి భాషించెడువిధమా? సరసులు నిర్ణయింతురుగాక!

ఈసందర్భమున రసికాగ్రేసరుఁ డగుకాళిదా సనుసరించిన మార్గముఁ జూడుఁడు. వీరిగాంధర్వ వివాహముఁగూర్చి యశరీరవాణి చెప్పఁగా నామునిపుంగవుఁ డామెయొద్దకుఁ బోయి కౌఁగిలించుకొని "బిడ్డా! కన్నులఁ బొగకమ్ముకొనియున్నను భాగ్యవశముచేత సోమయాజిచేతియాహుతి యగ్నిహోత్రములోనె పడినది మంచిశిష్యున కిచ్చిన విద్యవలె నీవును నాకు సంతోషహేతు వైతివి. ఇప్పుడే ఋషులను దోడిచ్చి నిన్ను నీభర్త సన్నిధికిఁ బంపెదను" అని చెప్పెను. భారతమునందుమాత్రము ముని తనదివ్యజ్ఞానముచేతఁ దెలిసి కొన్నట్లున్నది.

ఇట్లు కొన్నికొన్ని స్థలములలో రసభావ ప్రమాదములుఁ గాన్పించుచున్నవి. పాత్రోచితసంభాషణ సంఘటనమున సామాన్యముగ నీకవి యతిసమర్థుఁడని తోఁచదు. శృంగారరసవర్ణనలు తఱచు రసవంతముగను మృదుమధుర వచోయుతముగ నింపారుచున్నది.

విప్రలంభశృంగార మెప్పుడు నొక్కటేఫక్కిగా నుండి చదువుటకు విసువు గలిగించుచుండును దుష్యంతుఁ డీగ్రంథ మందు సుమారు మూఁడుమార్లు విరహావేదనలఁ బొందినట్లు వర్ణింపఁబడెను. ప్రతిమారును దుమ్మెదలరొదలు, కోయిలలకూఁతలు, చిలుకలపలుకులు నిత్యాది సామాన్యకవి సంప్రదాయసిద్ధములగు సాధనములే యుపయో

గింపఁబడినవి కాని క్రొత్తకల్పనలు గాని మదనోద్వేగ సూచకములగు మనోవికారచేష్టితములు గాని వర్ణింపఁబడలేదు పెద్దన, పింగళి సూరన మొదలగుకవు లీవిషయములో నెంతమనోహరముగా వర్ణించిరో చూడ వచ్చును ఈకవికిఁ బ్రపంచానుభవజ్ఞానము తక్కువ, గ్రంథపఠనజ్ఞాన మెక్కువ యనియుఁ దోఁచుచున్నది. ఆకారణముచేతఁ బూర్వగ్రంథ ములలో నున్న విరహవర్ణనలను గొంచెముగా మార్చి తన గ్రంథమం దిడుకొనెను.

ఆంధ్రవాఙ్మయమున శృంగారరస ముత్కటముగా నిరూపిం చుట శ్రీనాథునితోఁ బ్రారంభించి; పినవీరభద్రుఁడు, పెద్దన, సూరన్న మొదలగువారిచే వృద్ధినొంది దక్షిణదేశమున ముద్దుపళని, శేషము వేంకటకవి మున్నగువారి చేతులలో వెఱ్ఱితలలు వేసి పరిహాసాస్పద మయ్యెను.

పినవీరభద్రునిశాకుంతల మందు శృంగారరసవర్ణనలకంటె యుద్ధ వర్ణనము చాలరసపూరితముగ నున్నదని చెప్పవచ్చును. ఈయుద్ధవర్ణన ము గ్రంథమం దనుచితమయినను స్వాభావికవర్ణనలతో నలరారుచున్నది.

రగడ. లలితహ్రుదయము తివిరి లంఘించునరదములుఁ
కులగిరుల నైన డీకొను మదద్విరదములుఁ
దెరలి యురువడి గాలిఁ దెగఁబొఱు వాజులును
సురరాజుసరివచ్చు చుట్టంపురాజులును.
... ... ... ...
నిండి సేనాసమితి నేలయీనినమాడ్కి
సహితులకు గుండెలల్లాడంగనంతంత,
మహితసైన్యము నిల్చె మాలినీనదిపొంత.
తృతీయాశ్వాసములో హయగతిరగడను వర్ణించిన సైన్యసమరో

త్సాహంబంతయు నెన్నిసార్లుచదివినను తనివితీరదు. నిజముగ నారాజ సైన్యము మన కన్నులయెదుట నడచుచున్నట్లుండును బహుశః కర్ణాటరాజ్యసేనాని యగు యన్నగారితో నీకవి సమరసన్నాహమున సన్నచమూనివహంబుల వెంబడి కొంతకాలము దిరిగి ప్రత్యక్షముగఁ జతురంగబలంబుల సమరకౌతూహల కోలాహలంబుల వీక్షించి తన స్వానుభవము యథార్థముగ వర్ణించెనేమో యని సందేహము గలుగుచున్నది.

భాషాంతరీకరణము:—కాళిదాసునినాటక మీగ్రంథమునఁ గొంతవఱకుఁ దెనిఁగింపఁబడిన దని యింతకు పూర్వము చెప్పితిని. ఆభాషాంతరీకరణము కథాక్రమముగాఁ గాని, అంక క్రమముగాఁ గాని చేయుటలేదు. అచ్చటచ్చట నున్న మేలైనశ్లోకముల నాంధ్రీకరించి కథాసందర్భమునఁ దనగ్రంథమున కలంకారముగా నుంచికొనెను. కాళిదాసుని శిరీషకుసుమకవితాలాలిత్యమును వన్నెచెడకుండ, వాసన పోవకుండ,నవరసభరితముగ నుండునట్లు తెనిఁగించి గీర్వాణకవితామాధుర్యమునుఁ దెనుఁగుబాషయందు యథామూలముగఁ జూపింపవచ్చు నని సిద్ధాంతపఱిచెను.

పినవీరభద్రునితర్వాత నీగ్రంథమును కృష్ణకవియు, నాగరాజామాత్యుఁడును, వేఱువేఱుగా వ్రాసియున్నారు. ఆధునికకవులలో వీరేశలింగముగారు మున్నగువారు కాళిదాసునినాటకమును నాటకరూపముగఁ దెనిఁగించిరి. ఎంతమంది కవు లెన్నివిధముల నీనాటకమును దెనిగించిన నవి పినవీరభద్రుని కృతిని మించుటలేదు. పినవీరభద్రుని యాంధ్రీకరణమసదృశము, అనతిశయ్యము. కాళిదాసుని శాకుంతలమునుండి రెండుశ్లోకములకుఁ బినవీరభద్రుఁడు చేసిన భాషాంతరీకరణముల నిటఁ బొందుపఱిచెదను.

చ. విలుగొని వెంటవెంటఁ బృథివీపతి రా శరపాతభీతిఁ దా
    మలఁగిమలంగి కన్గొనుచు మార్గముకేవిక నడ్డగించుచున్

నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధముమేసిమేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచుర్.

చ కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచిరా
యని రతనంబు విహ్వాచవియానని తేనియ గోరుమోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసని కేతన మాలతాంగి దా
ననుభవకర్త యేఘనుఁడొ యావిధియత్నఁ మెఱుంగనయ్యెడర్.

---

# తొ మ్మి ద వ అ ధ్యా య ము.

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి—జైమిని భారతము

శృంగార శాకుంతలము తరువాతఁ బినవీరభద్ర కవి జైమిని భారతము రచించినట్లు కానిపించుచున్నది. ఏలయన జైమినిభారత మందుఁ దానటకుఁ బూర్వము రచించినగ్రంథముల నుగ్గడింపక పోయి నను శాకుంతలమందుఁ బేర్కొనిన గ్రంథములలో జైమినిభారతము లేకపోవుటయే యీ పౌర్వాపర్యరచనా నిర్ణయమునకు ముఖ్యాధారము. కావునఁ బినవీరభద్రుని గ్రంథములలో నిప్పటివఱకు లబ్ధములైనవాని యందు జైమినిభారతమే కడపటిది.

ఈజైమినిభారతము సాళువనరసింహ రాయల కంకితము చేయఁ

బడినది. గ్రంథాదియందలి కృతిసమర్పణభాగమును జదివినచో నొండు రెండువిశేషాంశములు గోచరించుచున్నవి.

1. వీరభద్రుఁడు నరసింహరాయల యాస్థానమందొకకవి.

దీనికి గ్రంథమందే యాధారమున్నది. ఒకనాఁడు నృసింహరాయలు సభలోఁ గూర్చుండి జైమినిభారతమును గుఱించి వితర్కించుచు,

"తే. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యెనేనిఁ
జెప్పనేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగునుడికారమున మించుగనియెనేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును."

అని చెప్పి సభాసదులవంకఁ జూడ వారు నీయద్భుతపురాణమును దెనుఁగున నొక్కపినవీరభద్రుఁడే చేయనోపునని తమయేలికకు విన్నవించిన నృసింహరాయలు తనయెదుటనున్న పినవీరన్నను జూచి యిట్లు చెప్పెనఁట:

"క. అని విన్నపంబు చేసిన
ననుఁ గనుఁగొని యలరి నాధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధన మిటు గావలదె యాశ్రితత్వంబనుచున్."

కావున నీకవి యాశ్రితుఁడై యుండి రాయలధనముదిని ఋణవిముక్తుఁడగుటకుఁ గృతిరూపకమగు యశోధనము నిచ్చినట్లు తేలుచున్నది. ఇదియే యాశ్రితత్వ విధానమఁట.

(2) ఈగ్రంథము రచించుటకుఁ గవికిమాత్రమే కోరిక యుండు

టగాక నరసింగరాయలకుఁ గూడ నీగ్రంథము నెవరిచేతనైనను వ్రా యించి కృతినొందఁ గుతూహలము మిక్కుటముగా నుండెను.

ఉ. ఆదట సప్తసంతతుల యందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాటిటికిఁ జెప్ప విపర్యయ మే యుగంబునన్
లేదు కవిత్వ సంతతికి నిక్కము తత్కవితా విలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదమునా హరి కీర్తనంబునన్.

క. నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నందుల్
జైమిని భారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యె నేనిఁ
జెప్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేనిఁ
గుందనము కమ్మవలచిన చంద మగును.

అని సభాసదుల మొగంబులు చూడ నవధరించిన నారాజ సత్తము చిత్తం బెఱింగి వా రిట్లని విన్నవించిరి:

క. ఏరీతి నెఱిఁగెనో పిన
వీరన దేవర తలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టిదియును దన
పేరుగ రచియింపఁ బూనెఁ బేశలఁఫణితిన్.

కావున నరసింహరాయలకును పినవీరభద్రునికినిఁ గూడ నీ పురాణముఁ దెనిఁగింప నుద్దేశము ప్రత్యేకముగఁ గలిగినట్లు విదిత మగుచున్నది. నరసింహరాయల తలం పెఱింగియే పినవీరన్న యీ గ్రంథమును దెనిఁ

గింపఁ బూనెనా యని సందేహ మచ్చోటి సభాసదులకే కాకయెల్లరకుఁ గలుగవచ్చును. పినవీరభద్రున కీ సంగతి యెట్లు తెలిసియుండును? కేవలము మంత్రశక్తివలనను, జ్యోతిషప్రభావమునను ప్రభువుయొక్క యంతరాలోచనఁ దెలిసి కొనె నని చెప్ప సాహసింపలేము. బహుశః నరసింగ రాయలయొద్ద చమూపతిగ నుండిన పెదవీరభద్రుఁడు రాజు మనసెఱింగి తన తమ్ముఁడైన పినవీరన్నకుఁ జెప్పి యుండవచ్చు. ఎట్లయినను బినవీరన్న జైమినిభారతమును దెనిఁగింప నుద్దేశించెను. నృసింహరాయ లాగ్రంథమును గృతి నొంద నిశ్చయించెను.

రాయల కీగ్రంథమందుఁ బ్రత్యేకాభిమానము గలుగుటకుఁ గారణమేమి? అనేకపురాణము లింక నాంధ్రీకృతములు గాకుండెనుగదా! జైమినిభారతమునే నృసింహరాయలు వరించు టేల?

దీనికి సమాధానము జైమినిభారతమందలి కథావిషయములవలనఁ దెలియఁగలదు. జైమిని భారతమందలి కథాభాగ మేమన:—

ధర్మరాజు చేయఁదలచిన యశ్వమేధ యాగము నిమిత్తము భీమార్జునులు సలిపిన భారతదేశదిగ్విజయ మీగ్రంథమున వర్ణింపఁబడినది. ఈదిగ్విజయము ముఖ్యముగాఁ బశ్చిమ దక్షిణభాగములందుఁ జరిగినది. అనఁగా సౌరాష్ట్రము, మహారాష్ట్రము, కొంకణము, కేరళము, పాండ్యము, ఇత్యాదిదేశములు జయింపఁబడినట్లు వర్ణింపఁబడినది.

ఈదేశములను జయించినవాఁ డర్జునుఁడు. విష్ణుస్వరూపుఁడైన శ్రీకృష్ణుని సహాయమున నీయర్జునుఁడీ దేశముల నన్నిటిని దన యన్నగారికొఱకు జయించెను. అట్లే వైష్ణవమతస్థుఁడైన సాళువ నృసింహరాయలు తన యేలిక యగు విజయనగరరాజ్య ప్రభువున కాదేశముల నన్నిటిని జయింపవలసి వచ్చెను.

ఆమహాయోధుఁడు తత్కారణమున దా నర్జునునితోఁ దుల్యుఁ

డని యూహించుకొని యుండవచ్చును. దానికి నిదర్శనముగఁ బినవీరన్న తన గ్రంథమున నృసింహ రాయలఁగూర్చి యిట్లు నుడివెను:—

ఉ. భారతవంశ మండనుఁడు పాండవ గాండివముక్త భాణసం
భారతతప్రభావనుతి పారగుఁ డంచిత గోమహీతులా
భారతదంగదాన పరి పాక సమగ్రయశోవిలాస శో
భారతశాలి గుండ నర పాల నృసింహుఁడు గహ్వరీ స్థలిన్.

కావున నృసింహరాయ లర్జునునిపరాక్రమము చాటుచున్నగ్రంథమును గృతినొందుటకు నిచ్ఛగించెనని చెప్పుట సామంజస్యము నతిక్రమింపదు. *

సాళువ నరసింహరాజు

సాళువనృసింహరాయలు విజయనగరరాజ్యము నేలిన సంగమ వంశస్థులలోఁ గట్టకడపటివారైన రాజశేఖరరాయలు, విరూపాక్ష రాయలు మున్నగు వారికి ముఖ్యదండనాథుఁడుగా నుండి యనేకదేశములు జయించి సామ్రాజ్యమును విస్తరించి, తుదకుఁ దనప్రభువులు దుర్బలురై యుండుటచేఁ గేంద్రప్రభుత్వము చెడకుండుటకుఁ దానే చక్రవర్తియయ్యెను. ఈమహామహుని వంశచారిత్రము సంస్కృతమున "సాళువాభ్యుదయ" మనెడు గ్రంథమున రాజనాథ డిండిముఁ డను నాస్థానకవి రచించెను. కొంతవఱకు జైమిని భారతమునఁగూడ నీనృపాలుని వంశచారిత్ర మున్నది.

సాళువనృసింహరాజు వంశము చంద్రవంశము. ఈవంశస్థులు

---

* గ్రంథాంతమునఁ బినవీరభద్రకవి తన ప్రభువగు నృసింహరాయలను శ్రీకృష్ణుని కలియుగావతారముగ వర్ణించెను. శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెనఁట.

క. ఆసమయంబున ధర్మజ, నేసోమకులంబునను జనించి కుటిలులన్
శాసించి ధరణిపాలనఁ, జేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ నగుచున్.

చాలకాలమునుండి చిత్తూరుమండలములోఁ జంద్రగిరిని ముఖ్యరాజస్థానముఁ జేసికొని తత్ప్రాంతదేశము నేలుచు వచ్చిరి. వీరికి మూలపురుషుఁడు వంకదేవుఁడు. అతనికొడుకు గౌతరాజు. గౌతరాజుకొడుకు గుండరాజు. గుండవిభుని కార్గురుపుత్రులు. వీరి జననక్రమము సాళువాభ్యుదయమున నొకరీతిగాను, జైమినిభారతమున మరియొకరీతిగా నున్నది.* వారిలో మంగురాజు బుక్కరాయలపుత్రుఁడైన కంపభూపతికి



సైన్యాధిపతిగనుండి దక్షిణదేశమును జయించి పరపక్షిసాళ్వుఁడగుటచే సాళువ బిరుదమును బొందెను. ఆకారణమున నీవంశపువారికి సాళువనామము వంశనామముగ వచ్చెను. ఈవిషయము సాళువాభ్యుదయమునను, జైమినిభారతముననను ఏకరీతిగ నుడువఁబడినది. సాళువమంగున కార్గురుకుమారులు గలిగిరి. వారిలోఁ దృతీయుఁడగు గౌతరాజునకు నలుగురుపుత్రులు జనించిరి. ఈనలుగురిలో నగ్రజుఁడగు గుండమహీపతికి తిమ్మరాజును, నృసింహరాజును జనించిరి. ఈ నృసింహరాజే జైమినిభారతమును గృతినొందెను. గుండరాజుయొక్క కనిష్ఠసోదరుఁడైన తిప్పరాజుకు ప్రౌఢదేవరాయల కుమార్తె యగు హరియమ్మను పెండ్లిచేసిరి. కావున విజయనగరపు రాజగు విరూపాక్షరాయ లీనృసింహరాయలకు మేనమామయగును.

నృసింహరాజు పితృపితామహాగతంబగు చంద్రగిరి నేలుచుఁ దన భుజపరాక్రమమునఁ గళింగగజపతుల వశమైయుండిన యుదయగిరి రాజ్యభాగము నాక్రమించుకొని, తరువాత దక్షిణదిగ్జయమునకు బయలుదేఱెను. చోళరాజు యుద్ధముచేయకయే లొంగిపోయెను. పెనుగొండదుర్గమును స్వాధీనము చేసికొనిన తురుష్కులను బాఱఁదోలి, యారాజ్యమును వశముచేసికొనెను. ఇంకఁ బశ్చిమున మఱికొన్ని రాజ్యములను గూడ జయించెను.

ఈ మహనీయుఁడు కళింగ భూపతులకును, దురుష్కసుల్తానులకును దుర్జయుఁడై విజయనగర రాజ్యమును క్షీణింపకుండఁ గాపాడెను. తన బాహుబలముచేతను, బుద్ధికౌశలము చేతను దక్కిన చమూనాయకుల ప్రేమాదరణంబుల కాస్పదమై వారి యంగీకారమున సామ్రాజ్యపదవిని క్రీ. శ. 1487 స్వీకరించినవాఁడయ్యెను. *

* ఈరాజు 'రామాభ్యుదయము' అను సంస్కృత గ్రంథమును రచించెను.

## జైమినికవి

జైమినికవి యష్టాదశపర్వయుక్తమగు భారత గ్రంథమును సంపూర్ణముగ వ్రాసెనో లేదో తెలియదు. ప్రొఫెసర్ వీబర్ అను జర్మనీ పండితుఁడు తన "సంస్కృతవాఙ్మయ చరిత్రము"న నీ గ్రంథము గుఱించి వ్రాయుచు నిట్లు నుడివెను. "అశ్వమేధికపర్వమను పేరుగల యీగ్రంథము బొంబాయిలో క్రీ. శ. 1863 లో ముద్రితమైనది. గ్రంథాంతమందు వ్రాయఁబడిన యంశములను బట్టి గ్రంథమంతయు సమగ్రముగా విరచితమైనట్లు స్ఫురించుచున్నది. కాని యిప్పటివఱకు నీ గ్రంథసంబంధమైనది యొక యశ్వమేధపర్వము తక్క వేఱు భాగము దొరకలేదు. ఈపర్వమునకుఁ గన్నడబాషాంతరీకరణము క్రీ. శ. 12 వ శతాబ్దమునని తెలియవచ్చుచున్నది. ఆగ్రంథమునే కిట్టెలు దొరగారు తాము నాగవర్మ ఛందోగ్రంథమునకు వ్రాసిన యుపోద్ఘాతములో క్రీ. శ. 18 వ శతాబ్దమునకు త్రోసివేసిరి ఈ జైమిని గ్రంథమున శ్రీకృష్ణసంబంధమైన ప్రపత్తి ముఖ్యముగా గోచరించుచున్నది. క్రైస్తవమతసంబంధమైన పాశ్చాత్యసంసర్గములు నిశ్శంకముగాఁ గాన్పించుచున్నవి."

ఈ పండితుఁడే వేఱొకతావున నిట్లు వ్రాసెను:

'సుమంతు—జైమిని—వైశంపాయన—పైల—సూత్ర—భారత—మహాభారత—ధర్మాచార్యాః' ఈ వాక్యము ఇటీవలి వారిదై యుండవచ్చును. దీనినిబట్టి జైమినిభారత మిప్పటి వ్యాసమహాభారతమువలె నుండెనని నిశ్చయించుటకు వీలు లేకపోయినను జైమినికవియు వ్యాసమునివలె భారతమును సమగ్రముగా రచించియుండెనని యూహింపవచ్చును. కాని యిప్పటి జైమినికవి గ్రంథమునకును నిప్పుడు వాడుకలో నున్న జైమినిభారతమునకును పోలికచాల తక్కువగా నుండునని చెప్పవచ్చును."

ఇట్లు వీబరుపండితుఁడు మొదలగు గ్రంథకర్తలు భారతమును సమగ్రముగా జైమినికవి వ్రాసియుండవచ్చునని యూహించుచున్నారు కాని యీక్రింది కారణములచే నాయభిప్రాయము వేఱుగానున్నది జైమిని కవియని చెప్పఁబడిన మహాపురుషుఁడు భారతమందలి యశ్వమేధపర్వము తప్ప నితరపర్వములను వ్రాసియుండఁడని నాకుఁ దోఁచుచున్నది.

(1) జైమినిభారతమున అశ్వమేధపర్వమందలి యాశ్వాసాంత గద్యభాగములో "ఇతి మహాభారతే అశ్వమేధికేపర్వణి జైమినీయే" అనియున్నది. జైమిని పూర్తిగా గ్రంథమును వ్రాసియున్న యెడల "ఇతి మహాభారతే జైమినీయే అశ్వమేధికే పర్వణి" అని యుండవలసినది.

(2) గ్రంథస్వభావమునుబట్టి యశ్వమేధపర్వము దప్ప వేఱు పర్వములను జైమినికవి వ్రాసియుండఁడని యూహింపవచ్చును.

(i) గ్రంథమం దెక్కడఁ జూచినను శ్రీకృష్ణుని మహాత్మ్యమే కానఁబడుచున్నది. వ్యాస భారతమందు శౌర్యపరాక్రమాది గుణగరిష్ఠులగు పాండవవీరాగ్రేసరు లందఱు నిందు తమతమ స్వభావతేజఃపుంజముల నడఁచుకొని శ్రీకృష్ణునికై స్తోత్రపాఠములఁజేయుచు దాసులవలె మెలఁగుచున్నారు శత్రువుల నోడించునపుడు శ్రీకృష్ణుని బలములేదే లేశమాత్రము చేయులేనట్లు వర్తించుటయే కాక దాని వెల్లడించుటయుఁ గాన్పించుచున్నది. ఇదియంతయు వ్యాసకృతికి విరుద్ధము.

కావున జైమినిభారతము వైష్ణవమతప్రాబల్యము నొందినతరువాత శ్రీమహావిష్ణుని యవతారమైన శ్రీకృష్ణునిమహాత్మ్యము నుగ్గడించుటకు వ్రాయఁబడిన గ్రంథమని చెప్పవచ్చును. శ్రీమద్భాగవతము క్రీ వె 12 లేక 13 వ శతాబ్దమున ♦ బోపదేవుఁ డనుకవివర్యునిచే

♦ ఈ బోపదేవుఁడు మహారాష్ట్రప్రభువులగు దేవగిరిసంస్థానాధీశులయొద్దనుండిన ఆస్థానకవి ఈకవి 13 వ శతాబ్దాంతమున నుండినట్లు తెలియుచున్నది.

రచింపఁబడినదని యొక పండితసంప్రదాయ క్రమమునవచ్చుచున్న యైతిహ్యము మనదేశమందుఁ గలదు. జైమినిభారతముఁగూడ నట్లే కొంచెమెచ్చుతక్కువగఁ దత్కాలమున వ్రాయఁబడి యుండునేమో!

2. వ్యాసకృతియం దర్జునుఁడు దక్షిణహిందూ రాజ్యములగు పౌండ్ర, ఆంధ్ర, ద్రవిళ, పాండ్య, కేరళములను జయించినట్లు సూచించుటయేకాని యారాజ్యముల నేలిన రాజవంశములనుగాని, యర్జునునితోఁ బోరాడిన రాజులపేళ్లనుగాని యుద్ధవర్ణనలుగాని కవి చెప్పియుండలేదు జైమినిభారతమందట్లుగాక ముఖ్యముగా భారతవర్షములోని పశ్చిమ దక్షిణభాగములనున్న హిందూరాజ్యము లర్జునాదిపాండవవీరుల నెదుర్కొని సమరముచేసి యలఘు పరాక్రమమున వారిని డిందుపఱిచి శ్రీకృష్ణభగవానులకు శరణాగతులఁగాఁజేసిన క్రమమంతయు నభివర్ణింపఁబడినది. కావున వ్యాసకృతిలో సూచనమాత్రమున నుడువఁబడిన పశ్చిమదక్షిణ హిందూరాజ్యముల ప్రశంసను ప్రత్యేకముగఁ బూనుకొని విపులముగ వ్రాసి యారాజ్యములకు వాసిదెచ్చుటకుఁగాను, ఎవరోమహాకవి యీగ్రంథమును వ్రాసియ సమర్థుడైనని యూహింపవచ్చును. ఆరాజ్యముల ప్రభూతిప్రతిష్ఠల నుగ్గడించుటకు నాయా యాస్థానముల నాశ్రయించిన యొక మహాకవికిఁగాని వేఱొకరికి నీయభిలాష కలుగనేరదుగదా! కావున జైమినికవి పశ్చిమ హిందూదేశస్థుఁడో లేక దక్షిణ హిందూదేశస్థుఁడో యైయుండవలెను. ఇంతియకాక దక్షిణ పశ్చిమ హిందూరాజ్యముల యౌన్నత్యము వర్ణించుటకు నద్దానితో శ్రీకృష్ణునిమహిమఁ బ్రకాశింపఁజేయుటకును నొక అశ్వమేధికపర్వమునఁ దప్ప వేఱొండుపర్వమునం దవకాశము లేదు. కావున నశ్వమేధపర్వము మాత్రమే జైమినికవి

వాఁ్రిసెననియు, నాజైమినికవి పశ్చిమ హిందూదేశస్థుఁడనియు నే నూహించుచున్నాను.†

3. మఱియొక విచిత్రాంశ మీగ్రంథమందుఁ గానఁబడుచున్నది. అశ్వమేధ దీక్షితుఁడైన యుధిష్ఠిరుఁడు సవనార్హమగు నశ్వము భద్రావతీపురమున నున్నదని విని దానిని దెచ్చుటకుఁ బవననందనునిఁ బంపెను. భీముఁడు తత్పురాధీశ్వరుఁ డగు యౌవనాశ్వుని జయించి దీనిని దెచ్చి ధర్మనందనునికి సమర్పించెను. ఈ యుదంతము జైమినికవి కల్పితమే కాని వ్యాసముని గ్రంథమం దెచ్చోటను గానము. ♦భీముని పరాక్రమవిషయ మెట్లయినను జొప్పించి యభివర్ణించుట కొకకథ కల్పింపఁబడి యుండవచ్చును. మధ్వాచార్య ప్రతిష్ఠాపితమైన వైష్ణవ మతము నవలంబించినవారికి భీముఁడు ముఖ్యప్రాణదేవరగదా! కావున నీజైమినికవి పశ్చిమదేశస్థుఁడగు మాధ్వమతస్థుఁడేమో!

## అశ్వమేధపర్వము

ధర్మనందనుని అశ్వమేధయాగ మొనరింపుమని వేదవ్యాసుఁడు పురికొల్పుటయు, తత్క్రతు నిర్వహణార్థము వలయు ద్రవ్యసముపార్జ

† జైమినికవి మహారాష్ట్రదేశస్థుఁడని చెప్పుటకు గ్రంథమం దింకను నాల నాధారములు గాన్పించుచున్నవి. ఆతఁడొక్కచోట సింహబృహస్పతు లగుడినప్పుడు గోదావరీపుష్కరముయొక్క పాపాపహరణశక్తి నిట్లుగ్గ్ ప్రశంసించెను.

"సర్వతీర్థాని గచ్ఛంతి తావత్ప్రపస్రిణాశనే
స్నానన్నసింహాగే జీవే దృశ్యతే గౌతమీనది."

వేఱొకచోట భీముని వంటకముల నభివర్ణించుచు పశ్చిమ హిందూదేశమందలి భోజ్య పదార్థముల నన్నిటిని పేర్కొనెను. ఇట్లనేకములు చిన్నచిన్న నిదర్శనములు కూడ గాన్పించుచున్నవి.

♦ భీముని సూపకారకౌశలముగూడ నప్రస్తుతాంశమైనను గ్రంథాంతమున వర్ణింపఁబడినది. భీముని మహాత్మ్యము నిరూపించుటకై వీని నన్నిటిని కవి కల్పించి యుండవచ్చును.

నకై మరుత్తుని కథ నివేదించుటయు, నిత్యాది పూర్వభాగ ముభయ గ్రంథములయందును సమానము. యజ్ఞాశ్వమును దెచ్చుటకుఁగాను భీముని భద్రావతీపురమునకుఁ బంపుట వ్యాసభారతమందు లేక జైమిని గ్రంథమున మాత్రమే యున్నదని యిదివఱకే చెప్పితిని. సవనాశ్వ సంరక్షణమునకై వెనువెంట నర్జునునిఁ బంపుట నుభయగ్రంథముల యందును సమానము. అటుతర్వాత రెండు గ్రంథములు చాలవఱకు భేధించుచున్నవి.

ప్రాయశః యీభేద మర్జునుని దిగ్విజయవిషయమునఁ గన్పట్టు చున్నది. ఈదిగ్విజయము వర్ణించుటలో వ్యాసకవి వింధ్యోత్తర రాజ్యములకుఁ బ్రాముఖ్య మిచ్చుటయు, జైమినికవి వింధ్యమునకు దక్షిణ భాగమున నున్న రాజ్యములకుఁ బ్రాముఖ్య మిచ్చుటయుఁ గాన్పించు చున్నది. వ్యాసముని త్రిగర్త, ప్రాగ్జ్యోతిష, సింధుదేశములతోఁ బ్రారంభించి తరువాత నర్జునునికుమారుఁడగు బభ్రువాహనుఁ డేలు చున్న ♦మణిపూరపురముఁ జెప్పెను. అటుతరువాత మగధ, వంగ, పుండ్ర, కోసలదేశములను, పదంపడి కాశి, శృంగ, కోసల, కిరాట, దాశార్ణములను జేర్కొనెను. ఈ దేశములన్నియు వింధ్యమున కుత్తర భాగమున నున్నవియే. వీనిఁకన్నిటికిఁ గలిపి యుత్తర హిందూస్థానిమని పేరిడఁబడుచున్నది. ఉత్తరదేశములను జయించినతర్వాత అర్జునుఁడు దక్షిణదిక్కునకు వెళ్లెనని వ్యాసభారతమున జెప్పఁబడినది. నిషధద్రవి డాంధ్రమాహిషములును, దరువాతఁ బశ్చిమరాజ్యము లగు సౌరాష్ట్రము, గోకర్ణము, ద్వారక, గాంధారము, మున్నగు నవియు నర్జునుఁడు గుఱ్ఱమ్మరినట్లు వ్యాసకృతిలో రచించిన దిగ్విజయక్రమము.

♦ వ్యాసకృతినిబట్టి యీమణిపూరపురము అస్సాందేశములోనున్న మణిపుర మని కొందఱి యభిప్రాయము.

ఇంక జైమినిభారతమునందు దిగ్విజయవర్ణన ప్రారంభముననే—

మ. కదలెన్ దత్తురగోత్తమంబు నగర గ్రామావనీభృన్న దీ
సదవేశంత సరిత్తటాకతట నానాభూమి సీమాదురా
సదకాంతార కఠోరమార్గము లవష్టంభంబునం దాఁటి యా
మ్యదిశా మండలమండనం బయినయా మాహిష్మతిన్ జేరఁగన్.

అధ్వరాశ్వము నానాదేశములఁ గ్రిస్మితి దక్షిణదిశనున్న మాహిష్మతీపురముఁ జేరెనదఁట. ఈమాహిష్మతీపురము నర్మదానదీ తీరమున నున్నది. అనఁగా వింధ్యపర్వతములకు దక్షిణభాగమున నున్నది. కావున జైమినికవి వింధ్యపర్వతముల కుత్తరమున నున్న దేశములతోఁ బ్రిసక్తిఁ బెట్టుకొనక, వానిపేర్లయినను జెప్పకయే, దిఙ్మాత్రముగ సూచించి, దక్షిణహిందూస్థానముతోఁ బ్రారంభించి మొట్ట మొదటఁ గనుపించెడు మాహిష్మతీపట్టణముతో మొదలుపెట్టెను. వ్యాసభారతమందు దక్షిణహిందూదేశముల పేర్లయినను జెప్పఁబడినవి. జైమిని భారతమున నుత్తరహిందూదేశముల పేర్లుగూడ సూచింపఁ బడలేదు. ఈవిషయము ముఖ్యముగ గుర్తింపఁదగినది.

మాహిష్మతీపురము తరువాత మఖాశ్వము చంపకాపురముఁ జేరెను. అటుతరువాత స్త్రీమండలమునకుఁ బోవ నాదేశపురాణియగు ప్రమీల యర్జునునితోఁ బోరి యావీరుని ప్రేమాతిశయమున కాస్పద మయ్యెను. స్త్రీమండలము తరువాత వృక్షదేశమునకును, దానిని గడచి మణిపురమునకును యజ్ఞాశ్వ మరిగెను. మణిపురము నేలెడు ప్రభువగు బభ్రువాహనుఁ డర్జునునికిఁ జిత్రాంగదయందు జనించినవాఁడు. తండ్రి కొడుకులకు ఘోరసమరము సంఘటిల్లెను. అందు గంగాశాపగ్రస్తుఁడైన యర్జునుఁడు బభ్రువాహనునిచేఁ దెగి, మున్ను కుశలవులతోఁ బోరి మూర్ఛిల్లిన శ్రీరాచంద్రునివలె సంగ్రామతలమున నీల్గెను.

♦ఈసందర్భమున శ్రీరామచరిత్రము సంగ్రహముగా వ్రాయఁబడినది. ఇది వ్యాసభారతమున లేదు.

మణిపురము విడిచి మఖాశ్వము రత్నపురముఁజేరినది. ఆపైన సారస్వతపురమునకు, నటుతరువాతఁ గుంతల దేశమునకును బోయెను. కుంతలదేశమునఁ గృష్ణార్జునులు చంద్రహాసుఁ డనురాజుతో సఖ్యముచేసి కొని, బకదాల్భ్యుఁ డను వింశతిబ్రహ్మకల్పుఁడగు వృద్ధమహామునిఁ దోడ్కొని యుత్తరదిశ కరిగి, సింధుదేశముఁ బ్రవేశించి, క్రమముగాఁ గరిపురముఁ జేరిరి.

కావున పైనఁ బేర్కొనినదేశములలో బభ్రువాహనుని రాజ్యమైన మణిపురమును, సైంధవునిరాజ్యమైన సింధుదేశమునుదప్ప వ్యాసకృతిలోనున్న దేశములతో సరిపోవున వేవియు జైమినిగ్రంథమునఁ గానరావు.

(2) మఱియొక విషయము: వ్యాసభారతమునలేని యద్భుత చర్యలు శ్రీకృష్ణధ్యాన మాహాత్మ్యములు జైమినిభారతమునఁ బ్రతికథ యందు నావహించి యున్నవి. సుధన్వుఁడు తప్తతైల కటాహమునఁ ద్రోయఁబడినను నించుకైనఁ గ్రిందుదనము నొందక సుఖముగబయట కువచ్చెను. ఈయద్భుతశక్తి యతనికి నేకపత్నీ వ్రతత్వమునను, సంతత కృష్ణధ్యానమానసత్వమునను గలిగెనఁట.

---

♦ బభ్రువాహనుని రాజ్యమగు మణిపురము లేక మణిపూరపురము రెండుగ్రంథములలోను సమానముగ నున్నది నిజముగ నర్జునుని దిగ్విజయవిషయములలో నుభయ గ్రంథములయందు సమానముగ నున్నది ఈ మణిపురపు రాజగు బభ్రువాహనుని చరిత్రమే. ఐనను వ్యాసభారతమం దొకచోట మణిపురము ఉత్తర హిందూస్థానమందలి ఆస్సాంలోనున్న మణిపురమనియు, ఆగ్రంథమందే వేఱొకచోట దక్షిణ హిందూస్థానమందలి పాండ్యరాజ్యమందున్న మణిపూరపురమనియుఁ జెప్పబడినది. జైమినిభారతమునుబట్టి చూడఁగ నీమణిపురము మైసూరుదేశములో నున్నట్లు రైస్ దొరగారు తమ "కన్నడవాఙ్మయచరిత్రము"నఁ జెప్పియున్నారు.

బభ్రువాహనుం డర్జునుని శిరంబు దెగవేసియు నాశిరంబును నాగకుమారు లపహరించి పాతాళమున మఱుఁగుపెట్టిరి. అర్జునుని బ్రతికించుటకు సంజీవికరణిని దెచ్చియుతనిశిరస్సునకై వెదుకగ నెచ్చటను గాన్పింపలేదు. అప్పుడు సమస్తజనులు జనార్దనుని వేఁడుకొనిరి. ఆమహానుభావుఁడు ధ్యానపరవశుఁడై యర్జునుని యుత్తమాంగమును రమ్మని యాజ్ఞాపించెనఁట. ఆయంగము రోదసీకుహరము వదలి క్షణములోఁ గృష్ణుని పాదములయొద్దఁ బడెనఁట. ఈవృత్తాంతము వ్యాస మహాభారతములోఁ గానము. కేవలము జైమినికవి కల్పితము.

రత్నపురాధీశ్వరుఁడగు మయూరధ్వజుని కుమారులు దుర్జయులై కృష్ణార్జునుల నెదిరింప మాయారూపుఁడగు శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణవేషమున బర్హిధ్వజునికడకేఁగి యారాజు మేనియందు సగ మిమ్మని వేఁడెను ఆరాజసత్తముఁ డట్ల కానిమ్మని తనమేని సగము గోయించుకొని యదునందనున కొసఁగెను. ఇట్లనేకాద్భుతకథలు గ్రంథమందుఁ గానఁబడుచున్నవి.

కుంతలేశుఁడగు చంద్రహాసుని చరిత్రము జనరంజకముగ నుండి నిరంతర కౌతూహలముఁ గలిగించుచుండును. ఈరాజసత్తముని చరిత్రము సామాన్యముగాఁ దెలియనివా రుండరు. మంత్రియగు దుష్టబుద్ధికుతంత్రము లును, విష్ణుభక్తి పూరితుఁడగు చంద్రహాసుని యవ్యాజ ప్రభుభక్తియు, మంత్రికుమారుఁడగు మదనుఁడు విషమునకు బదులుగ విషయ నిచ్చి వివాహము చేయుటయు నిత్యాదికథాంశములు సార్వజనీనములు. ఈకథయంతయుజైమినిగ్రంథమునకు నాయకమణివలె విరాజిల్లుచున్నది. ఇతర కథలు సయితము మిల్లే లోకవ్యవహారచాతుర్యమునకుని దర్శకములుగఁ గల్పింపఁబడినచో నీగ్రంథ మెంతయో హృదయరంజకముగ నుండి వ్యాసభారతమున కెంతమాత్రము వెనుదీసి యుండదు.

(3) మఱియొక యంశమునుగుఱించి ముచ్చటించి యీభాగమును విరమించెద.

వ్యాసభారతములో యుద్ధానంతరమున సమస్త బాంధవుల మరణమునకు శోకించుచున్న ధర్మపుత్రుని యొద్దకుఁ గృష్ణద్వైపాయనుం డేతెంచి యనేక విధంబులగు చిత్తసాంత్వన వచనంబులఁ జెప్ప దొడంగి సత్వరజస్తమోగుణాదికములగు సృష్టితత్వ విషయములను, జననమరణాదికంబు లగు సంసృతి విషయములను, జ్ఞానకర్మ యోగాదికములగు ముక్తిసాధన విషయములను, జీవయాత్రా ప్రధానంబులగు ధర్మాధర్మ వివేచక విషయంబులను, ఇత్యాది మహర్ష్యుచితంబులగు పారమార్థికభౌతిక ప్రధానాంశములఁ బ్రబోధించుచుఁ జిత్తసమాశ్వసనముఁ గావించెను. జైమినిభారతమం దట్లుగాక వ్యాసభట్టారకులు వచ్చి చాతుర్వర్ణ్య ధర్మములు కొంత దెల్పి వెంటనే జారస్త్రీ లక్షణంబు లుపదేశించుటకు మొదలిడిరి. జారిణుల లక్షణములు, వారిసాంకేతికములు, బంధకీవధూటుల మాయోపాయములు, అభిసారికల కపటచేష్టితములు, ఇత్యాదిఘటచేటీవిట కోటుల కుటిల నటనలఁ బ్రకటించి బంధుజన మరణ శోకవిహ్వలుండైన ధర్మనందనునకు మనశ్శాంతి గలుగఁజేయ యత్నించెను. ఈరెండుగ్రంథముల యందలి రసభావముల యౌచిత్యవ్యత్యాసము దీనివలన విశదము గాఁగలదు. వ్యాసభారతామ్నాయమందలి పరమార్థ గౌరవమును, రసభావసముచిత సౌందర్యంబును జైమినిభారతమందుఁ జాలవఱకు మృగ్యము. ఏతత్కారణంబునఁగూడ జైమినిగ్రంథ మర్వాచీనమనియే చెప్పనొప్పు.*

---

* జైమినిభారతము (మూలము) సమగ్రముగాఁ జదివినయెడల నాగ్రంథము భారతరామాయణాది ప్రాచీనగ్రంథములతో సమానమైన పురాణగ్రంథము కాదనియు, హిందూదేశమున రాజకీయవిప్లవములు గలిగి హిందూజనసంఘములు తొంటి శీలమును, గులాచారములను బరిత్యజించి వర్ణసంక్రమము పొందినతర్వాతను, శైవవైష్ణవమతముల యన్యోన్య సంఘట్టనము ప్రారంభించినవెనుకను వ్రాయఁబడిన గ్రంథము

## భాషాంతరీకరణము

ప్రాచీనాంధ్రకవులు భారతాది గీర్వాణగ్రంథముల నెట్లు దెనిఁగించిరో యాలాగుననే పినవీరభద్రకవి జైమినిభారతమును దెనిఁగించెను పద్యమునకుఁ బ్రతిపద్యమును, శబ్దమునకుఁ బ్రతిశబ్దమునుఁ జెప్పక, వారు గ్రంథములను స్థూలదృష్టిని బరికించి కథాభాగము దప్పకుండ రసపోషణకొఱకు కొంత పెంచియు, కొంతతగ్గించియు, కొంతకల్పించియు, కొంతయుజ్జగించియు నిట్లు స్వతంత్రముగ మార్చి సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించిరి. వీరభద్రకవియు నామార్గముననే యనుసరించి యేతద్గ్రంథము ననువదించెను. ♦

మాతృకయందలి గుణదోషములు, అనుచిత పరిహాసోక్తులు స్వభావవిరుద్ధాలంకారములు, యథామూలముగా గ్రహింపఁబడినవి. కావున నీతనిగ్రంథమం దేలోపములు నిర్ణయించినను, ఆలోపములు ప్రాయికముగా మూలమున నున్నవనియే నిశ్చయింప వచ్చును. కథాభాగములనుగాని, కథాసందర్భములనుగాని యెచ్చోట నతిక్రమింప లేదు. రసపుష్టికొఱకుఁ బైనఁ జెప్పినట్లు కొలఁదిమార్పులుచేసినను గ్రంథము కేవలము మూలానుసరణముగా నున్నదనియే చెప్పవచ్చును.

శకుంతలాపరిణయము, జైమినిభారతము—ఈరెండు గ్రంథముల రచనాపద్ధతులయందుఁ గొంతభేదము కాన్పించుచున్నది. శకుంతలాపరిణయమునఁ గొంతవఱకు భారతములోని కథను, గొంతవఱకు కాళిదాసుని నాటకములోని కథను జేర్చి యొకవిధమైన స్వతంత్రగ్రంథ

---

నియు తెలియకమానదు. కవిత్వము ప్రాచీనకవులమాదిరిగ నుండదు. సంస్కృతవాఙ్మయ మవసానదశకు వచ్చినతర్వాత వ్రాయఁబడినట్లు గోచరమగుచుండును. గ్రంథమేవిషయమందును మిక్కిలి శ్లాఘనీయము కాదు.

♦ గ్రంథవిస్తరభీతిచేఁగాఁబోలు, మూలమందున్న కథారసపోషకములగు సంభాషణాదికములు సామాన్యముగా విడువఁబడినవి.

ముగా వ్రాసెనని యిదివఱలోఁ జెప్పితిని. జైమినిభారతమునందు దప్పులుగాక కేవలము మూలానుసరణముగఁ బోయినట్లు తోఁచుచున్నది.

జైమినిభారత మంతయుత్కృష్ట గ్రంథమని చెప్పుట కవకాశములేదు. నృసింహరాయలు దీనికిఁ బురాణములలో నపూర్వమని గొప్ప ప్రశస్తి యిచ్చుటకుఁ దగినకారణములు గనఁబడవు. శ్రీకృష్ణభగవానుల మహిమ యెల్లెడల నావహించియుండుటదక్క వేఱుకారణములు గాన్పింపవు. కవి స్వవిషయమునఁ గాని, గాథా సంప్రదాయ మనోహరత్వమునఁగాని, నీతికథా నిర్మాణ చాతుర్యమునఁగాని భారత భాగవతాది పురాణముల కీగ్రంథము సరిరాదు. రసనిరూపణ విషయమందు నిసర్గభావ స్వారస్యములేమిని రసాభిజ్ఞుల కచ్చటచ్చట హృదయక్షోభము గావింపుచుండును.* ఇట్టి దోషసంకీర్ణ మయిన గ్రంథమును భాషాంతరీకరణముఁజేయుట క్లిష్టమగు నుద్యమము. మఱి యొకకవి తప్పులను దాను నెత్తిమీఁదను బెట్టికొని మోయుటయో, లేదా యాకవీశ్వరుని దారిని విడిచిపెట్టి తాను స్వతంత్రముగాఁ బోవుటయో యీ రెండుపద్ధతులలో నేదో యొకదాని నవలంబింపవలసి యుండును. పాపము, పినవీరభద్రుఁడు మూలకవి తప్పుల నన్నిటిని తనతలపై నిడికొని భరించుటయే యాత్మగౌరవమని యోచించినట్లు కానిపించుచున్నది.

ఈ జైమిని గ్రంథమును లక్ష్మీశుఁ డను కన్నడకవి కన్నడభాషయం దనువదించెను. ఆ యనువాదము పినవీరభద్రుని కాలమునకుఁ దరువాత జరిగియుండునని తోఁచుచున్నది పైజెప్పిన జైమినిభారతభాషాం

* తక్కిన పురాణములయందువలె కేవలము ఆదర్శప్రాయములగు నీతికథలను కల్పించుటయేకాక, ఆనాఁటి హిందూసంఘమును యదార్థముగా నిరూపించెడు ప్రయత్నము చేయఁబడినది. పాపము! అప్పటి హిందూసంఘము చాలహీనస్థితిలో నుండుటచేత అవినీతివర్ణనము లెక్కువగా నున్నవి.

తరీకరణ సమస్య లక్ష్మీశుఁడు రెండవ విధముగాఁ బరిష్కరించెను. అనఁగా రసభావ దోషము లున్నచోట్లఁ దాను విడిచి పెట్టుటయోఁ లేక చాలవఱకు మార్చివేయుటయో చేసినవాఁ డయ్యెను. ఈమహా కవి భాషాంతరీకరణ మెంతయు ముద్దులు మూట గట్టుచున్నది. మూల గ్రంథము నన్ని విధముల మించినదిగా నున్నది. భావవైరస్య మెచ్చటను గాన్పింపదు. వర్ణనలు బహుమనోహరములు. భావనిరూపణము అనుభవసిద్ధము. ఏయేవిషయములలో నేయేరసము స్వాభావికమో యాయారీతిని నభివర్ణింపఁబడినది. పాత్రపోషణము సర్వదా శ్లాఘనీయము. కావున నన్నివిషయములలోను బినవీరన కృతికంటె లక్ష్మీశుని గ్రంథము సర్వాంగసుందర మని నాకుఁ దోఁచుచున్నది ఇట్టి మనోజ్ఞమగు గ్రంథమును సముయోచితముగా నాంధ్రవాఙ్మయ విద్యార్థులకు నిరూపించుట యుత్తమమార్గ ప్రదర్శకమని భావించి యీక్రింద నుదహరించిన సందర్భములను మూలగ్రంథమున నుంచియుఁ, బినవీరన లక్ష్మీశుల గ్రంథముల నుంచియు సమానభాగముల నుద్ధరించుచున్నాను.

(1)ద్వారకాపురవాసులఁ దోడ్కొని శ్రీకృష్ణుఁడును, భీముఁడును హస్తిపురమునకుఁ బోవుచు దారి నోఁదములోఁ దామిట్లు బావమఱఁదుల పరిహాసముఁ జేసికొనిరఁట. ఈసల్లాప మెంత విరసముగాను, అశ్లీలముగాను నున్నదో చూడుఁడు.—పరిచారికలలోనున్న యొక వేశ్యదూతికనుజూచి శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెనఁట:-

శ్లో॥ స్థూలోదరం భీమసేనం వరం వరయ శోభనే!
త్వంతు శంభలింగచ్ఛాయా భీమం దంతవివర్జితమ్.

అని. పిదప:—

శ్లో. భీమస్తుప్రత్యువాచేదం రాక్షసీ మేగృహేప్రియా,
వారయిష్యతి మాయాతు భక్షయిష్యతిత్వాంహిసా;

తస్మాత్ కృష్ణగతాఃసంతు సర్వాః దంతవివర్జితాః,
కృష్ణాభిష క్తచిత్తానాం సర్వత్ర సుఖమేవహి.

ఈభాగమును బినవీరభద్రుం డి ట్లనువదించెను:—

గీ. కలయఁబడి మూఁపు మూఁపునఁ దలఁగఁద్రోయ
రాని సందడి నడచు పౌరవ్రజంబు
నరయుచును వచ్చు వృద్ధవేశ్యాజనంబుఁ
జూపి నవ్వుచు హరి వాయుసుతున కనియె.

ఉ. వీరిఁ బరిగ్రహింపు మిది వేళ సమానలు నీకు భీషణా
కారకఠోరమన్మథవికారగుణంబుల నన్ననవ్వి య
మ్మారుతి పల్కె నిట్టికొఱ మాలినజంతలఁ జక్కఁబెట్టనీ
భారము వన్నె కెక్కు దుర వస్థలు నీకరలాలనంబునన్.

కాని లక్ష్మీశకవి దీనిని స్పృశించుటయే లేదు.

(2) శ్రీకృష్ణుఁడు పురజనసహితముగా మార్గమందొక కాసార తీరమున విడిసి సంధ్యాసమయ మగుటచే నాసరోవరము దర్శింపఁగోరి రుక్మిణీసమేతుఁడై మలయా నిల సంచలితారవిందబృందంబుల వీక్షించుచుఁ దనప్రియసితో నిట్లుసంభాషించెనఁట.

(పద్మినీలత నుద్దేశించి)

శ్లో. ఇమాం త్వం పశ్య సుభగే, రవిభార్యా మనిందితామ్,
గజైర్గృహీతాం ముక్తాంచ మరాళై ర్విదళీ కృతామ్.
చంచరీక ద్వయవృతాం స్త్రీణాం చిత్తంతు చంచలమ్,
నిజం నాథం వంచయిత్వా రమయంతి పరం జనమ్.
అవిలోక్య పరంకాంతం మ్లాయంతిచనిశాగమే.
హృదయే కలుషం గృహ్య షట్పదం ప్రస్నవంతి చ.

*　　*　　*　　*

ఇట్లు శ్రీకృష్ణుఁడు స్త్రీశీలమును నిర్హేతుకముగాఁ దెగడిన తర్వాత రుక్మిణీదేవి తనవల్లభునితో నిట్లనియె:

శ్లో. హరింజానాతి నాథంవై
పద్మినీ పద్మలోచన,
స్వసుతా నాగతాన్ మత్వా
పుష్ణాత్యేషా గృహాగతాన్,
పుత్రపౌత్రాదికాన్ నాథ
షట్పదాదీన్ జనార్దన!



ధర్మపత్నియు, సాధ్వీమతల్లియు, పతివ్రతాశిరోమణియునగు రుక్మిణితో నున్నతఱి, బవిత్రమగు సంధ్యాసమయమున, భూమ్యాకాశములు శాంతమూర్తులై తేజరిల్లుచుండఁ, బ్రకృతియోషస్సరోవరవాఃపూరవినీలకాంతులతో ప్రకాశించుచుఁ, బుండరీక మండమండనోద్దండంబున విలసిల్లుచుఁ, బుష్పంధయనినాదగానమాధుర్యంబునఁ త్రైలోక్యనాథుని సేవించుచున్న సమయంబున, శ్రీహరిచిత్తంబున నాయత్తంబులగు భావంబు లివియా? అట్టిసమయమున సకలభువన జననీ జనకులగు లక్ష్మీనారాయణు లన్యోన్యాత్మానుభవము లిట్లా వెలిపుచ్చుకొని యుందురు? ఈసల్లాపము నాకెంతయు విరసముగా నగపడుచున్నది.

ఈభాగము పినవీరన యీక్రిందివిధముగా భాషాంతరీకరించెను:

చ. కమలదళాక్షుఁ డంత నిజ కామిని రుక్మిణితోడ నిట్లనున్
గమలినిఁ జూచితే ప్రియుఁడు గన్గొరామి మరాళసామజ
భ్రమర కులంబు పైఁ బడఁ గరంబు సుఖించెనుఁగామ మెప్పుడున్
రమణునికంటెనెన్మిది గుణాంబులుగాదె లతాంగి కారయన్.

క. అన విని రుక్మిణి విభుతో
ననుఁదనయునివాహనంబు హంసము దనవా
హన మేనుఁగు దేఁటులయెడఁ
దనుజాభావమగుఁ గానఁ దగ దిటు పల్కన్.

లక్ష్మీశకవి దీనిని గొంతసుకుమారముగను రసవంతముగను మార్చి భాషాంతరీకరించెను.

రాజముఖి నోడి సరోవరద పద్మినిగె
రాజహంస క్రీడెపున్నాగ కేళివి
భ్రాజితమధుపగోష్ఠి సందపుమరలిగె
తానరసి యాదపళదెంతో.

స్త్రీజనకె సహజమిదుమేలె కర్దమజాతె
మాజువళదెయొళిర్ద కృష్ణతెయె నిదుజగకె
సోజిగలె చంచలె యలాపతియనెణె
సువళేపేళెం దొడితెందళు

దేవనీంపద్మినిగె పళివనారోపిసువు
దావసంమత రాజహంస పున్నాగమధు
పావళియనో వలాగద మాతె మక్కళోడ
గూడిర్ద్దొదెం ధరయొళు
జీవెనంనిది డాదు దుమంకమిల్లి తా
నావిర్భవిసిదొడెం కృష్ణహృదయకెదోష
మావుదాణ్మంగె నడనరుగిదొడె చంచలెయు
నాపరిమె విదనెందళు

పురుషనోర్వంగె నారియరుంటుపలబలీ
ధరయొళంగ నగపతి యొర్వనే గతియెంబ
పరివిడియనరుహిసువడా వీర్వరిల్లదో
ర్వరు మిల్లమిన్ను బరిదె
సరసియొళగణ పద్మినియ దూషిసలుబేడ
పరమపావనెయందు శివనుత్తమాంగ గీ

ధరిసిదనెనల్పతివ్రతె యల్లదిహాళె పే
ళెందు రుక్మిణి నుడిదళు.

ఆకొలనిగట్టున శ్రీకృష్ణుఁడు విడిది దిగియున్న కాలమునసే చుట్టుపట్ల నివసించియున్న గొల్లలు స్త్రీపురుషులు గోపాలశిరోమణిని దర్శించుటకై వన్యఫలాదుల నుపాయనములుగాఁ గైకొని ఆయాందవ సింహునిఁ జుట్టుకొనిరి. ఈసన్నివేశము మూలగ్రంథమున సామాన్యముగ వర్ణింపఁబడినది. కాని పినవీరభద్రుఁడు దానిని క్రొత్తకల్పనలతోఁ బరిపోషించి చాలరసవంతముగను, మనోహరముగ నుండునట్లు చేసెను. గ్రంథవిస్తరభీతిచే దానినంతయు నిట నుద్ధరించుటకు వీలులేక, ఒండు రెండు పద్యములమాత్ర ముదాహరించెదను.

సీ. కోరగించెదు కొండగోగుఁ బువ్వులచాయ
దీవన్నెగోర్పడం బెట్టు గలిగ
మెఱుఁగుఁజుక్కలచాయ మించు నీతెల్లని
గురువిందపే రెందుఁ గూర్చుకొంటి
నిగుఱు గప్పపిచంద్రనిప్పుకై వడి నున్న
దీకొడ్డిపూస నీకెవ్వఁడిచ్చెఁ
బొలసినగబ్బు కంపులు సోదుముట్టెదు
నీనల్లతిరునామ మెచట దొరకె
జడలు నొసమీఁద వ్రేలెడు జల్లితోఁక
నేడ సవరించుకొంటివి బోడ కోడె
యనుచు నాడెదు మూఢవాక్యముల కలరి
శ్రీధరుఁడు వారిఁ గృప నాదరించె నపుడు

సీ తెఱవయొక్కతె జుంటితేనె కానుకచేసి
తలఁపించె నధరామృతంబు చవులు

తరుణియొక్కతె పూవుదండ నూడిదఁ బెట్టి
హేలాపరీరంభ మెచ్చరించెఁ
జడఁతియొక్కతె బిల్వఫల ముపాయనమిచ్చి
పదరించె ఘనకుచస్పర్శనంబు
సుదియొక్కతె పింఛ ముపదగా నర్పించి
రూపించెఁ గుంతలాక్షేపణంబు
నెమ్మి నీరీతిఁ జేదర్శనమ్ము లొసఁగి
ప్రియులసన్నిధి మర్మగర్భితముగాఁగఁ
బ్రౌఢగోపాంగనలు తమ ప్రాఁతవలపు
వెల్లివిరిఁజేసి రిందిరావల్లభునకు.

లక్ష్మీశకవి దీనినంతయు నేలకోచల్లగ జాఱవిడిచెను. ఈజైమినిభారతమందు భారతవీరులును, తదితరయోధులును సాహసకార్యములను జేయఁగడంగినప్పు డెల్లను ఘోరమైన ప్రతిజ్ఞలను జేయుచుండుట తఱచు గాన్పించుచున్నది. ఇట్టివైపరీత్యము వ్యాసభారతమందు కానము. వ్యాసభారతమందుఁ జేసిన ప్రతిజ్ఞలు మహాపురుషుల కుచితమైన భావములతో నలరారియున్నవి. జైమినిభారతమం దట్లుగాక ప్రతిజ్ఞలు నీచమైనవి; అశ్లీలమైన పురుషోక్తులతో గూడి యున్నవి.

వీని నన్నిటిని పినవీరభద్రకవియు యథావిధిగా ననువదించెను. లక్ష్మీశకవి యట్లు చేయక యచ్చటచ్చట స్వతంత్రముగా మార్చివేసెను.

పినవీరభద్రుని భాషాంతరీకరణమునందు మఱియొక విశేషము గోచరమగుచున్నది. మూలమందున్న కథాసందర్భములలో రసప్రత్యాయకముగా నాయకానాయకులును, నాయికలును జరిపిన సంభాషణాదులను సామాన్యముగఁ బినవీరభద్రకవి యనువదింపలేదు. కథాసరణి మనోహరముగా నుండుటకు కొన్నికొన్ని క్రొత్తకల్పనలు, క్రొత్తవర్ణనములు జేర్చియుండెనుగాని సంభాషణములను మాత్రము తఱచు విడిచి

పెట్టెను. బహుశః గ్రంథసంగ్రహము కొంత కిట్లు చేసియుండెనని యూహింపవలసియున్నది. సీతావనవాసకథలో సీతాదేవిని వనమునకుఁ బంపకపూర్వము లక్ష్మణభరతశత్రుఘ్నులు తమ యన్నగారి మనసు మరలించి కృతనిశ్చయమును దొలఁగించుట కాయనతో జరిపిన వాద ప్రతివాదములను బొత్తిగా విడిచి పెట్టెను. ఇట్లే యితరసందర్భముల యందును సంభాషణములను జాలవఱకు భాషాంతరీకరించుట మాను కొనెను.

## శిల్పము, శైలి

వీరభద్రకవి శైలినిగుఱించి కొంతవఱకు శృంగార శాకుంతల విమర్శనమున వచించితిని. అతని శైలియందుముఖ్యముగా మృదుల శబ్దఘటిత గానవచ్చెడిది. శృంగారశాకుంతలమునఁ దన్నుఁగూర్చి చెప్పి కొనుటలోఁ దాను నన్నయభట్టు, తిక్కనసోమయాజి, నాచనసోముఁ డు, శ్రీనాథునివలెను పదముల కూర్పు చేయఁగలనని చెప్పికొనెను. ఈవిధమైన నుతికి నీయన కొంతవఱ కర్హుఁడనియే నాతలంపు. తాను పేర్కొనిన యాంధ్రమహా కవులవలెఁ గాకపోయినను సామాన్యకవుల కంటె నెక్కువవాక్ప్రౌఢి చూపెనని చెప్పనొప్పు. "నృత్యతి యదగ్రస నాయాం వేధోముఖరంగలాసికా వాణీ" యని వామనభట్ట బాణుఁడు చెప్పిన ట్లీకవియు వాగ్విలాసములు సువిశేషముగఁ జూపఁగలిగిన సమ ర్థుఁడు. ఆకారణముచేతనే కాఁబోలు మనవారితనిని గుఱించి పెక్కు పుక్కిటి పురాణములను గల్పించిరి. సరస్వతీదేవి స్వయముగ జైమినీ భారతము నొకనాఁటిరేయి వ్రాసెననియు, ఈకవి "వాణి నా రాణి" యని తన వైదుష్యపారంగతత్వ ప్రభావమును నెఱపుకొనుచుండె ననియు, ఇత్యాదికథలు మనదేశమందున అవిమర్శక పండితావళి చెప్పి కొనుచుండిరి.

ఎట్లైనను శ్రీనాథునివలె నీకవియు సరస్వత్యుపాసకుఁ డని తోచు

చున్నది. ఇతనికి శారదాదేవి కృపాసమృద్ధి ననన్యసామాన్య పాండిత్య గరిమ లబ్ధమైనది "విద్యా దదాతి వినయం" అను నార్యోక్తి ప్రకారము వైదుష్యవిశేషము వినయసౌశీల్యములను వృద్ధి నొందింప వలసినదే కాని యీ కవివర్యునియం దట్లు జరుగలేదు. ఈతనికి పాండిత్యముకంటె నహంభావము, నౌద్ధత్యము చాల హెచ్చు. కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు మున్నగువారి యందును వినమ్రభావమును కనుపఱుపఁ గలిగెను. ఈ కవివర్యుఁ డట్టి భావపరిణతి నెన్నఁడును బొందిన ట్లగపడదు. జైమినిభారత గ్రంథాంతమున *"సుకవిమల్ల కపోల్లసత్కులిశ హస్త పల్లవుఁ" డని తన్నుఁగూర్చి చెప్పికొనెను. ఈయనచే అంపవుఁగోఁత నొందిన మల్లన సుకవి యెవరో తెలిసికొనఁ దగినవిషయమే.

జైమినిభారత గ్రంథాదిని నృసింహరాయలు తానుకృతినొంద నిచ్ఛగించిన గ్రంథ మెట్లుండవలెనో నిరూపించుటకు,

"అల్లన విచ్చు చెంగలువలందు రజంబును గప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లుభావముల్
పల్లవహస్త చన్నుఁగవపయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చుఁ గబ్బముల్."

అని కవిత్వరసభావముల నుగ్గడించి వీరభద్రకవివంకఁ దిరిగి, "మామకమనోరథం బెఱిఁగి కృతిచెప్ప నుద్యోగించితివి" అని తన్నుఁ గూర్చి యనినట్లు కవి చెప్పికొనెను. తనకవిత్వమునందు రసభావములు బహుమృదువుగాను, సుకుమారముగాను, సౌరభభరితములుగాను నుండునని యాతని యాశయము. కాని అస్మదాదుల యభిప్రాయము వేఱుగా నున్నది. ఉభయగ్రంథములు జాగ్రత్తగాఁ బరిశీలించి చూచితిని గాని భావములయం దెక్కువ విశేషములు కనుపించలేదు.

శబ్దచాతుర్యము ప్రసిద్ధము. కవితాప్రభావ మనర్గళము. రస

* పాఠాంతరము;—సుకవిమూర్ధవిలుంఠన కులిశహస్త పల్లవుఁడు.

వికాసము ప్రకీర్ణము. ఈదృశంబులగు సుకవితాలక్షణములు చాలవఱకు గోచరించుచున్నను భావసమృద్ధి మృగ్యము. స్వతంత్రిత తక్కువ. పూర్వకవుల యనుకరణమో లేక మాతృకానుసరణమో—యివియే ముఖ్యమైన భాగములలోఁ గాన్పించుచుండును. శ్రీనాథునియందు సహితము ప్రాచీనమహాకవుల ప్రయోగములు ప్రాచుర్యముగ కావ్య ప్రవాహమున ♦గండకీశిలలవలె దొరలుచుండును గాని యా మహాను భావుని యప్రతిమ ప్రతిభాగౌరవమున కవి పరిచిత ప్రయోగముల కును నొకవిధమైన నూతనవికాసము కలుగుచుండును. కావున పండిత కవివర్యుఁడగు శ్రీనాథుఁడు స్వతంత్రకవివలె పరిఢవిల్లుట తజ్ఞులలో ననేకుల యభిప్రాయము.

పినవీరన కవిత్వమం దలంకారములు చాల తక్కువ. శబ్దాలం కారములాశ్వాసాంతపద్యములలో మాత్రము వాడఁబడినవి: తక్కిన కథాభాగములలోఁ గ్వాచిత్కముగనున్నవి. చదువరుల పుణ్యవశమున ఈకవి తన జైమినిపురాణమును శ్లేషలు, అనుప్రాసములు, యమకా దులతోనింపక సరళమైన మృదువచనరచనతో మేళవించి కదళీపాకముగా నుండఁ జేసెను. శబ్దాలంకారముల వైముఖ్యముఁ గనుపఱిచినను ఉపమాద్యర్థాలంకారములు వాడియుండవలసినదే. ముఖ్యముగ కాళి దాస మహాకవినాటకరాజమును తెనిఁగించిన మహాకవి ఉపమాద్యర్థా లంకారపుశోభను చేకూర్చియుండదగినది; కాని అట్టియలంకారసౌభా గ్యము ఈతనివలన పలుకులపొలఁతి గడించియుండలేదు. గద్యశైలి పద్యశైలివలెనే మృదుమధురముగనుండును. గద్యభాగములందు ముఖ్య ముగ అనుప్రాసాది శబ్దాలంకారములు తప్పక వాడఁబడినవి. స్వాభావిక శైలిని గద్యములు వ్రాయుటలేదు. ఇట్లు గద్యరచనయందు శబ్దచమ

---

♦ ఇవియే పూజార్హములైన సాలగ్రామములు. వీనియందు సువర్ణము గర్భిత ముగా నుండునని పలువురెఱిఁగిన విషయమే.

త్కృతికనుపర్చుటలో ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోముఁడు, జక్కనమున్నగు మహాకవులు దారిచూపిరి. ఆదారినేయీకవియు అనుసరించెను.

పినవీరన కవితాస్థానము.

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు రెడ్డిభూపాలుర యాస్థానమున అనన్య సామాన్య తేజోరాశియై మార్తాండునిపగిది ప్రజ్వలించి యస్తంగతుఁడగుచుండ సహజప్రతిభాశాలియగు పినవీరభద్రుఁడు ఈ మహామహుని కిరణస్ఫురణ కొంతవఱకుసోఁక రాకాసుధాకరుని పగిది మనోజ్ఞకవితా .చంద్రికలు వెదజల్లి యానాఁటి కవిలోకమునకు వందనీయు డయ్యెను తరువాతి మహాకవులగు పెద్దనాదులు శ్రీనాథుని వాఙ్మయమరీచిపంక్తులఁ గ్రోలియు, వీరభద్రుని మనోజ్ఞమకరందసుధారసములఁ గ్రోలియు కవిత్వ సత్వమును పోషించుకొనిరి. కావున శ్రీనాథుని కాలములో నాకవిసార్వభౌముని తరువాత పేర్కొనఁదగినదికవి వర్యుఁ డీపినవీరభద్రుఁడే యని చెప్ప · సాహసించుచున్నాను.♦ మఱియు ఆంధ్రకావ్యరచనా ప్రణాళిక యందలి వృద్ధిక్షయములను, పరివర్తన పరిణామములను నిపుణముగాఁ పరిశీలించు విమర్శకులదృష్టిలో శ్రీనాథపెద్దనలనడుమఁగల వాఙ్మయాభివృద్ధి భాగము పినవీరుని కావ్యపరిచయము లేకున్నఁ గొఱఁతపడి ఆంధ్రవాఙ్మయచరిత్ర మసంపూర్ణ మగునని నాయాశయము.

---

♦ జైమినిభారతమును వచనకావ్యముగా సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడు రచించెను. ఈఁతడు మధురరాజ్యమును పరిపాలించిన తెలుఁగునాయక ప్రభువుల యాస్థానమున 18 వ శతాబ్ది నుండెనని తెలియుచున్నది. వీనిగ్రంథమును సమగ్రముగా నాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రచురించిరి. వెంకటకృష్ణప్ప నాయకుఁడు చాలవఱకు పినవీరభద్రుని కావ్యమందలి కథాక్రమమును, భాషాక్రమమును ననుకరించి ఆ కవీశ్వరుని పద్యములను అచ్చటచ్చట నుపయోగించుకొనెను.

# పదియవ అధ్యాయము

ఇమ్మడి నృసింహరాయలు-తుళువ నరసరాయలు క్రీ. శ. 1493-1505

## నందిమల్లయ్య-ఘంటసింగయ్య
## ప్రబోధచంద్రోదయము

దూబగుంట నారాయణకవిని గుఱించి వ్రాయు నప్పు డుదయగిరి రాజ్యప్రభువగు బసవరాజును గుఱించియు, మఱి దగ్గుబల్లి దుగ్గనామాత్యునిగుఱించి వ్రాయునప్పుడు బసవరాజుమంత్రియైన చెందలూరిగంగయామాత్యుని గుఱించియు వ్రాయుట తటస్థించినది. ఆకాలముననే మఱియొకగ్రంథ మాసచివాగ్రణియగు *గంగయామాత్యునకే కృతియీయఁబడినది.

నందిమల్లయ్య, ఘంటసింగయ్య యను నిద్దఱు కవులు తాము కలిసి రచించిన "ప్రబోధచంద్రోదయ" మనుప్రబంధము నీగంగయామాత్యుని కంకితముచేసిరి. ఈగ్రంథమువలన బసవరాజునుగుఱించియు, గంగయామాత్యుని గుఱించియు మఱికొన్నిసంగతులు విశదమగుచున్నవి.

మాధవవర్మవంశస్థుఁడైన యీబసవరాజు ఉదయగిరిరాజ్యము నేలుచుఁగళింగాధీశ్వరులైన గజపతులకు సామంతుఁడై వారిపక్షమునఁ దనయావద్బలమును వినియోగించుచుండెను. బసవరాజో లేక యతని తండ్రియగు తమ్మరాజో యుదయగిరి రాజ్యమును గజపతుల కొఱకు జయించి దానిని వారిస్వాధీనములో నుంచిరి. సాళువ నృసింహరాయలు విజయనగర రాజులపక్షమున నాప్రాంతదేశమునంతయు లోఁబఱచుకొనినను ఉదయగిరిదుర్గముమాత్ర మాతనికిఁ గైవసముకాలేదు. కాఁబట్టి బసవరాజు గజపతుల కొకగొప్పప్రాంత రక్షకుఁడుగా నుండెను. ఈవిషయము ప్రబోధచంద్రోదయమున నిట్లు చెప్పబడినది:

సీ. మాధవవర్మ భూమండలేశ్వర వంశ
జలధికి నేరాజు చందమామ

---

* గంగమంత్రి వంశవృక్షము.

(ప్రబోధచంద్రోదయము ననుసరించి)




(నాచికేతూపాఖ్యానము ననుసరించి)



యేరా జుదయశైల మెలమి విభేదించెఁ
గపటాహితమదాంధకార మడఁగ
గజపతి సురధాణి గడిదుర్గముల కెల్ల
నేరాజు వజ్రింపు బోరుతల్పు
మహిమచే నేరాజు మఱపించె నలభగీ
రథ పృథు...రామ రఘురమణుల
నట్టిగుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవక్షమాచక్రి విభునిచేత
మన్ననలు గాంచి మించినమహితుఁ డితఁడు,
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు.

ఈ బసవరాజునొద్ద ప్రధానసచివుఁడుగా నుండిన చెందలూరి గంగయామాత్యుఁడు పెసరువాయవంశస్థుఁడు. ఈయన యదివఱలో నాసికేతూపాఖ్యానము కృతిపొందిన విషయ మీప్రబోధ చంద్రోదయమునఁ గూడ సూచింపఁబడినది.

"ప్రఖ్యాత నాచికేతూ, పాఖ్యానమహాకవిత్వ పరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత, సౌఖ్యా సంఘటితచిత్త శంకరసఖ్యా"

ఈ మంత్రీశ్వరుఁడు రాజనీతియందసమానప్రజ్ఞ గలిగి యుదయగిరి రాజ్యమును దమకుఁ బ్రబలశత్రువులైన విజయనగరరాజులకు లోఁబడకుండఁ గాపాడుటయే కాక యారాజుల దండనాయకుఁడైన సాళువ నృసింహరాయలను దనకు వశునిఁగాఁ జేసికొనెనఁట. "నృసింహ నృపతి వశీకరణయవిద్యాకరణ" అని ప్రబోధ చంద్రోదయమునఁ జెప్పఁబడినది. ఈవశీకరణవిధాన మేదో యిదమిత్థమని గ్రంథమున లేదు కాని సాళువనృసింహరాయ లొకానొకసమయమున యుద్ధములో జీవగ్రాహముగా పురుషోత్తమ గజపతికిఁ జిక్కినట్లు గ్రంథాధార

ముండుటచేతను, రాజనీతికోవిదుఁడగు గంగయ్య తన నయనైపుణ్యమున నిట్లు నృసింహరాయలను పట్టించెనేమోయని యూహింపఁదగియున్నది. ప్రతాపరుద్రగజపతి రచించిన "సరస్వతీవిలాసము" అను ధర్మశాస్త్రగ్రంథములో,

> మిత్రం శేషధరస్య దాతృపరిషద్వస్యైవ సూనో స్సమం
> సౌందర్యాతిశయాళుకీర్తి సమతౌ స్న త్యేతు నైవాపరః:
> జీవగ్రాహ మరింప్రగృహ్య సమరే కర్ణాటభూమీధవం
> దీనోక్తి ప్రవణం నృసింహమనుజా ధీశంపున స్త్యక్తవాన్.

ఈశ్లోకమందలి విషయము ప్రతాపరుద్రుని తండ్రియగు పురుషోత్తమ గజపతినిగుఱించియై యున్నది. దీనినిబట్టి నృసింహరాయలు పురుషోత్తమగజపతిచే జీవగ్రాహముగాఁ బట్టువడెననియుఁ, దరువాత విడువఁబడెననియు స్పష్టపడుచున్నది.

మ. రా. శ్రీ. కం. వీరేశలింగంగారు యీవిషయమునుగుఱించి వేఱభిప్రాయమును గనుపఱచినారు ఆయన తనయాంధ్రకవుల చరిత్రములో నందిమల్లయ్య, ఘంటసింగయ్యలను గుఱించి వ్రాయుచు, "నృసింహనృపతి వశీకరనయవిద్యాకరణ" అను విశేషణమును గుఱించి యీక్రిందివిధముగా నూహించినారు : "గంగయామాత్యుఁడు ముందు జైమినిభారత కృతిపతియైన సాళువ నృసింహరాయలయొద్ద సచివుఁడై యుండినట్లు నెఱుఁగ వచ్చును." ఈయూహ సరికాదని నాకుఁ దోఁచుచున్నది. ఏల యన, గజపతులయొద్ద మంత్రిగా నున్నకాలములోఁ గృతినందిన గ్రంథములో శత్రురాజునొద్దఁ దాను మంత్రిగా నుండినట్లు వ్రాయించుకొనునని యూహించుట యసంగతమని తోఁచుచున్నది. కనుక నృసింహరాయలను జీవగ్రాహముగాఁ బట్టించుటయే గంగమం

త్రియొక్క నయవిద్యాకరణమహత్త్వమని నిర్ణయింపవచ్చును.♦

గంగమంత్రి మహాశివభక్తుఁడును, నిత్యవైదిక సంప్రదాయాచరణుఁడును నని యిదివఱకే మనకుఁ దెలిసినది. ఆయనచిత్తవృత్తి తాను కృతినందిన రెండుగ్రంథములఁ బట్టియుఁ గొంతవఱకు గ్రహింపవచ్చును. నాసికేతూపాఖ్యానము శాంతరసప్రధానమై, యాధ్యాత్మిక విషయ ప్రపూర్ణమై, పుణ్యపాపలక్షణ విచక్షణమై, స్వర్గనరక వివరణ ద్యోతకమై జ్ఞానోపదేశక గ్రంథములలో నగ్రస్థాన మలంకరించుచున్నది. ప్రబోధచంద్రోదయము గూడ నటువలెనే యాధ్యాత్మిక తత్త్వ ప్రభావకలాపమును గథారూపముగాఁ బ్రదర్శించుచున్నది. ఈ రెండు గ్రంథములు కేవల మాముష్మికదృష్టితో జీవయాత్ర గడపుచు ముముక్షుమార్గము నవలంబించెడువారికే యభిరుచియు, నభినివేశమును గలిగించుచుండును. వానినిఁ బ్రత్యేకముగాఁ గృతినొందుటఁ బట్టి గంగయ్యమంత్రి కాధ్యాత్మికవస్తు విచారము మెండుగా నుండియుండవలెను.

ఈ బుద్ధివిశేషము నుద్దేశించియే కాఁబోలు, ప్రబోధ చంద్రోదయమున నీమంత్రిపుంగవునిగుఱించి తదాశ్రిత కవిపండితలోక మిట్లు పల్కెనఁట:

♦పురుషోత్తమగజపతి సాళువనరసింహరాయలను యుద్ధములోఁ బట్టుకొనఁగా అతఁడు అభయయాచనాంజలితో నుదయగిరిరాజ్యము నిచ్చివేయఁగా నతనిని విడిచిపెట్టినట్లు కొడుకగు ప్రతాపరుద్ర గజపతి తనయనంతవరము శాసనములోఁ బ్రకటించినట్లు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగా రీసంవత్సరాంధ్రపత్రిక ఉగాది సంచికలో వ్రాసినారు. శాసనములో నీశ్లోక మిట్లున్నది.

"యస్మై నిత్యతరప్రతాపదహన జ్వాలాయమానధ్వజ
స్తంభా బద్ధకుసుంభరక్తవసన ప్రేక్షావిభగ్నద్విషే:
సంధాయాభయయాచనాంజలి మహోగ్రత్వోదయాద్రింభయా
దాత్మానంముముచే నృసింహనృపతిః కర్ణాటదేశాధిపః"

సీ. "సరిలేని నీతిచాతురిచేత రాజ్యతం
త్రంబును నడపిన నడపుఁ గాని
యనిశంబు పుష్పచందనవనితాదిసౌ
ఖ్యంబుల నందిననందుఁ గాని
సంగీతసాహిత్య సరసవిద్యావినో
దంబులఁ దగిలినఁ దగులుఁ గాని
స్వామిహితాసక్తి సదవనాసదనుశా
సనలీల జరపిన జరపుఁ గాని
నీళ్ళలోపలి సరసిజ నీదళంబు
సరవి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియము లేదు ప్రత్యక్ష శంభుమూర్తి,
యీయనంతయ గంగమంత్రీశ్వరుండు."

కాఁబట్టి యీ యనంతయ గంగమంత్రీశ్వరుం డపారరాజకార్యనిర్వహణలౌకిక ప్రవాహములో మునిఁగి తేలుచుండిన వాఁడైనను, నీటిలోని తామరాకువలెఁ బ్రపంచిక విషయానురక్తి యంటకుండ నిర్లేపుఁడై సంసారయోగివలె మనుచుండెనఁట. ఇట్టినియతాత్ముఁడు నిజాత్మతేజః పుంజంబున నజ్ఞానతిమిరంబును విచ్ఛేదంబుచేసి ప్రబద్ధుఁడైనకతన "ప్రబోధచంద్రోదయ" మనుగ్రంథ మీతని కెక్కుడుసులభముగా బోధపడఁగలదు. కావున నాగ్రంథమును సత్కవులచే నాంధ్రీకరింపించి కృతినందఁ దగినవాఁడని యాశ్రితాశేషశేముషీభూషణబృంద మాశీర్వదించినదఁట:—

ఉ. ఈదృశవర్తనంబునకు నెక్కుడు బోధమగుఁ బ్రబోధచం
ద్రోదయ మాంధ్రభాష నతియోగ్యకవీంద్రులచేత నంకితం
బై దిశలం బ్రసిద్ధముగ నందినఁ గస్తురితావి పైఁడికిన్
మేదురహేమకాంతి ధరణిన్ మృగనాభికిఁ గల్గులాగునన్.

అట్లు బుధాశీర్వాద పురస్కృతుఁడై యీయనూన గ్రంథమును గృతినంద నుద్యోగించి దరినున్న పండితావళి నిట్టి మహనీయగ్రంథము నాంధ్రీకరింప సమర్థు లెచ్చటనైన నున్నారా యని ప్రశ్నింప వారీ కవిద్వయమును పేర్కొనిరఁట—

సీ. కలరు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీతవంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజగో
త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్కు
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థు లీకృతిరాజ నిర్మాణమునకు.

ఆమాటలు విని సంతోషవికసితవదనారవిందుండై మీతలంపు నాతలంపు నేకంబయ్యె నిదియు సరి లేని శుభనిమిత్తం బని వెంటనే యాకవిపుంగవుల నిరువుర రావించి, చిత్రవర్ణాసనంబున నాసీనులం జేసి, శివపూజావిధాన విలిప్తసుగంధపరిమిళితంబైన హస్తంబున కర్పూరతాంబూలంబు లిచ్చి,

క. నేరుపరి పోషించిన
హారము వెల యెక్కు లీల నతిశయముగ నా
పేరఁ దెలిగింపవలయును
సారపుఫణితులఁ బ్రబోధచంద్రోదయముఁ.

అని యాకవిద్వితయమును సవినయముగాఁ గోరెనట. అందులకు వా

రంగీకరించి కృష్ణమిశ్రునిచే రచింపఁబడిన ప్రబోధచంద్రోదయమను గీర్వాణనాటకరాజమును బ్రబంధరూపముగాఁ దెనిఁగింపఁ బూనిరి.

## నందిమలయ్య, ఘంటసింగయ్య

ఈ జంటకవుల వంశాదివిషయముల గూర్చివారు రచించిన రెండుగ్రంథములే మనకు ముఖ్యాధారములు. మొదటఁ బ్రబోధచంద్రోదయమును వ్రాసి గంగయామాత్యునికిని, దరువాత వరాహపురాణమును రచియించి తుళువనరసనాయకునకును నంకితముచేసిరి. ఆగ్రంథముల యవతారికలలో తమకులగోత్రములగుఱించి యిట్లుచెప్పికొనిరి.

ప్రబోధచంద్రోదయమున వీరినిగుఱించి చెప్పిన పద్యము పైన నుదాహరించితిని. వరాహపురాణమున వీరిని గుఱించి యిట్లు చెప్పబడినది:

సీ. అపుడు సభావేదికాగ్రస్థితుల మైన
మమ్ము వాగీశ్వరీమంత్రరాజ
సిద్ధిపారగులఁ గౌశికభరద్వాజగో
త్రుల మహాదేవాంఘ్రిజలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబసూత్రుల
గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల నతిశాంతచిత్తులఁ దనకునా
శ్రితులభాషాద్వయ కృతినిరూఢ
శేముషీభూషణుల నందిసింగనార్య
తనయు మల్లయ కవికులోత్తముని ఘంట
నాగధీమణి కూర్మినందనుని మలయ
మారుతాంకితు సింగయమంత్రిఁ జూచి:

క. మీరిరువురు నెప్పుడును శ
రీరప్రాణములకరణిఁ జరింతురు మిగులం

గూరిమిఁ గృతిఁ బ్రతిపద్యముఁ
జారుఘణితిఁ జెప్పఁగలరు చాటువుగాఁగన్.

పై పద్యములఁబట్టి వీరినిగురించి తెలిసినసారాంశములు:—

నందిమల్లయ్య కౌశికగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; తండ్రిసింగన్న; తల్లి పోచమ్మ; శివభక్తుఁడు, వాగీశ్వరమంత్రోపాసకుఁడు, దక్షిణామూర్తిశిష్యుఁడు. ఘంటసింగన్న భారద్వాజగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; తండ్రి నాగన్న; తల్లిఅమ్మలమ్మ; శివభక్తుఁడు; వాగీశ్వరీ మంత్రోపాసకుఁడు; అఘోరశివశిష్యుఁడు.

ఈఘంటసింగయ్యకు మలయమారుతకవి* యని ప్రత్యేకబిరుదాంకము గలదు ఈతఁడు నందిమల్లయ్యకు మేనల్లుఁడు కాఁబట్టియీయిద్దఱు కవులునొక్కకుటుంబములోనివారు.

♦ వీరిద్దఱును ఎల్లప్పుడును శరీరప్రాణములవలె అభేదాధ్యవసాయమున నుండిరి. వీరు రచించిన గ్రంథముల యాశ్వాసాంతగద్యములలో సైతి మిద్దరిపేర్లును చెప్పికొనిరి: "ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసార సారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్రమల్లయమ

*మలయమారుతకవి యని బిరుదు బహుశః ఈతనికవిత్వమందలి గుణవిశేషమువలన వచ్చియుండును. మలయమారుతమందు శైత్యము, సౌరభ్యము, మృదుత్వమును న్నట్లు తెలిసిన విషయమే. ఈతని కవిత్వమందు నీగుణ విశేషములే యుండుటచేత ఈ బిరుద మీయఁబడినది. మొత్తముమీఁద ప్రబోధచంద్రోదయ వరాహపురాణముల లో కవిత్వము చాలమృదువుగాను, సమరసభావయుతముగాను నుండుటచే హృద్యమై యీబిరుద నామమునకీతఁడు తగినవాఁడని చెప్పవచ్చును.

♦ కవులు కవలుగానుండుట యొక ప్రతిభాగౌరవవిశేషమని తలంపఁబడుచుండిన యీకాలమున జంటకవుల కృతినిర్మాణపద్ధతులు సులభగ్రాహ్యములు. ఈకాలమున విడికవులకంటె జంటకవులపేర్లే లెక్కకుమిక్కిలి యున్నవి. తిరుపతి వెంకటేశ్వరకవులు సుప్రసిద్ధులు, వారివెంబడి నెన్నియో జంటలు పెరిఁగినవి, రామకృష్ణకవులు శేషాద్రి రమణకవులు, వెంకటపార్వతీశ్వరులు, కొప్పరపుసోదరకవులు ఇత్యాదులు.

నీషితల్లజ మలయమారుతాభిధాన ఘంటనాగయప్రధాన తనయ సింగయ కవిపుంగవ ప్రణీతం బైన..."

కృష్ణదేవరాయలకాలములోనివాఁడైన నందితిమ్మన్న లేక ముక్కుతిమ్మన్న అను కవీశ్వరుఁడు తాను రచించిన "పారిజాతాపహరణము" అను కావ్యమును కృష్ణదేవరాయల కంకితముఁజేసి తన కుల గోత్రములఁ జెప్పికొనుచు 'మలయమారుతకవి' యని బిరుదనామము కల, యీఘంటసింగయ్యకుఁ దాను మేనల్లుఁడనని చెప్పికొనెను.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుఁడు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహార సన్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురు శిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నాంధ్రభాష
నాదివాకర తారాసుధాకరముగ.

కాబట్టి యీకవులవంశము పండితవంశమై పెక్కండ్రు కవిపుంగవులచే శోభితమైయుండెను. నంది సింగయ్య, ఘంట మల్లయయును కవులుకూడ నుండినట్లు తెలియుచున్నది.

ప్రబోధచంద్రోదయము

ప్రబోధచంద్రోదయ మను గీర్వాణనాటక మొక ప్రత్యేకమైన

విచిత్రగ్రంథము, సామాన్యముగఁ గావ్యనాటకములందు మానవజాతు లలోని స్త్రీపురుషులలో, లేక నిలింపవర్గములోని స్త్రీపురుషులో పాత్ర ములుగా నుండి కథాక్రమమును జరిపింతురు. ఈగ్రంథమం దట్లుగాక మానవస్వభావమందుండెడు సుగుణదుర్గుణములే పాత్రములుగా నుండి, మనుష్యుని యాధ్యాత్మికజీవిత నాటకము ప్రదర్శింపఁబడుచున్నది. కావున నీ గ్రంథమందలి పాత్రములు ప్రతిపురుషుని యందును, బ్రతి స్త్రీయందును స్వాభావికముగా గోచరించుచున్నవియే. ఈనాటకము గ్రహించుటకు మనుష్యస్వభావము తప్ప మఱియేగ్రంథముల బరిశీలింప నక్కఱలేదు. మహాభారతమందుఁ గౌరవులకును బాండవులకును శ్రీమ ద్రామాయణమందు రామరావణులకును ఘోరయుద్ధము జరిగినట్లుగ నీప్రబోధచంద్రోదయమందు మానవప్రకృతియందలి సుగుణదుర్గుణము లకు నిత్యము జరుగుచున్న సంకులసమరము నిరూపింపఁబడినది. ఇట్టి యధ్యాత్మిక యుద్ధములు సమస్తదేశములవారును దమతమ మత గ్రంథములందు వ్రాయుచుండుట తఱచు కానంబడునుగాని రసప్రధానము లగు కావ్యనాటకములయం దిట్టి విలక్షణపాత్రములచేఁ బరస్పరవిజి గీషా సంఘట్టనము నిరూపించుట చాల నరుదు.

ఆంగ్లేయభాషలో 'బనియను' అను మహామేధావి యొకఁడు "యాత్రికుని పర్యటనము" (Pilgrim's Progress) అను వచన గ్రంథమును వ్రాసెను. ఆయాత్రికుఁడు క్రైస్తవుఁడు. అతనియాత్ర భూలోకమునుండి స్వర్గలోకమునకు. ఆదారిలో నతనికి సంభవించిన యానుకూల్యాంతరాయములును, సుఖదుఃఖములును బహుచతు రతతో వర్ణింపఁబడినవి. జర్మనీభాషలో "గీతే" అను సుప్రసిద్ధ కవి పుంగవుఁడు 'ఫాస్టు' అనెడు లోకోత్తరమైన నాటకరాజమును తనయ వసాన దశయందుఁ బూర్తిచేసి మానవజీవిత మంతయు నుత్తరోత్తరాభి

వృద్ధి సూచకముగాను, మహాదాదర్శలక్షితముగాను సన్యాపదేశ గర్భితముగాను జితించెను.

సంస్కృతభాషయందే యీప్రబోధచంద్రోదయమునకుబోటీగా "సంకల్పసూర్యోదయ"మను పేర శ్రీవైష్ణవమత పరివ్రాజకవర్గములో నొకరగు వెంకటనాథవేదాంతదేశికులవారు రచించినారు. ప్రబోధచంద్రోదయమందద్వైతమతము నిర్ధారింపఁబడినట్లు సంకల్పసూర్యోదయమున విశిష్టాద్వైతమతము స్థాపింపఁబడినది.

పైఁ బేర్కొనఁబడిన ప్రసిద్ధగ్రంథములతో సమానముగాఁ జెప్పఁదగిన మఱియొకగ్రంథ మాంధ్రవాఙ్మయమందే యున్నది. అది పింగళి సూరనార్యుఁడను కవిశిఖామణి రచించిన "కళాపూర్ణోదయము" ఇందు మనుష్యుని ఆధ్యాత్మిక జీవితచరిత్రము సామాన్యశృంగారరస ప్రధానమగు కథలో నంతర్లీనము చేయఁబడి యతిచతురముగాఁ గూర్పఁబడినది. దీనిలో సైతము మనుష్యుని ఆధ్యాత్మికతత్త్వమందలి సుగుణదుర్గుణములపోరాటము ఛాయారూపముగాఁ జిత్రింపఁబడినది

కాని పైఁ బేర్కొనఁబడిన అంతరార్థకథాగ్రంథము(allegories) లన్నిటిలో కథా విస్పష్టతలోను, పాత్రరసపోషణములోను, క్రమనిర్వర్తలోను అపారజ్ఞానవిజ్ఞాన సంపత్తిలోను ప్రబోధచంద్రోదయము మిన్నయని చెప్పక తప్పదు. ఈనాటకమందుఁ జరిత్రాత్మకమైనవిగాని, సాంఘికమైనవిగాని అన్యోపదిష్టభావము లంతర్నిబద్ధము లగుటలేదు. కావున కథానిర్మాణము చాలవిశదముగాను, నిరాడంబరముగాను గల్పింపఁబడినది.

## కృష్ణమిశ్రుఁడు

అసమానమైనదియు, నద్వితీయ మైనదియు నగు నిట్టి నాటకరాజమును కల్పించిన మహామహుఁడు కృష్ణమిశ్రుఁడను కవివర్యుఁడు.

ఈకవివుంగవుఁడు క్రీ. వె పదునొకొండవ శతాబ్ద్యంతమున నుండినట్లు కానఁబడుచున్నది. ఈతనిగుఱించిన కాలనిర్ణయాదుల కాధారము లీగ్రంథమందే కొంతవఱకుఁ గాన్పించుచున్నవి. ఈనాటకమందలి ప్రస్తావనభాగములో నటీసూత్రధారు లీనాటక రచనమును గుఱించియు, నాటక ప్రయోగమును గుఱించియు సవిస్తరముగా, సవిశేషముగాఁ బ్రస్తావించియున్నారు. వారి పరస్పర సంభాషణాదికముచేఁ దెలియ బచ్చిన చరిత్రాంశము లేవన:—

చంద్రవంశపురాజైన కీర్తివర్మయను నృపాలుఁడు చేదిదేశపు ప్రభువైన కర్ణునిచే పరాజితుఁడై రాజ్యమును గోల్పోయెను. పదంపడి కీర్తివర్మ మహీపాలుని సేనానియైన గోపాలుఁ డను భూసురోత్తముఁడు కర్ణుని నోడించి కీర్తివర్మను మరల రాజ్యస్థాపితునిఁ జేసెను. ఈగోపాలుఁడు బ్రాహ్మణుఁ డగుటచే యుద్ధానంతరమునఁ దనసహజమైన శాంతరసమును పొందినవాఁడై, క్షత్రియకుల హంతయైన పరశురాముని వలెఁ దనయుజ్జ్వల కోపాగ్నినిఁ జల్లార్చుకొని శాంతజీవితమును స్వీకరించెను. ఆయన యాజ్ఞానుసారముగా నతని గురువగు కృష్ణమిశ్రునిచే నీనాటకము రచింపఁబడి కీర్తివర్మ భూపాలుని సమక్షమునఁ బ్రదర్శింపఁబడవలసి వచ్చినది.

ఈకీర్తివర్మ చాండిల్యవంశస్థుఁడైనట్లును, క్రీ వె. 1098 సం॥ ప్రాంతములో రాజ్యము చేయుచుండినట్లును కొన్నిశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. అంతియకాక ఈతని శత్రువైన కర్ణుఁడు పడమటిచాళుక్య రాజులలో నొకఁడగు త్రిభువనమల్లుఁడు, లేక విక్రమాంకదేవుఁడను పేరుగల నృపాలునకు సమకాలికుఁడైనట్లు బిల్హణ చరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది:

కాలః కాలంజరగిరిపతేర్యః ప్రయాణే ధరిత్రీం
తుఙ్గారాణాం ఖురపుటరవైః క్ష్మామవశూన్యాంచకార.

శ్రీదాహాలక్షితిపరివృఢః సోఽపియం ప్రాప్యవృత్తమ్
కర్ణః కర్ణామృతరసభరాస్వాద మంతస్తతాన.

(బిల్హణ—విక్రమాంకదేవచరిత్ర)

అనఁగా బిల్హణుఁడు దాహాళదేశపురాజైన కర్ణునికడకు వెళ్ళి సన్మానమును బొందెను. ఈబిల్హణుఁడు విక్రమాంకదేవుని యాస్థానకవియై తనవిక్రమాంకదేవ చరిత్రమును ఆరాజున కంకితముచేసెను. విక్రమాంకదేవుఁడు క్రీ. శ. 1076 మొదలు 1126 వఱకు రాజ్యము చేసినట్లుగాఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి కర్ణుఁడు, విక్రమాంకదేవుఁడు, కీర్తివర్మ వీరుముగ్గురు సమకాలికులగు ప్రభువు లని యేర్పడుచున్నది.

ఇట్లుండఁగా కీర్తివర్మ నరపాలుని యాస్థానకవియగు కృష్ణమిశ్రుఁడు బహుశః విక్రమాంకదేవుని యాస్థానమునకును బోయి యాతని వలన రాజపోషణాది సత్క్రియలను బొందెనాయని సంశయము గలుగుటకొక యాధారము కానఁబడుచున్నది.

శ్రీవిక్రమాంకో జగతీతలేఽస్మిన్
జీయాన్ మనుప్రఖ్యయశా నరేంద్రః,
ప్రపోష యం కోటిసువర్ణతో వా
సబాంధవం సప్తతివత్సరాణి

(కృష్ణమిశ్రః-ఫలరత్నమాల)

అని యొకానొక కృష్ణమిశ్రుఁడు తన ఫలరత్నమాల యను జ్యోతిషగ్రంథమున వ్రాసికొనెను. ఆకృష్ణమిశ్రుఁడును, మననాటక కర్తయగు కృష్ణమిశ్రుఁడును ఒకఁడా, కాఁడా యని నిర్ణయింపఁదగినది.

ప్రబోధచంద్రోదయ నాటకనిర్మాతయగు కృష్ణమిశ్రుఁ డొక మహాపండితుఁడైన సన్న్యాసియనియు, అతని కనేకులు శిష్యులుండి

రనియు, వారిలో నొకశిష్యుఁడు వేదాంతవిషయములను చదువనొల్లక కావ్యనాటకాది గ్రంథముల మాత్రమే చదువుచుండెననియు, అతనికి వేదాంతమార్గ ముపదేశించుటకుఁ గృష్ణమిశ్రుఁడు వేదాంతసారము నీప్రబోధ చంద్రోదయ నాటకరూపముగా రచించినాఁ డనియు, నొక విద్వత్సంప్రదాయ క్రమాగతగాథ కలదు మొత్తముమీఁదఁ గృష్ణ మిశ్రుఁడు ఔత్తరాహుఁడును, గౌడదేశస్థుఁడును నగు కవివర్యుఁడు క్రీ. వె. పదునొకండవ శతాబ్దాంతమున నుండినవాఁడు; అతఁడు విష్ణు భక్తుఁడు, వేదవేదాంతాభ్యాసకుఁడు; నిర్మలయశస్కుఁడు, వైదికా చారతత్త్వకోవిదుఁడు, మృదుమధుర కావ్యరచనానిపుణుఁడు, వాణీ విశారదుఁడు, అప్రతిమభావభావనా విచక్షణుఁడునై గీర్వాణ వాఙ్మయ మందక్షీణకీర్తి సంపదల గడించెను.

## కథాసారము

జ్యోతిర్మయంపుఁ గోటలును, అమృతంపుఁ బరిఖలును, నైర్మల్యంపు మేడలును గల చిదానందనగరియందు ఈశ్వరుఁ డనురాజు రాజ్యపాలనము చేయుచుండెను. అత నికి మాయయనెడు పట్టమహిషివలన మనస్సు అనెడు తనయుఁడు కలిగెను. ఆరాజ కుమారునకుఁ బ్రవృత్తి యనియు, నివృత్తియనియు నిద్దఱుభార్యలు గలరు. ప్రవృత్తి దేవివలన మహామోహుఁడు మొదలగు సుతులును, నివృత్తిదేవివలన వివేకుఁడు మొదలగు పుత్త్రులును జనించిరి.

ఈ యిరువురు సపత్నుల పుత్త్రులయందును సమానమగు రాజ్యకాంక్ష యుద్భ వించినకతనఁ గౌరవపాండవులకు రాజ్యవిషయమునఁ బోరు కలిగిన ట్లీయుభయపక్షు ములవారికిని భువనైకాధిపత్యముకొఱకు నిరంతరము తగవు గలుగుచుండెను. జ్యేష్ఠవర్గ మగు మహామోహాదులయందు జనకునకుఁ బక్షపాత ముండుటచే వివేకాదులు సమర మున నిలువలేక చెల్లాచెదరై పాఱిపోవలసివచ్చెను.

మహామోహుఁడు రాజ్యమునుస్వీకరించి సాపత్న్యులగు వివేకాదులను నిర్మూ లముచేయ నుద్దేశించి వారెక్కడెక్కడ దాఁగియుండిరో వెతకించుటకుఁ జారులను బంపెను. వారు విశ్వంబునంగల పురంబుల నన్నిట నెమకి, యచ్చటచ్చట వివేకాదులు ఘాడసూపుట వినినవారై తమగేలికకు విన్నవించిరి. మహామోహుఁ డుగ్రుఁడై పేరో

లగంబునఁ దనతమ్ముల విలోకించి వివేకాదుల నెట్లు భంజింపవలయునో తగు నుపాయంబులఁ దెల్పుఁడని, సోదరామాత్యవర్గంబుల కాజ్ఞాపించెను. అందుఁ గాముఁడు తన యద్భుతప్రాభవంబునుఁ బ్రకటించుకొనుచు వాసంతిక నవమల్లికా వికసితవల్లీమతల్లులవలె నుల్లసిల్లెడు పల్లవాధరలు దన బలానీకంబులో నుండ వివేకాదు లెట్లాహవంబున నిలువనోపుదురని యుత్కటగర్వంబునఁ బ్రగల్భించెను.

మహామోహమహారాజు సభాంతరమున రహస్యాలోచనము చేయుచున్న సమయంబున దుర్గుణుఁడను వేగులవాఁడు వచ్చి వివేకమహారాజుపనిషద్దేవిని పునఃపరిగ్రహించుటకును, ఆ యిరువురి సంయోగమువలన విద్యాప్రబోధచంద్రు లుదయించుటకును వలయుప్రయత్నములు జరుగుచున్నవనియు, నవి నిర్విఘ్నముగా నెఱవేఱుటకు శమదమాదులు సకల పుణ్యతీర్థంబులకుఁ బోయి దేవతాప్రార్థనంబులు చేయ సమకట్టి యున్నారనియు పిడుగువంటివార్త వినిపించెను. మహామోహుఁడు భయవిహ్వలుఁడై తన ముఖ్యసచివుఁడగు దంభుని జూచి, "మిత్రమా, పుణ్యతీర్థంబులలోఁ బ్రశస్తమగు కాశీనగరంబునకుఁ బోయి వివేకుని ప్రయత్నంబులకు భంగము గావింపవలయు" నని చెప్పిపంపెను.

మహామోహుఁ డొనరించిన యాలోచనంబును, దంభాదులకు నియోగించిన యాజ్ఞావిశేషంబులును రహస్యముగాఁ గనిపెట్టి సదాచారుఁ డనెడు చారుఁడు తద్వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు వివేకమహారాజునకు నివేదించెను. ఆమహీవల్లభుఁడు చింతాకులుండై తన యగ్రమహిషియగు మతిని రావించి యీయుదంతమును సర్వంబు నామెకు విన్నవించెను. విద్యాప్రబోధచంద్రు లెట్లుద్భవింతురని యామె ప్రశ్నింపఁ దనతోఁ గలహించి చిరవియోగానలమునఁ గృశించుచున్న యుపనిషద్భామినికిఁ దనతోఁ బునఃసమాగమము గలిగెనేని విద్యాప్రబోధచంద్రులు ప్రభవింతురని చెప్ప నాసాధ్వీలలామ సపత్నీపునరాగమమున కియ్యకొనెను.

మహామోహునిచే నాజ్ఞాపితుఁడై దంభుఁడు వారణాసీపురవరంబున కేఁగి, యచ్చట నివాస మేర్పఱచుకొని రాజకార్యనిర్వహణ దీక్షితుఁడై యుండెను. కొండొక దివసమున నొకానొకపురుషుఁడు వానియింటికి యాదృచ్ఛికముగా నేతెంచి, యాతిథ్యమును గ్రహింపనొల్లక దురహంకృతి, గనుపఱుప, వారి కిరువురకు జరిగిన సంభాషణక్రమమున నానూతనపురుషుఁ డహంకారుఁడని తెలియవచ్చినది. అప్పుడు దంభుఁ డహంకారమునకు మ్రొక్కి నను లోభునికుమారుఁ డనియుఁ, గావున నహంకారునకు మనుమఁ డనియు బాంధవ్యమును జెప్పికొనెను. పిమ్మట నిరువురును దమతమ యాచర

ణీయవిషయములను దెల్పుకొని మహామోహుని యాజ్ఞానుసారముగ నుభయులును కాశీక్షేత్రమునకు వచ్చిన ట్లెఱింగించిరి.

ఇట్లుండ మహామోహమహారాజా సమయమున కాశీపురంబున సపరివారంబుగఁ బ్రవేశించెను. దంభాది బంధువర్గమును, క్షపణకబౌద్ధకాపాలికాది పరివారనికరమును నామహారాజును జుట్టికొని సంతోషసంభ్రమ కోలాహలంబునఁ జెలరేఁగిరి. మహామోహమహారాజు బంధుమిత్రానుచరులకుఁ దననాస్తికమతప్రకారమును సర్వంబు నుద్బోధించి శరీరము వేఱనియు, నాత్మ వేఱనియుఁ జెప్పు వేదవాక్యము లబద్ధములనియుఁ, బంచభూతపరిపాక ప్రాప్తచైతన్యమగు నీయొడలే యాత్మయనెడు సిద్ధాంతము సత్యమనియు వాక్రుచ్చి, వేదచోదిత కర్మాచరణచణులను నిర్మూలము గావింప వలసినదని మేఘనిస్వనిత గాంభీర్యమునఁ జెప్పుచుండఁ, దన మతాచార్యవర్యుఁడగు చార్వాకుఁడు శిష్యసహితుఁడై విచ్చేసి, మహారాజును దీవించి, సమస్తము దేవరపంపున సాధింపఁబడెనని నివేదింప, మహామోహుని సమస్తరాజన్యలోకము గడుంగడు సంతసించె. విష్ణుభక్తి యను కల్లరిపిల్లమాత్ర మింకను లొంగకుండ నిలుగులు పెట్టుచున్నదని కొంతసంకోచముగాఁ జెప్పిన చార్వాకునిమాటలు విని మహామోహుఁ డించుక నిట్టూర్పు నిగిడించి, యామూర్ఖురాలు పట్టినపట్టు విడువదుగాని కామక్రోధాదులముందట నామె త్రుళ్ళిగింతలు సాగవని యూఱడిల్లి, అయినను శత్రువర్గములోనిదైన నిసువునైనను నుపేక్షింపఁగూడదని తనభృత్యవర్గమును హెచ్చరించెను.

అంతలోన నొకప్రతీహారి వచ్చి పురుషోత్తము దేవాలయమున నున్న మదమానులు దేవరవారి కొకవిజ్ఞాపనపత్రికఁ బంపిరని చెప్ప, మహామోహమహారాజా పత్రికఁ గైకొని శ్రద్ధయును, ఆమెదుహితయగు శాంతియును గలసి వివేకమహీవల్లభునకును ఉపనిషద్భామినికిని బొత్తు గలుగునట్లు దౌత్యము నడుపుచున్నారనియు, ధర్మము, వైరాగ్యము మున్నగుపెద్ద లీకార్యసంఘటననిమిత్తము సహకారులుగా నున్నారనియును వ్రాసినసంగతులను జదివికొనెను. పిమ్మటఁ గామక్రోధలోభులను బిలిచి ధర్మమును గట్టిపెట్టుమని కామునికిని, శాంతిని బంధింపుమని క్రోధలోభులకు నానతిచ్చి శ్రద్ధను వశీకరించుటకు నాస్తికత తప్ప వేఱొకరు సమర్థులు గారనియూహించి, మిథ్యాదృష్టి పేరం బరఁగు నాస్తికతను తోడితెమ్మని విభ్రమావతి యనుదాసిం బంపెను. ఆమె శీఘ్రముపోయి మిథ్యాదృష్టిని దోడ్కొనివచ్చెను. అంత మహామోహ భూకాంతుఁడు తన కత్యంతప్రియవిలాసిని యయిన మిథ్యాదృష్టిని జూచి పరమానందభరితుఁడై యామెను గౌఁగిట గ్రుచ్చిగ్రుచ్చి యాలింగనస్పర్శసుఖమునఁ జొక్కిచొక్కి కొంతదనుక నామెతో శృంగారలీలల నోలలలాడి తుద కామెతోఁ దాను పనివడి రప్పించిన కా

ఈ కవు లిద్దఱిలో నెవరికవిత్వ మెట్టిదో నిర్ణయించుట కాధారములు లేవు కాని వీరిలో రెండవవాఁడగు ఘంట సింగయ్య మలయమారుతకవి యను పౌరుషాభిధానము గలవాఁడై, కవితావిషయముల నెక్కుడు గౌరవమున కాస్పద మయ్యెనని యూహింపఁదగును. అట్లయిన నంది మల్లయ్య యను మొదటివాఁడు కవిత్వవిషయములోఁ గణనీయుఁడై యుండును. వెనుకఁ బినవీరన గుఱించి వ్రాయుటలో "కుకవి మల్లకషణ కుశలిహ స్తపల్లవుఁడ" నని యాకవి యహంకృతిని నాత్మస్తుతి చేసికొనె నని, యాతనిచే నోఁడిపోయిన మల్లన కుకవి యెవ్వరై యుండురో యని నేను ప్రశ్నించితిని. ఆ ప్రశ్నమునకు సమాధాన మీ నందిమల్లయ్య యగునేమో యని నాకు గొప్ప సందేహము కలుగుచున్నది. ఏలనఁగాఁ, బినవీరన సాళువ నరసింగరాయలయొద్ద నుండుటయు, నందిమల్లయ్య యతని దండనాయకుఁడైన తుళువ నరసరాయలయొద్ద నుండుటయుఁ జూడ వీరికి తఱచుగా సారస్వతసమరములు గలుగుచుండెడివేమో యని తోఁచెడిని. ఆ సమరములలో బినవీరన వజ్రపాణియై ఘంటసింగయ్యను దాఁకలేక, మెత్తనివానిని మొత్తుటయే మహాపౌరుష లక్షణమని తన బెట్టిదంపు దిట్టతనము నంతయు నీమల్లన మీఁదఁ బ్రయోగించి యుండును.

పినవీరభద్రుఁ డెంత గర్వించినను నీ మహాకవు లిద్దఱు వాణీవిశారదులు, పదవాక్యప్రమాణజ్ఞులుఁ సరస కవితానిష్ఠాత్ములు, నిర్దుష్టప్రవర్తనాదర్శప్రబోధకులు, గావున వీరి గ్రంథము లాంధ్రసోదరులు సాదరముగఁ బఠింపవేఁడుచున్నాను.

# పంద్రెండవ అధ్యాయము.

## మనుమంచిభట్టు—హయలక్షణవిలాసము.

మనుమంచిభట్టారకుఁడు రచించిన హయలక్షణవిలాసము-ఓబలరా యనికొడుకగు కంపరాయనికి నంకితము చేయఁబడినది. ఏతద్గ్రంథములోఁ గంపరాయనిగుఱించి చేసినవర్ణనములలో సాళువవంశబిరుదములన్నియుఁ గూర్పఁబడియుండుటచే నీతఁడును సాళువవంశస్థుఁ డని యూహింపఁబడుచున్నది. మీసరగండ, బర్బరబాహా, రాయచౌహత్తమల్ల, ధరణీవరాహ, మోహనమురారి, కఠారిరాయ, కఠారిసాళువ,-ఇత్యాదిబిరుదములన్నియు సాళువనృసింహరాయలును నాతనిదండనాయకుఁడగుతుళువనరసరాయలును ధరించినట్లుగా వారియాస్థానకవు లగుపినవీరభద్రుఁడును, నంది మల్లయ్య ఘంటసింగయ్య కవిద్వయమువల్లను మనకుఁ దెలిసియున్నది. కావున నీబిరుదములను ధరించిన కంపరాయఁడు సాళువవంశములోనివాఁ డని యూహింప వచ్చును. ఆతను దండనాయకుఁ డని తెలియుచున్నది, గాని, యెవరియొద్ద దండనాయకుఁడు గా నుండెనో చెప్పుటకు వీలు లేదు. ఓబలకంపా యని పిలువఁబడుటచే నాతను, ఓబలరాయనికొడుకని స్పష్టము. ఆయోబలరాయఁ డెవరికొడుకో, యేకాలపువాఁడో స్పష్టముగాఁ దెలియదు. సాళువవంశము లోని సాళువమంగునకు ఓబలుఁ డని యొకయన్న యుండెను. కంపరాయఁ డాయోబలుని పుత్రుఁడేమో యని సందేహము గలుగుచున్నది.

పొదిలిపట్టణపు దండకవి లెంబట్టి సాళువనృసింహరాయలును తెలుఁగు రాయలును నొకకుటుంబములోనివారలే యని తోఁచెడిని.

ఆకుటుంబములోఁగూడ నిద్దఱు కంపరాయలులు కాన్పించుచున్నారు. వీరి కెవ్వరికిని ఓబలరాయఁడు తండ్రిగా నుండలేదు.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవులచరిత్రలో మనుమంచిభట్టుకాలము నిర్ణయము చేయలేక ఓబలకంపరాయ డెవఁడోగుర్తింపలేక యట్లే విడిచిపెట్టిరి.

ఇట్లుండ నీకంపరాయనిగుఱించి మఱికొన్ని చరిత్రాంశములీగ్రంథమున నాదృష్టికి గోచరించినవి. వానియథార్థసందర్భములువిచారణీయములు. ఈగ్రంథమందు కొన్నిచోట్ల-పైఁబేర్కొనినబిరుదములు గాక మఱికొన్ని బిరుదములు కాన్పించుచున్నవి. చాళుక్యతిలక, సాళువకంప, చాళుక్య చూడమణీ, రాయగండరగాళీ-యనుసంభోధనము లచ్చటచ్చట నున్నవి. కావున సాళువబిరుదములు వహించిన యీకంపనృపాలుఁడు చాళుక్యవంశములోనివాఁ డని చెప్పవచ్చును. సాళువనృసింహరాయల వంశస్థులు చాళుక్య వంశజు లని చెప్పికొనినట్లు కాన్పింపదు

రాయగండరగాళీ యనుబిరుదము సాళువవంశస్థు లెవ్వరును వహించినట్లు కనుపట్టదు. ఈబిరుదమును గుఱించి మ. రా. శ్రీ. నేలటూరి వెంకటరమణయ్య ఎమ్.ఏ.పి.హెచ్.డి. గారు 1929 స॥జూన్ నెల భారతిసంచికలో వ్రాసిన ఆరవీటివంశచరిత్రమం దిట్లు వ్రాసిరి. "కొటికంటి రాఘవుడు (ఆరవీటితాత పిన్నమరాజు కొడుకు) కంపిలిరాజు సైన్యముల జయించి యాతని రాజ్యసప్తాంగముల హరించి "గండరగూళి" యను బిరుదంబు గొనియె నట. ఆరవీటి వంశరాజులందు గొంద ఱీబిరుదమును ధరించినవారు గలరు. సంగరాంగణచర్య కంపిలి రాయసప్తాంగ గండరగూళి సద్బిరుదాదిసంగ్రహణోజ్వలా' యన్నపద్య భాగము వల్ల దెలియుచున్నది."

ఇంతియే గాక మరియొక చక్కని చరిత్రాంశము నాసూక్ష్మపరిశీ

లనకుఁ గాన్పించినది. ఈగ్రంథమందలి మూఁడవ యాశ్వాసము మొదటి పద్యమున నిట్లున్నది.

క శ్రీకరకటాక్ష విజయ, శ్రీకాంతా, కృష్ణరాయ సిద్ధకృపాణా
స్వీకృతఫలసత్వర పర, భీకరభటయూథ కంపవృథ్వీనాథా.

అనఁగా మంగళప్రదమైన కటాక్షము గలవాఁడా, విజయలక్ష్మి వరించినవాఁడా, కృష్ణరాయునికి సిద్ధమైన ఖడ్గము ధరించినవాఁడా......" యని యర్థ మిచ్చుచున్నది. ఇందు, కృష్ణరాయునికి సిద్ధముగా ఖడ్గమును ధరించినవాఁడా యనుటచే నీకంపరాయఁడు శ్రీకృష్ణదేవరాయల కాలములో నుండి యూచక్రవర్తిక్రింద సన్నిహితదండనాయకుఁడుగా నుండిన ట్లూహింపవచ్చును. నే నెఱిఁగినంతవఱకు, కృష్ణదేవరాయని సైన్యాధిపతులలో నీయోబలకంపరాయని పేరు కాన్పింపలేదు. చరిత్రాన్వేషణపరాయణు లగుపండితోత్తము లీవిషయమును నిర్ణయింతురుగాక!

మనుమంచిభట్టారకుఁడు బ్రాహ్మణుఁడు, భైరవాచార్యుని పుత్రుఁడు. ఏదేశస్థుఁడో చెప్పుట కాధారములు లేవు. పేరునుబట్టి బహుశః కర్నూలు గుంటూరుసీమలవాఁ డని యూహింపవచ్చును. కవితాచాతురీధురీణుఁ డని యు, నిఖలభాషాప్రవీణుఁ డనియు, తాను జెప్పికొనెను. ఈకవి రచించిన హయలక్షణవిలాసము, అయిదాశ్వాసముల గ్రంథ మైనను ప్రస్తుతము మొదటిమూఁ డాశ్వాసములును, నాల్గవయాశ్వాసమునఁ గొంతభాగమువఱకే లభ్యమైనది. కొన్నివ్రాఁతప్రతుల లో, ఆశ్వాసములకు బదులుగా అధికారము లనుపేరు కాన్పించుచున్నది.

ఏతద్గ్రంథమందు, అశ్వప్రశంసయు, ఆవర్తలక్షణంబును, దశక్షేత్ర విభాగంబును, గ్రంథలక్షణంబును, పుండ్రలక్షణంబును, నిదానలక్షణంబును, చికిత్సయును, లవణవిధియును, ఘాసఖాణప్రకారంబులును, గ్రమంబునం జెప్పంబడినవి.

మనుమంచిభట్టారకుఁడు రచించిన గ్రంథభాగ మేగ్రంథమున కనువాదమో చెప్పుటకు వీలు లేదు. ఈగ్రంథమును శాలిహోత్రాది సంస్కృతకవుల యశ్వశాస్త్రములతో సరిచూచి భాషాంతరీకరణవిషయమును నిర్ణయించుటకు నాకాగ్రంథము లెవ్వియుఁ జిక్కుట లేదు. ఈగ్రంథముయొక్క మాతృకను కనిపెట్టి దానికిని దీనికిని గలపోలికలను నిర్ణయించుట యే విమర్శకులైనను జేయఁబూనినయెడల నేతద్గ్రంథ విమర్శనము సమగ్రము కాఁగలదు.♦

మనుమంచిభట్టారకుని శైలి చాల రసవంతముగా నుండి కడు హృద్యమైనది. సామాన్యజనులకు రుచిగలుగని పశుశాస్త్రవిషయమైనను, ఈకవి తనశైలీమాధుర్యముచే మనోరంజకముగాఁ జేయఁగలిగెను. అచ్చటచ్చట చక్కని యుపమాద్యలంకారములు వాడుకచేసియు, ద్రాక్షాఫలగుళుచ్ఛములవలె మనోజ్ఞములగు పదజాలము నుపయోగించియు, హృదయానురంజకముగాఁ జేయఁగలిగెను. నన్నయాదికవులయందువలె సంస్కృతశబ్దజాల మెక్కువగా నున్నను, అన్వయక్లిష్టత గాని, శబ్దకాఠిన్యము గాని కానంబడవు. కావ్యమంతయు, నింపుసొంపుతోఁ గులుకుచున్నది. ఈక్రిందిపద్యముల మురువంపు హరువుం దిలకింపుఁడు.

శా. వేణుక్రౌంచమృదంగదుందుభిలసద్వీవేదనాగోల్లస
ద్వీణావారిద మంజునాదములకున్ వియ్యంబులై యొప్పని
క్వాణంబుల్ గలవాజి యిచ్చు సతికిం గల్యాణముల్ కంపనా
క్షోణీపాలక నుప్రతాప శుభముల్ స్తోత్రైకపాత్రంబులున్.

---

♦ ఈగ్రంథముతో పాటు మఱియొక గ్రంథభాగము గూడ కలసి యచ్చుపడి యున్నది. ఆభాగమును అశ్వశాస్త్రసంబంధ మైనదియే. అది కొంకణపతియగు కన్నరాజున కంకితము చేయఁబడినది. ఆకన్నరాజు మల్లయామాత్యునకును భీమాంబకును పుత్రుఁడు. అతనికి రాయచౌహత్తమల్ల యను బిరుదముగలదు. కవియెవరో తెలియదు.

ఉ. సారపు నీలమేఘములఛాయలు ఛాయలఁబోవనాడి యం
భోరుహకోమలద్యుతికి బొమ్మల బెట్టి ప్రసన్నమైన యం
కూరరుచిప్రభావములఁ బోర జయించి మనోహరాకృతిఁ
వారణ నొప్పుమీరునది వాజులకెల్ల గుమార మన్మథా.

ఆశ్విక సైన్యబల మధికముగా నుండుటచే నశ్వపతులని పేరొం దిన తురుష్క ప్రభువులతోఁ బోరాడుటకు విజయనగరరాజులును, అశ్వ దళములనుగొని విదేశములనుండి తెప్పించుచు వచ్చిరి. అశ్వముల నెక్కుడుగా నుంచుకొనుటచే అశ్వపరీక్ష యవసర మయ్యెను. కావున సంస్కృతములో నున్న శాలిహోత్రుఁడు మున్నగువారు రచించిన అశ్వశాస్త్రగ్రంథములను దేశభాషలలో భాషాంతరీకరింప నవసర మయ్యెను. కన్నడభాషలో అభినవచంద్రుఁడను బ్రాహ్మణకవి క్రీ.శ. 1400 సం॥రం॥లో అశ్వవైద్యమను గ్రంథమును రచించెను. తెనుఁగున మ్రుమంచిభట్టీయశ్వశాస్త్రమును సులభమైన శైలిని రచించి యాంధ్రదేశీయుల కపార మగు మేలొనరించెను.

చ. అరయఁగ సర్వలక్షణ సమంచితమైన తురంగరత్నమే
నరునిగృహంబునం దొకదినంబున నుం దగురీతి నుండు నా
పరమపవిత్ర గేహమునఁ బాయకనిల్చు రమావధూటి శ్రీ
ధరునియురఃస్థలింబలెముదం, బెసలారఁ బ్రసన్నచిత్తయై.

---

# పదమూడవ అధ్యాయము.

---

## సామాన్యకవులు.

విజయనగర సామ్రాజ్యము సంగమవంశపు రాజులతోఁ బ్రారంభించినది మొదలు తుళువవంశపు రాజులా సింహాసనమునకు వచ్చువఱకు అనగా— సుమారు క్రీ. వె. 1300 మొదలు క్రీ. వె. 1500 వఱకును అగు నీమధ్యకాలమందు తత్సామ్రాజ్యములో నభివృద్ధిజెందిన యాంధ్రవాఙ్మయము గుఱించి, ముఖ్యముగా నారాజచంద్రులచేఁ గాని వారి సామంతరాజులచేగాని, వారి యమాత్యులచేగాని పోషింపబడిన ఆంధ్రకవీశ్వరుల చరిత్రములను సవిశేషముగాఁ జెప్పితిని. ఇంక నాకాలమందలి సామాన్యకవులఁ గుఱించియు, గ్రంథోత్పన్నతఁబొంది నామావశిష్టులైన కవిగ్రామణుల గుఱించియు నాశక్తికొలంది యిట జెప్పి యీభాగమును ముగించెద.

(1) తాళ్ళపాక అన్నమయ్య:—ఈతను పదునాల్గవ శతాబ్దములో నించుమించుగా శ్రీనాథుని కాలమున నున్నవాడు. తిరుపతి తామ్రశాసనమునుండి యీవిషయము తెలియవచ్చును.

ఈతను తిరువెంకటేశ్వర శతకమును రచించెను.

చ. అరిసెలు నూనెబూరెలును నౌగులు జక్కెరమండెగల్ వడల్
బురుటలు వాలమండెగల పూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టె బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరత వినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా.

(3) కూచిరాజు ఎఱ్ఱయ్య:— (i) కొక్కోకము (ii) సకల కథానిధానము (iii)సకలపురాణసారము అను మూడు గ్రంథములీత

నివికాన్పించు చున్నవి. వానిలో సకలపురాణసారము యింతవరకు లభ్యము కాలేదు.

సకలకథా నిధానములో:—

సీ. శ్రీవత్సగోత్రవారిధి పూర్ణ శీతాంశుఁ
డగు కూచమంత్రికి నాత్మజుడవు
వివిధాప్త భాషా కవిత్వవాచాప్రౌఢిఁ
బూర్వకవీంద్రులఁ బోలినాడ
వఖిలపురాణేతి హాసకావ్యస్మృతి
చయము రచించిన చారుమతివి
మాపిన తండ్రియౌ మల్లమంత్రికిని గో
త్రోద్ధారకంబు సెప్పిన కోవిదుడవు

గీ రసికులభినుతిసేయ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టి ప్రోడ
వట్లు గావున నొకటి నిన్నడుగ దలచి
యిచ్చుటికి బిల్వ బంచితి నెఱ్ఱనార్య.

సకలపురాణసారమునుండి:—

ఉ. నీరజనేత్రు కృష్ణమృగనేత్రు నవారుణ నేత్రదృష్టి వ
న్నీరదగాత్రు వేదగుణ నిర్మలసూత్రు బురాణభారత
స్ఫారకథాచరిత్రు ఘనపాపనికుంజలతాలవిత్రు దు
ష్పారతపస్సమాధి జితశత్రుఁ బరాశరపుత్రు గొల్చెదన్.

3. చెందలూరి చిక్కయ్య-నాసికేతూపాఖ్యానము:—ఈతడు బహుశః శ్రీనాథుని కాలపువాడని తోచెడిని. శైలిధోరణి తెలియ జేయుటకు మచ్చుపద్యములు:—

సీ. ప్రాలేయ కిరణ బింబస్ఫూర్తిఁ దలపించు
విశదంపుఁ దనుకాంతి దిశలు బ్రాక

జిగినిండఁ దొలకెడు చిగురుటాకులసొంపు
వాటించు ఘన జటాభరము మెఱయ
గాంచన మౌంజీవికాసంబు గెడగూడి
చెలువు సూపుచు మృగాజినము దనర
గమనీయ కోమల కరపయోరుహామున
ప్రకటితంబగు విపంచిక దలిర్ప
గీ. హరికథాలాప శోభితమైన యట్టి
యాననమ్మున ప్రసన్నత నలరుచుండ
గగనమునునుండి సమవర్తి కడకువచ్చె
నమర సంయమి వరుఁడు విద్యాగురుండు
సీ. బహువిధపరిమళ భరితోదకంబుల
జెలువంబు శోభిల్ల జలకమార్చి
నిండారు పండువెన్నెల సోయగము నవ్వ
పసిడి కమ్ములతెల్లపట్టుగట్టి
కబరి భారంబున గన్నె చెంగలువలు
పసమీఱ గొనలు దోపంగజెరివి
తీండ్రించు పసిడి దీధితులచే నమరెడు
నవరత్న మయభూషణములుదొడిగి
గీ. మృగమదము గుంకుమంబును మేళవించి
గంధసారంబుమైనీగె గలయనలది
శ్రీలుమెఱయంగ బరిణయోచితముగాగ
సఖులుకై సేసి తెచ్చిరి చంద్రముఖిని.

**4.** పశుపతి నాగనాథుడు-విష్ణుపురాణము:—ఈతడు వెన్నెల కంటి సూరన్నకంటె ప్రాచీనుడు కావలయును. శ్రీకందుకూరి వీరేశ లింగంపంతులుగారు వెన్నెలకంటి సూరన (విష్ణుపురాణకర్త) కాలము

క్రీ. శ. 1480—90 ప్రాంతమని యసమర్థసాధనములతో సిద్ధాంతపఱచి నారు. కాని తత్కృతిపతియగు బసవయ రాఘవుడు క్రీ. శ. 1526—29 ప్రాంతముల వాడని శాసనములవల్ల కాన్పించుచున్నది. (బటరువర్తు దొరగారి నెల్లూరిశాసనముల 2వ వాల్యూములో కనిగిరిశాసనమును జూడుడు.)

నాగనాథుని గ్రంథమునుంచి మచ్చుపద్యము;—

ఉ. మాసరమయ్యె నంత మధుమాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణ నవరాజ్యవిలాసము వల్లరీ వధూ
హాసము మత్తకోకిల సమంచితపంచమనాద మంజిమ
వ్యాసము జీవలోక హృదయంగమసౌఖ్య వికాసమెంతయున్.

---

# పదునాల్గవ అధ్యాయము.

## సింహావలోకనము.

హిందూదేశమంతయు క్రీ. వె. పదియవశతాబ్దివఱకును హిందూరాజుల పరిపాలనలోనే యుండెను. అటుతరువాత మహమ్మదీయు లుత్తరహిందూదేశమును క్రమశః జయించి, తమవశము చేసికొనిరి. కాని పదమూడవ శతాబ్దాంతమువఱకు వింధ్యపర్వతములు దాటి దక్షిణహిందూస్థానములో ప్రవేశించుటలేదు. కావునఁ బదమూడవ శతాబ్దాంతమువఱకును దక్షిణహిందూదేశమున హిందూరాజ్యములును, హిందూమతమును, హిందూవాఙ్మయమును అవిచ్ఛిన్నముగ విజృంభించియుండెను. తొలుదొల్త "నల్లాయుద్దీను" అను మహమ్మదీయయోధుడు మహారాష్ట్రము ప్రవేశించి. యాదవరాజధాని యగు

దేవగిరిని ముట్టడించి, నుగ్గుజేసెను. అటుతర్వాత నాంధ్రరాజ్యమునకు ముఖ్యపట్టణమగు నోరుగల్లుపై దాడివెడలి, ఘోరసంగ్రామములు జరిపి, భస్మీపటలముగావించెను. పదంపడి భల్లాణరాజులను ద్వారసముద్రమున నేలపాలుజేసి విడిచెను. ఇట్లు దక్షిణదేశమున ముఖ్యమైన మూడు హిందూరాజ్యములును మహమ్మదీయుల దాడికి నిలువలేక, పరాధీనులగుట జూచి, హిందువు లెల్లైన నీతురుష్క మహాప్రవాహ మరికట్టి తమ మతమును, సంఘమును, నాగరికతను, గాపాడు కొనుటకు నిశ్చయించివిద్యారణ్య మాధవాచార్యులవారియత్యద్భుత బుద్ధిచాతుర్యమున, తుంగభద్రాతీరంబున విద్యానగరమను నొకపట్టణమును స్థాపించి, యచ్చట దమతమ బలములను, సన్నాహముజేసి కొని, తుంగభద్రకు దక్షిణమున నున్న దేశమునంతయు దురుష్కుల యొత్తిడినుండికాపాడగలిగిరి. ఈవిద్యానగరము. లేక, విజయనగరరాజ్యమునకు మొదటిప్రభువులు సంగమవంశపురాజులు వీరికాలములో విజయనగరరాజ్యము సతతము మహమ్మదీయులతో బోరాటము సల్పుచున్నను, లొంగిపోక. మహమ్మదీయులను దక్షిణమునకు విస్తరింపనీయక, యడ్డగించి, హిందూరాజ్యములను రక్షించి, హిందూమతమును, హిందూసంఘమును, హిందూవాఙ్మయమును, హిందూకళాశిల్పములను, నిర్మూలముగాకుండ, దేశమందునిలిపి, క్రమక్రమముగా వానిని వృద్ధిపరుపగలిగినది. హైందవజాతీయగౌరవము రక్షించుట కొరకే యేర్పడిన యీ విజయనగరసామ్రాజ్యము తన నియమితకార్యమును నిర్వహించుటకుఁ బ్రప్రథమమునుండియు బాటుపడ సంసిద్ధమయ్యెను.

విద్యారణ్య మాధవాచార్యులవారి సోదరుడగు సాయణాచార్యులవారు హిందూమతమున కంతకును సనాతనగ్రంథమైన వేదములకు గొప్పభాష్యమును రచించిరి. విద్యారణ్యమాధవాచార్యులవారు

స్వీయముగా ననేక మతగ్రంథములను, శాస్త్రగ్రంథములను, సంస్కృతమున రచించిరి. ఇంకను ననేక పండితులను, శాస్త్రజ్ఞులను రావించి వారిని దమ యాస్థానమునందుంచి, హైందవశాస్త్రములను, కళలను బునరుద్ధరించిరి.

ఈ హైందవజ్ఞాన విజ్ఞాన పునరుద్ధారణయందు విజయనగర రాజులుమాత్రమే గాక వారి సామంతరాజులును, మంత్రులును, దండనాయకులును మున్నగువా రొకరికంటె నొకరు మించుటకు బంతములాడినటు లపారమైన యుత్సాహముతోడను, నభినివేశముతోడను బనిచేసిరి.

రాజాస్థానములలో నెల్లను, సంస్కృతకవులను, నాంధ్రకవులను బోషించుట యాచారమైయుండెను. నాచన సోమనాథునకు బుక్కభూపతి యగ్రహారమిచ్చెను, సిద్ధనమంత్రి జక్కనకవినిఁ బోషించెను. సాళువ నృసింహరాజు గీర్వాణకవులగు డిండిమభట్టారకులను, ఆంధ్రకవులగు పినవీరభద్రాదులను దన యాస్థానమున నుంచికొని, వారిచే గొప్ప కృతుల నంకితమొందెను. ఇట్లు సంస్కృతవాఙ్మయముతో బాటుగ నాంధ్రవాఙ్మయమును విజయనగరరాజ్యమున విస్తరిల్లెను.

ఈకాలమున శైవమతమునకుఁ బ్రాబల్యము హెచ్చుగానుండెను. వైష్ణవమత మచ్చటచ్చట గన్పించుచున్నను సామాన్యముగ రాజకీయమతము శైవమేయని చెప్పవచ్చును. సంగమవంశపు రాజులందరును శైవమతావలంబకులు. విరూపాక్షేశ్వరుడు కులదేవతగా గలిగిన వారు. ఐనను నీరాజులు జైనమతమును, వైష్ణవమతమునుగూడ నాదరణతోఁ జూచుచు, వారి దేవాలయములకు భూరివిరాళముల నిచ్చిరి. ఇట్లుండ దిక్కనసోమయాజులు మున్నగువా రుపక్రమించిన హరిహర సమన్వయ మిక్కాలమున ముఖ్యముగా వ్యాపకమునొందినట్లు కాన్పించుచున్నది. జక్కనకవియు, నారాయణకవియు, వెంకటనాథకవియు,

మున్నగువారు, వారి గ్రంథముల హరిహరనాథున కంకితముసేయు టయు, హరిహరారాధనతత్వమును నాచన సోముడు మున్నగువారు ప్రత్యేకించి ప్రస్తావించుటయు నిత్యాది మతసమన్వయ సమదర్శనము లీకాలపు గ్రంథములఁ గోచరించుచున్నవి. మహమ్మదీయమత మోరుగల్లుప్రాంతములలో స్థిరపడినది.

హిందూసంఘమున వర్ణాశ్రమవిధానమును, బ్రాహ్మణుల యగ్రగణ్య స్థితియు ముఖ్యలక్షణములు. ప్రతిగ్రంథమునందును బ్రాహ్మణుల యనింద్యస్థాన ముద్ఘోషితము. ఐనను గ్రీడాభిరామమున గానబడుచున్నట్లు బ్రాహ్మణులలోగూడ గొంతవఱకు నైష్ఠికత్వమునకు, నీతిసంపత్తికిని నిత్యసాంగత్యము కుదురుటలేదు. బ్రాహ్మణులలో నిప్పటికాలములో నున్నట్లు వైదిక నియోగిభేదము కాన్పింపదు. వైదిక వృత్తిలోనున్నను, లౌకికవ్యవహారములలోనున్నను, బ్రాహ్మణులు నిత్యసంధ్యానుష్ఠానములు, యజ్ఞాదిక్రతునిర్వహణార్హతయు, మున్నగు వైదికధర్మములు సమానముగ నిర్వర్తించుచుండిరి. అమాత్యశబ్దము లౌకికోద్యోగ బిరుదమే గాని శాఖాభేదము నిరూపించుచున్నట్లు బరిగణింపరాదు.♦

ఆకాలపురాజులు ప్రతిసంవత్సరమున వసంతోత్సవమును జరుపు

---

♦ ఆకాలమున విజయనగర రాజ్యమునందలి ముఖ్యస్థలములందు సంచారము చేసి తానుజూచిన విషయములను యథాస్థితముగ నభివర్ణించిన 'పేయిస్' అను పోర్చుగీసు దేశస్థుడు ఆనాటి బ్రాహ్మణ్యము గురించి యిట్లు వ్రాసినాడు.

"బ్రాహ్మణులలో రెండు తెగలున్నవి. ఒక తెగవారు పట్టణములలోను బస్తీలలోను రాజకార్యములను చేయుచుండువారు. వీరు వాణిజ్యముకూడ కొంతమంది చేయుచుందురు; మఱియొక తెగవారు మతగురువులుగా నుండుటయు, దేవాలయములపనులయందుండి చాలచదువుకున్నవారై యున్నారు. వీరిని రాజులు చాల గౌరవించెదరు. గ్రామములలోనున్న బ్రాహ్మణులును కొంతమంది యవినీతివర్తనులై రాజపూజితులైన బ్రాహ్మణులకు భిన్నులుగానున్నారు.

చుండిరి. ఆయుత్సవసమయముల నానావిధములగు క్రీడావినోదముల ప్రదర్శించుటయు, ఆంధ్రగీర్వాణకావ్యములు, నాటకములు, మున్నగు వాఙ్మయగోష్ఠి సలుపుటయు యువతీయువకులు చందనాగరు పుష్పాలంకృతులై వసంతకుసుమధన్వుల సమారాధించుటయు, మనోజ్ఞలీలా కౌతుకమున సుఖైకపరులగుచు స్త్రీపురుషులు శృంగారవిలాసమున విహరించుటయును జరుగుచుండెను.

పలనాటివీరుల పాటలు, పంబలవాండ్రి జాతరలు, కోడిపందెములు, పొట్టేళ్ళపందెములు మొదలగు పామరవినోదములు, కర్షక, కార్మిక, జానపదుల యుబుసుపోకల కనుకూలించుచుండినవి.

ఆంధ్రసారస్వత విషయములో నాంధ్రవాణి ప్రభుసన్మానమును విశేషముగ బొందినది. మహారాజులు, సామంతరాజులు, మంత్రులు, దండనాయకులు, వారికంటె తక్కువహోదాగల గ్రామసిర్ణేతలు, మొదలగువారందరును నాంధ్రకవుల సన్మానించుటయు, వారిచేఁగృతులఁ జెప్పించి, యాకృతుల దామంకితము జేయించుకొనుటయు, అట్టి వీశ్వరుల కగ్రహారములను, ఇతర బహుమానముల నొసంగుటయు, నివ్విధమున నాంధ్రసారస్వతసేవ గావించియుండిరి. ఆనాటి యాంధ్రకవులు ముఖ్యముగా సంస్కృతగ్రంథముల నాంధ్రమునకు బరివర్తించుటయ కర్తవ్యమని తలచిరి. మేటికవులు సయితము సంస్కృతముననున్న పురాణములనుగాని, మహాపురుషుల యద్భుత చారిత్రములనుగాని, తెనిగించుటయే తమ జీవితసాఫల్యమని తలంచిరి. సామాన్యముగ సంస్కృతమాతృక లేనిదే యేగ్రంథమును వారు రచించియుండలేదని స్థూలదృష్టిఁ జెప్పవచ్చును. అట్లు విలువయైన సంస్కృతవిద్యను ఆంధ్రదేశీయులకు మాతృభాషయందు సమర్పించుటలోఁ ప్రాయికముగ మతగ్రంథములకుఁ ప్రథమస్థాన మొసగిరి. సోమనాథ శ్రీనాథాదుల గ్రంథములు కించిన్న్యూనాధిక్యములతో మతసంబంధమైనవియే. అటు

తర్వాత నైతికగ్రంథములకు గౌరవస్థాన మీయబడినది. రాజనీతి గ్రంథములు కొన్నియు, పురుషార్థప్రబోధనా గ్రంథములు కొన్నియు, వెలువడినవి. "కామందకీయము" ఇత్యాదులు రాజనీతిగ్రంథములు. "సకలకథానిధానము" ఇత్యాదులు నైతికగ్రంథములు. సామాన్యముగ నేవిధమగు గ్రంథమందైనను నీత్యుద్బోధనమున కవకాశము గల్పించు చుండిరి.

నైతిక, మతవిషయిక. వాఙ్మయమునకుఁ జేరకుండ, ప్రత్యేక ముగ నొకవిధమగు గ్రంథసముదాయ మీకాలమందు పెరిగినది. ప్రజాసామాన్యమున కనురంజకముగా నుండునట్లును, నీతి శృంగార మిశ్రితముగ నుండునట్లును, సామాన్యజనుల తెలివితేటలను మించ కుండునట్లును, వారు విశ్రాంతికాలముల నుబుసుఁబుచ్చుకొనుట కను వగునట్లును, ఒకవిధమగు దేశీయవాఙ్మయము వాడుకలోనికి వచ్చినది. ఈవాఙ్మయములో ముఖ్యముగాఁ జారిత్రికపురుషుల యద్భుత కార్య ములును, కల్పితపురుషుల కేళీవినోదములును, జనరంజకముగా నుండు నట్లభివర్ణింపఁబడినవి. ఈవిధమగు వాఙ్మయము బహుళవ్యాప్తి నొంది యుండుట, ప్రజాసంఘములయందు, జ్ఞానసంపాదన కొఱకు నూతన ప్రబోధము కలుగుటయె కారణమని యూహింపవచ్చును. విక్రమార్క చరిత్రము, భోజరాజీయము, పంచతంత్రము, ద్వాత్రింశత్సాల భంజి కల కథలు, షోడశకుమార చరితము, ఇత్యాది గ్రంథములనేకములు దేశమందంతటను వ్యాపించినవి. ఈకాలమందైనయెడల నిట్టిగ్రంథము లన్నియు సామాన్యముగ వచనశైలిని రచింపఁబడి యుండునుగాని పూర్వకాలమునందు సర్వసామాన్యముగ నన్నివిషయముల యందును బద్యశైలియె వాడుట యాచారమగుటచే నివియన్నియును, సరసకవు లచేఁ బద్యప్రబంధములుగ విరచింపఁబడినవి.

వినోద కథలయందేగాక శాస్త్రవిషయములయందును, బద్య

శైలియె యుపయోగింపఁబడినది. కొక్కోకమను కళాశాస్త్రమును హయలక్షణవిలాసమను అశ్వశాస్త్రమును, ఇత్యాది శాస్త్రగ్రంథములు పద్యకావ్యములుగ వ్రాయఁబడినవి.

ఆంధ్రకవిత్వము దేశీయవాఙ్మయమునం దగ్రస్థాన మలంకరించుటచేతను, ఆంధ్రుల శౌర్యపరాక్రమములు భారతదేశమందు వ్యాపించుటచేతను, ఆంధ్రకవిత్వమునకు స్థిరమైన గౌరవము లభించినది.

గీ. జనని సంస్కృతంబు సకలభాషలకును
 దేశభాషలందుఁ దెలుగులెస్స
 జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
 మెచ్చుటాడుబిడ్డ మేలుకాదె?

అనిన ట్లాంధ్రభాషకును, ఆంధ్రకవిత్వమునకు నపూర్వగౌరవాతిశయము లభించుటచే: గవులసంఖ్యయు, గ్రంథములసంఖ్యయు విస్తారముగ నభివృద్ధినొందినవి. కావున భాషాప్రకృతిని గుఱించియు, ఛందోవిషయముల గుఱించియు, విమర్శనగ్రంథము లవసరమయ్యెను. ఆకారణమున లక్షణగ్రంథములు గొన్ని వ్రాయఁబడినవి: శ్రీధరుడు. తాతంభట్టు మున్నగువారు గొప్ప ఛందోగ్రంథములను వ్రాసి, యనేకులగు కవులగ్రంథములనుండి యుదాహరణములను దమతమ గ్రంథములయందు జేర్చిరి తెలుఁగు బాసయు, తెలుఁగు కవితయు, సంపూర్ణ యౌవనము దాల్చినవి.

శృంగార రసవిషయము.

ఈకాలమందలి యాంధ్ర కవీశ్వరులు సామాన్యముగ శృంగార రసవిషయములయం దతిమాత్రమగు నభిరుచినిగనబరచినారు. తిక్కన సోమయాజులనాటి రసనియమములు వీరు పాటించుటలేదు. బహుశః ఆకాలపురాజులు శృంగారరసావేశపరులై తమయాస్థానమందున్న కవీశ్వరులఁగూడఁ దమయభిమత మార్గములలోఁ గవిత్వముఁ జెప్ప నుద్రేకించిరని తోఁచుచున్నది. కవిసార్వభౌముడగు శ్రీనాధుడు శృంగారరస

లోలుడని తెలిసినవిషయమే. ఇక్కనకవిత్వములో స్త్రీలును, బాలురును, జదువఁగూడనిది కొంతగలదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు తన రెండుగ్రంథముల యందును శృంగారవర్ణనల నత్యధికముగఁ జేసియున్నాడు. క్రీడాభిరామమునందు బచ్చిశృంగారము పొంగి, పొరలి, పారుచున్నది శృంగారరస మధికముగ లేనియెడలఁ గవితయందు రుచియుండదని బహుశః యాకాలమందలి ప్రజలు తలచిరేమో!

ఆకాలమందలి గ్రంథజాలము ముఖ్యముగా గీర్వాణమాతృకల యనుకరణమని యిదివరలోఁ జెప్పితిని. అయినను గొంతవఱకు కవీశ్వరుల స్వకపోలకల్పనా సూచనలు గోచరింపక మానవు. కవీశ్వరుల స్వాతంత్ర్యము కేవలవర్ణనలయందేగాక కావ్యసృష్టియందును గన్పట్టుట విశదముగా నుండెనని "నందిమల్లయ్య ఘంటసింగయ్య కవుల" గూర్చి వ్రాసినపుడు నిరూపించితిని.

ఆంధ్రప్రబంధము గీర్వాణగ్రంథముయొక్క భాషాంతరీకరణము గాక ప్రత్యేకమగు స్వతంత్ర సృష్టి యని చెప్పుట కవకాశము కలుగునట్లుగా నీకాలమందలి కడపటి కవులు తమ కవితా వ్యక్తిస్వాతంత్ర్యముఁ గనఁబరచిరి. స్వతంత్రాంధ్రప్రబంధములు నిర్మించుటలో నల్లసాని పెద్దనాదులకీకాలపుఁ గవులే మార్గదర్శకులు. నందిమల్లయ్య, ఘంటసింగయ్యలు తమ వరాహపురాణములో దుర్జయోపాఖ్యానమును రచించి, మనుచరిత్ర, వసుచరిత్రాదులకు మార్గముఁజూపిరి. కావున రసవిషయములలోను, శిల్పవిషయములలోను, భాషావిషయములలోను, నాంధ్ర వాగ్దేవి కీకాలఁపుఁగవు లపారమగు సేవఁ జేసి, యా పల్కుల జవరాలిని బహువిధములఁ బోషించి, పెంచి, శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని కరుణా కటాక్షముల కొప్పగించిరి. ఆమహీవల్లభుఁడు నిరంతరదేశసేవాపరతంత్రుఁడై, యా భ్రథభారతీమాతకు శాశ్వతముగా నొనర్చిన సపర్యాగౌరవంబుల నాశక్తి కొలఁది నభివర్ణింపఁదొడఁగెద!.

# మొదటి అనుబంధము

## విజయనగర సామ్రాజ్యమందలి సంస్కృతవాఙ్మయము.

(క్రీ. వె. 1330-1500)

పదమూడు పదునాల్గవ శతాబ్దములలో మహమ్మదీయుల దాడి వలన దక్షిణహిందూదేశములందున్న హిందూసంస్థానము లొకటి తర్వాత నొకటి కూలుచు హిందూమతమునకును హిందూనాగరికతకును ప్రళయకాల మాసన్నమయినట్లుండుటచేత దక్షిణమునను న్న హిందూరాజులు చేరి తమ మతమును సంఘమును సంరక్షించుకొనుటకీసామ్రాజ్యము నెలకొల్పిరని యిదివరలోఁ జెప్పబడినది. విద్యారణ్య బిరుదాంకితులగు మాధవాచార్యులవారు విద్యానగర లేక విజయనగరరాజ్య ప్రతిష్ఠాపనముజేయుట ముఖ్యముగా హిందూమతమును మహమ్మదీయుల యొత్తిడినుండి తప్పించుటకొఱకే యని విశదముగాఁ దెలియవచ్చినది. ఆమహాపురుషుని సర్వంకష ప్రతిభ రాజకీయ విప్లవములనుండి విజయనగరసింహాసనమును దప్పించుటయేగాక హిందూమతమును సర్వవిధముల పోషించుటకొఱకుగూడ వినియోగపడెను. రాజ్యమును స్థిరముగా స్థాపించినవెంటనే ప్రథమముననుండియు హిందూమతము నుద్ధరించుటకుఁ బూనుకొనెను. హిందూమతగ్రంథములు సామాన్యముగా సంస్కృతభాషలో నుండినకతన సంస్కృతవాఙ్మయమును బ్రాయికముగాఁ బ్రోత్సహించెను. హిందూమతము నకుఁ బునాదిగానున్న చతుర్వేదములసంహితలు బ్రాహ్మణములు మొదలగు వైదికగ్రంథములకు సర్వతోముఖమైన వ్యాప్తిఁ గలుగజేసెను. విద్యారణ్యస్వాములవారి సోదరుడగు సాయనాచార్యుడు సంస్కృతమున మహావిద్వాంసుడును కంపభూపతియొద్ద యమాత్యుడు

గాను యుండెను. వీరిరువురునుకలసి చతుర్వేదములకు కూలంకషమైన భాష్యమును 'వేదార్థప్రకాశ' యను పేరున సంస్కృతమున సిద్ధము చేసిరి. దానికి సాయనభాష్యమనియు లేక విద్యారణ్యభాష్యమనియు పేరు. ఈమహాగ్రంథము దేశకాలపరిచ్ఛేదముల నతిక్రమించి ప్రపంచ మందు హిందూమత మున్నంతకాలము విజయనగరరాజ్యమును స్మృతి కిఁదెచ్చెడు సనాతనగ్రంథము.

సాయనాచార్యులు గీర్వాణభాషలో మరికొన్ని గ్రంథములను రచించిరి. "ధాతువృత్తి" యను వ్యాకరణగ్రంథమును రచించి తన యగ్రజుడగు మాధవాచార్యులవారి పేరునఁ బ్రకటించిరి. ఈ 'ధాతు వృత్తి' యందు సంస్కృతభాషలో నున్న క్రియాపదముల ధాతుమూలములన్నియు జేర్పబడియున్నవి. విద్యారణ్యులవారి మఱియొకసోదరుడగు భోగనాథుడు తన యనుజన్ములవలెనే గొప్ప సంస్కృత పండితుడు. సంస్కృతమున 'ఉదాహరణమాల' యను గ్రంథమును రచించి యందు తనవంశముయొక్క యఖండప్రతిష్ఠను సముచితముగా వర్ణించుకొనెను. ఈభోగనాథుడు తురీయాశ్రమమును స్వీకరించి భారతీకృష్ణ తీర్థు లనుపేరను శృంగేరీపీఠము నలంకరించిరి.

విద్యానగరరాజ్య స్థాపనాచార్యులను, జగద్గురు శృంగేరి పీఠాధిపతులునగు విద్యారణ్య మాధవాచార్యులవా రాకాలమందలి సంస్కృతవాఙ్మయమున కపారమైన సేవ నొనరించిరి. వారు రచించిన గ్రంథముల పట్టిక జూచిన నామహాపురుషుడు విజయనగరరాజ్య నిర్వహణ భారము ధరించియు వాగ్దేవికి నిరంతర సపర్యల నెట్లు జేయగలిగినదియు మనోగోచరముకాకున్నది. విద్యారణ్యుల స్వాములవారు ముఖ్యముగా మతసంబంధమైన గ్రంథములను రచించిరి. వారు రచించిన చతుర్వేదభాష్యములగురించి యిదివరకే నుడివితిని. అదిగాక 'పరాశర స్మృతి వ్యాఖ్యానము', 'మనుస్మృతివ్యాఖ్యానము', 'జైమినిన్యాయ

మాలా విస్తరము', 'కళామాధవీయము', 'వ్యవహారమాధవీయము', 'శంకరవిజయము', 'సర్వదర్శన సంగ్రహము', యిత్యాది గ్రంథములను పూర్వాశ్రమ దశలో రచించిరి. ఈగ్రంథము లన్నిటిలో 'జైమినిన్యాయమాలావిస్తరము'నకు ప్రశస్తియెక్కువ. మాధవాచార్యులవారు సన్యాసాశ్రమము స్వీకరించి శృంగేరి పీఠాధిపతులైన తర్వాత ముఖ్యముగా వేదాంతగ్రంథములను భగవత్ స్తోత్ర గ్రంథములను మాత్రమేరచించిరి కాని కొదువ వైదికకర్మకాండ విషయములను విసర్జించిరి. "వేదాంత పంచదశి', 'వివర్ణప్రమేయసంగ్రహము', "బ్రహ్మవిదాశీర్వాద పద్ధతి', జీవన్ముక్తి వివేకము", దేవ్యపరాధస్తోత్రము", యిత్యాది యద్వైతమతగ్రంథములను రచించి నిర్గుణ పరబ్రహ్మోపాసకులైరి. వారి నిరవద్య చారిత్రము వాగతీతము గదా!

సాయణమాధవాచార్యుల గ్రంథరచనాశైలి.

ఆంధ్రవిశ్వవిద్యాలయమందలి ప్రధానసంస్కృతాధ్యాపకు లగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులుగారు సాయనమాధవాచార్యుల గ్రంథరచనాశైలినిగురించి యిచ్చిన యభిప్రాయము; "శ్రీసాయణమాధవులు ఋక్సామయజురాది సంహితములకు (నాలుగు వేదములకును) భాష్యములు రచియించి భారతఖండమునకు మహోపకార మొనరించిన మహాపురుషులు. ఒక్కొక్కవేదమునకు వ్యాఖ్యరచించినవారు కొందరు ముందున్నారు. వేదార్థప్రకాశ యశోలక్ష్మి సాయణమాధవులనే వరించినదనుట సర్వజగద్విదితము. వారి భాష్యములే యవతరింపనిచో కడచిన యైదువందల సంవత్సరములలో వేదవేత్తయైన పురుషుడు భరతఖండమున లేకుండబోవునేమో. ఇతరభాష్యములు వీరి భాష్యములవలె సకలార్థబోధకములు కావు. కావ్యములకు మల్లినాథ వ్యాఖ్య యెట్టిదో వేదములకు సాయణమాధవుల భాష్యమట్టిది. అంత

సుఖకరముగా వేదభావములెల్ల వెల్లడించునది మరియొకటి లేదనుట అతిశయోక్తి కాదు.

సాయణభాష్యము ప్రతిపదార్థముమాత్రమే కాదు. అది ఆయామంత్రములకు సంబంధించి వివిధవిషయముల వెల్లడించుచు మంత్రభావముల కరతలామలకములు గావించుచుండును. ఇక శైలి యందుమా కావ్యనాటకములు చదివినవారికందరికినీ గూడ సుబోధకమగునంత సులభముగా నుండును. భాషాకాఠిన్యము మందునకైనను గానరాదు. సాయణభాష్యము చదువునప్పుడు ముందువెనుకలు తడవుకొననక్కర లేకుండగ భావ మవగతమగుచుండుటయే యందలి విశేషము."

## హరిహరరాయలు, బుక్కరాయలు.

వీరికాలములో విద్యారణ్య మాధవాచార్యులవారున్ను వారి సోదరులునుగాక మరియొక మాధవాచార్యుడు మంత్రిగా యుండెను. నామసామ్యమున నీమాధవాచార్యుని విద్యారణ్య మాధవాచార్యుల వారితో పొరబడుట తటస్థించెను. విద్యారణ్య మాధవాచార్యులవారు మాయణుని కుమారుడు, శృంగేరిపీఠాధిపతియగు విద్యాతీర్థులవారి శిష్యుడు. రెండవ మాధవాచార్యుడు చౌండపార్యుని పుత్రుడు, కాశీ విలాసక్రియాశక్తి యను వీరశైవ గురువరుని శిష్యుడు. ఈశివభక్తుడగు మాధవాచార్యుడు, 'తాత్పర్యదీపిక' యను సూత్రసంహిత వ్యాఖ్యానమును, 'శైవామ్నాయ సారము' ను సంస్కృత ప్రబంధమును రచించెను.

విద్యారణ్యులవారికి సమకాలికుడగు శ్రీకంఠపండితుడు బ్రహ్మ సూత్రభాష్యమును, అక్షోభ్యతీర్థులు, జయతీర్థులు అను మధ్వమత గురువులు కొన్ని మధ్వమతగ్రంథములను రచించిరి. వైష్ణవగురువులలో నొకరగు శ్రీవేదాంత దేశికులవారు కంచిలోనున్నను విద్యారణ్యుల వారితో నుత్తరప్రత్యుత్తరములద్వారా అద్వైత విశిష్టాద్వైత వాద

ప్రతివాదములను సలుపుచు వచ్చిరి విద్యారణ్యులవా రద్వైతమత ప్రతిష్ఠాపకులుగా ననేకగ్రంధములు వ్రాసినట్లే వేదాంతదేశికులవారు ప్రతిఘటించి విశిష్టాద్వైత పరముగా ననేకగ్రంధములను రచించిరి. బహుళగ్రంధకర్తలగు శ్రీ దేశికులవారు కొన్నినాటకములను, కావ్యములను గూడ సంస్కృతమున రచించిరి. హంససందేశము. యాదవాభ్యుదయము, శతదూషణి, సర్వార్థసిద్ధి రఘువీరగద్య, పాదుకాసహస్రము, యిత్యాదిగ్రంధముల ననేకములను రచించిరి. గ్రంథరచనమందును, హిందూమతాభినివేశమందును, విద్యారణ్యులవారితో వీరు సములని నొక్కి-వక్కాణింపదగును.

ప్రథమబుక్కరాయుల తర్వాత నాతని కొడుకగు హరిహరరాయులు రాజ్యమునకువచ్చెను. ఈతని రాజ్యకాలములో ముఖ్యముగ నీతని దండాధిపతియు జైనుడునగు, ఇరుగప్ప దండనాథుడు 'నానార్థరత్నమాల' యను నైఘంటికగ్రంథమును కూర్చెను. ఈగ్రంథమందు తాను హరిహరరాయలకు 'ద్వితీయమంతఃకరణ' మనియు (alter ego) రాయలవారు తెలుచు తనమీద రాజ్యభారమునుంచి సుఖించుచుండెడివారనియుఁ జెప్పికొనెను. ఈకాలములోనే చెన్నుభట్లను మహాపండితుడు "తర్కభాషావ్యాఖ్య"ను రచించెను.

రెండవహరిహరరాయుల రెండవపుత్రుడగు విరూపాక్షరాయలు "నారాయణవిలాస"మను నాటకమును, యీ హరిహరరాయుల జ్యేష్ట పుత్రుని కొడుకగు భూపతిరాయలకు మంత్రియగు చౌండపాచార్యులు ఆపస్తంబసూత్రములకు 'ప్రయోగరత్నమాల' యను భాష్యమును విరచించిరి.

ఈరెండవ హరిహరరాయల కాలములో నాతనితమ్ముడగు కంపరాయలు దక్షిణసుల్తానుపై దాడివెడలి యాతనిని దురములోఁ ద్రుంచి మధురాపురమును గైకొనిన విధమంతయును, కంపరాయుని భార్యయగు

గంగాదేవి "మధురావిజయము"ను నొక ప్రబంధమున వర్ణించెను. ఆమ హాప్రబంధ మాకాలపు మహాకావ్యములలో మిన్నయని చెప్పుటకు సందేహింపఁబనిలేదు. శైలిమధురముగాను, లలితముగానుండి, కాళిదాసుని కుమారసంభవాది కావ్యములను స్ఫురింపజేయుచుండును.

రెండవహరిహరరాయల తర్వాత నాతనికుమారుడగు దేవరాయలు రాజ్యమునకు వచ్చెను. ఆతనితర్వాత యతని కుమారుడగు విజయరాయలొక వత్సరముమాత్రమేలి దివంగతుడయ్యెను. ఆపైన యాతనికుమారుడగు ప్రౌఢదేవరాయలు సింహాసనమెక్కి సామ్రాజ్యము నత్యంతప్రౌఢిమతోఁ బరిపాలించెను.

ఈయిరువురి దేవరాయుల కాలములో నాస్థానమహాకవు లనిపించుకొని డిండిమభట్టారక బిరుదమును వహించిన యొక పండితకవి కుటుంబము ప్రాముఖ్యము బొందియుండెను ఈవంశస్థులు ఔత్తరాహులగు గౌడబ్రాహ్మణులు, శైవమతావలంబకులు తొలుదొల్త చంద్రగిరి ప్రభువుల సన్మానమునుబొంది క్రమశః విద్యానగరాధీశుల యాశ్రయము సంపాదించుకొనిరని తోచుచున్నది.

ఈకుటుంబమువారు సంస్కృతమున మహావిద్వాంసులును, గొప్ప కవీశ్వరులై విద్యానగర రాజులచేత నగ్రహారములు, బిరుదములను బడసినవారు. వీరాస్థానకవులగుటచే రాజ్యసంబంధమైన చరితములను, ప్రభుస్తోత్రములను ప్రభువినోదములను రచించి రాజులకానందమును, యశస్సును గలుగజేయుచువచ్చిరి. ఈకుటుంబములో సటరాజదేశికుడు మూలపురుషుడు. ఆతను గొప్పకవీశ్వరుడు. ఆతని కుమారుడు రాజనాథుడు. ఆరాజనాథుని సామర్థ్యవిశేషము లంతగా దెలియరావు. ఆతనిపుత్రుడు అరుణగిరినాథుడు. ఆతనికి డిండిమ కవిసార్వభౌముడని బిరుదము మాతామహార్జితముగ సంక్రమించినది. ఆడిండిమ కవిసార్వభౌమ అరుణగిరినాథుడు ఉభయదేవరాయల కాలములో నాస్థానకవి

గానుండి, 'యోగానందప్రహసన'మను నొకరూపకమును రచించెను. రెడ్డిరాజుల కొలువులోనున్న వామనభట్టబాణుడు తన "శృంగారభూషణము"నఁ బ్రదర్శించినట్లుగా నీకవియు హంపివిరూపాక్షీశ్వరుని తిరునాళ్లలో జరిగెడు శృంగారవిషయములను తనగ్రంథమున నిరూపించెను. ఈడిండిమభట్టునే యుక్కటవివాదమున నోడించి యాంధ్రమహాకవియగు శ్రీనాథుడాతని కంచుఢక్కను బగులఁగొట్టించి కవిసార్వభౌమ బిరుదమును స్వీకరించి, ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో నాచక్రవర్తి సముఖమున కనకాభిషేక గౌరవమునుఁ బడసెను.

"దీనారటంకాల తీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల."

అరుణగిరినాథుని కుమారుడగు రాజనాథ డిండిమభట్టారకుడు సాళువనృసింహరాయల వంశచరిత్రమును "సాళువాభ్యుదయ"మను పేర మహాకావ్యముగా రచించెను. రాజనాథుని కొడుకగు రెండవ యరుణగిరినాథుడు "వీరభద్రవిజయ"మను డిమమును రచించెను. ఆతనికొడుకగు మూడవ రాజనాథ డిండిమభట్టారకుడు అచ్యుతదేవరాయల కాలములో "అచ్యుతదేవరాయాభ్యుదయమ"ను మహాకావ్యమును అచ్యుతరాయల రాజ్యప్రతిష్ఠను గొనియాడుచు విరచించెను ఆతను భాగవతమును చంపూకావ్యముగను రచించెను.

ఇట్టీ యాస్థానకవి కుటుంబము కులక్రమాగత రాజకవీశ్వరులుగా విజయనగర చక్రవర్తుల యభ్యుదయమును గీర్వాణ వాణీముఖమున సమస్తవిధముల గీర్తించిరి.

ప్రౌఢదేవరాయలు కవిపోషకుడేగాక స్వయముగా కవిత్వమునుఁ జెప్పగల సమర్థుడు. "మహానాటక సుధానిధి'యను గ్రంథమును సంస్కృతమున సంధానించెను. ఆతనియాస్థానమున కల్లనాథుడను శైవకవి "సంగీతరత్నాకరము'నకు వ్యాఖ్యానమును, దేవనభట్టు "సంగీతముక్తావళిని' రచించిరి. ప్రౌఢదేవరాయల సోదరియగు హరియమ్మదేవికి మను

మడైన సాళువగోప తిమ్మన్న వామనుని కావ్యాలంకార సూత్రముల కొక విపులమగు వ్యాఖ్యను "కామధేను'వను పేరున రచించుటయేగాక "తాలదీపిక'యను సంగీతగ్రంథమునుగూడ సంతరించెను.

ప్రౌఢదేవరాయల కాలములో విజయనగరమందలి యాస్థానకవీశ్వరులును పండితులతోబాటు యితరరాజ్యములనుండి మహాకవీశ్వరులును, మహాపండితులును, యాసారస్వతపోషక చక్రవర్తి సత్కారముల బొందుటకు సారస్వత విజయయాత్రలు సలిపి రాజాదరణమును బొందుచుండిరి. రెడ్లరాజ్యమునుండి వెళ్ళి శ్రీనాథుడెట్లు కనకాభిషేకమును బొందెనో పైనజెప్పితిని. అట్లే ఓరుగంటిరాజ్యమునుంచి మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి విద్యానగరమునకుఁ బోయి దేవరాయలవల్ల గొప్పబహుమతులు బొందెను.

ప్రౌఢదేవరాయల యనంతరమున నాతనికుమారుడు మల్లికార్జునరాయలు రాజ్యమునకు వచ్చెను. ఆతను "రతిరత్నప్రదీపిక'యను కామశాస్త్రగ్రంథమును సంస్కృతమున రచించి చక్రవర్తి సముఖమున ప్రదర్శించెనట.

మల్లికార్జునరాయల తర్వాత విరూపాక్షరాయలు, ఆతని వెనుక రాజశేఖరరాయలు, ఆతనిపిరుంద రెండవ విరూపాక్షరాయలును విజయనగర రాజ్యమును పేరునకుమాత్రము పరిపాలించిరి. వీరికాలములో ముఖ్యసైన్యాధిపతియు, బహుసమర్థుడునగు సాళువనృసింహరాయలు నిజముగా రాజ్యధౌరేయుడై పదంపడి తానే సింహాసనారూఢుడయ్యెను. ఆమహాపురుషుని జీవితమును తద్వంశజుల చారిత్రమును నాతని యాస్థానసంస్కృత కవియగు అరుణగిరినాథ డిండిమభట్టారకుడు "సాళువాభ్యుదయమ'ను మహాకావ్యమును రచించినట్లు వెనుకనే యాకవి వంశచరిత్రమున నుదహరించితిని. నృసింహరాయలు "రామాభ్యుదయ'మను కావ్యమున రామాయణకథను కర్ణపేయముగ నభివర్ణించెను.

సాళువ నృసింహరాయలతర్వాత ఆతని చిన్నకుమారుడు రాజుగా నియమింపబడెను. గాని యాపిల్లవానికి సంరక్షకుడుగా తుళువ నరసరాయలు నియోగింపబడుటచే నరసరాయులే నిజమైనరాజుగా వ్యవహరించుచుండెను. ఈనరసరాయలు క్రీ. వె. 1500 వరకు రాజ్యమును వహించి పిదప తన జ్యేష్ఠకుమారుడగు వీరనృసింహరాయల కొప్పగించెను.

ఇటుతర్వాత విషయమంతయు నీగ్రంథమందలి రెండవభాగమున దెలుపబడును.

---

# ఉ పా ను బం ధ ము.

## సంస్కృతవాఙ్మయము.

భోగనాథునియొక్క మరొకపేరు భారతీకృష్ణతీర్థుఁడు కాని భారతీతీర్థుడు కాదని చెప్పవచ్చును. ఈభోగనాథుడు వ్రాసిన గ్రంథములు రామోల్లాసము, త్రిపురవిజయము, ఉదాహరణమాల, మహాగణపతిస్తవము, శృంగారమంజరి, గౌరీనాథాష్టకము, సర్వదర్శనసంగ్రహ మనుగ్రంథము శాయణాచార్యుని రెండవపుత్రుడైన మాధవుడు లేక మాయణుడు రచించెను. శ్రీకంఠపండితుఁడు లేక శ్రీకంఠనాథుడు అనునాతడు సాయణమాధవాచార్యుల గురువులలో నొకడు. ఈ శ్రీకంఠపండితుడు హేమాద్రికిని, శ్రీకరభాష్యమును రచించిన శ్రీపతిపండితునకును, చాలకాలము ముందే క్రీ. వె. 1118 ప్రాంతములలో నుండిన శ్రీకంఠ శివాచార్యునికంటె భిన్నుడు.

డిండిమభట్టారకుల వంశవృక్షము.

శోణాద్రి (1370) హరిహరరాయలు, బుక్కరాయల ఆస్థానకవి.

|

అరుణగిరినాథుడు, ఇతడు దేవరాయుల ఆస్థానములోనుండెను.

| విభాగరత్నమాల, యోగానంద ప్రహసనము, సౌం

| దర్యలహరి వ్యాఖ్యానము రచించెను.

మొదటి రాజనాథుడు: ఇతడు సాళువ నరసింహరాయల ఆస్థానకవి.

| సాళువాభ్యుదయము రచించెను.

అరుణగిరి లేక ఇతడు ఇమ్మడి నరసింహరాయల ఆస్థానములో

రెండవ శోణాద్రి. నుండెను. రామాభ్యుదయము, వీరభద్రవిజయ

| మును రచించెను.

రెండవ రాజనాథుడు: ఇతడు అచ్యుతరాయాభ్యుదయము, భాగవత

చంపువు రచించెను.

క్రీ. వె. 1420 లో దేవణభట్టు అను కవి స్మృతిచంద్రికను రచించెను. విద్యాతీర్థుని శిష్యుడగు నరహరి అను కవి కావ్యప్రకాశిక కు వ్యాఖ్యమును నైషధదీపికయును వ్రాసెను. క్రీ. వె. 1420 లో మహాదేవాచార్యుడు లోల్లుటవివరణ మనుగ్రంథము వ్రాసెను. క్రీ. వె. 1440 లో లక్ష్మీధరుడు సాహిత్యపారిజాతము, స్మృతికల్పతరు వను పుస్తకము రచించెను. విరించిమిశ్రుడు భారతార్ణవపోతమును వ్రాసెను. పురుషోత్తమ మహోపాధ్యాయుడు మాంసాద్వయజీవాతువను గ్రంథమును రచించెను. లక్ష్మణార్యుడను నాతడు ప్రాభాకరామృత వాహిని, ప్రభావళీఖండనను వ్రాసెను. విశ్వనాథ భట్టారకుడు నయవివేకదీపికను రచించెను. క్రీ. శ. 1530 ప్రాంతములలో ప్రతాపరుద్ర గజపతి, కృష్ణదేవరాయల ఆస్థానములలో నుండిన లక్ష్మీధరకవి ప్రతాపరుద్రగజపతి పేరున సరస్వతీవిలాసమను స్మృతిగ్రంథమును యవివేక భూషణము, యోగిదీపిక, లక్ష్మీధరము, మహానిబంధనము లేక మాన

ధర్మశాస్త్ర టీకయు, కర్ణావతంసము, బర్హావతంసము అను కావ్యములును, సౌందర్యలహరిమీద వ్యాఖ్యయు రచించెను. రెండవబుక్కరాయల కాలములోనున్న లక్ష్మణాచార్యులు వైద్యరాజవల్లభ అను గ్రంథమును వ్రాసెను.

---

# రెండవ అనుబంధము

---

## విజయనగర సామ్రాజ్యమందలి కన్నడవాఙ్మయము.

(క్రీ. శ. 1330–1500)

విజయనగరరాజ్యము ప్రారంభములో చాలవరకు కర్ణాటకరాజ్యముగా నుండెను, సంగమ వంశపు రాజులందరు కర్ణాటకులు. వారు ముఖ్యముగా కర్ణాటక భాషావాఙ్మయములను ప్రోత్సహించిరి. వారి శాసనములు సామాన్యముగా కన్నడభాషలో నుండెడివి. క్రమక్రమముగా తెలుగుదేశమును జయించినతరువాతను తెలుగుదేశపు రాజులగు సాళువ నరసింహరాయలు, తుళువ నరసరాయలు మున్నగువారు రాజ్యములో ప్రాధాన్యము వహించికొలందియు తెలుగు భాషయు తెలుగు వాఙ్మయమును ప్రాముఖ్యమునకువచ్చి శ్రీకృష్ణదేవరాయులకాలములో "దేశభాషలందు దెలుగు లెస్స" యను లోకోక్తి రూఢియైనది.

విజయనగర రాజ్యారంభము మొదలు తుళువ నరసరాయలు రాజ్యమునకు వచ్చినవఱకును (సం॥ 1380–1500) జరిగిన కర్ణాటక

వాఙ్మయమునుగుఱించి ముఖ్యముగా ప్రసిద్ధకవులును, వారి గ్రంథముల గుఱించిమాత్రము- క్లుప్తముగా నిచ్చట వ్రాయుచున్నాను. హరిహరరాయల కాలములో నాగరాజు (1331) అను జైనకవి 'పుణ్యాశ్రవచంపు' యను కర్ణాట ప్రబంధమును రచించెను. దీని యందనేక నీతికథలున్నవి. ఒక్కొక్క నీతిని యుదహరించుట కొక్కొక్క పౌరాణిక పురుషునిచరిత్రమును వ్రాసెను.

ఈ హరిహరరాయల కాలములోనే మంగరస యను జైనకవి పుంగవుఁడు (1340) "ఖగేంద్రమణి దర్పణము" వైద్యగ్రంథమును కందవృత్తముల రూపమున వ్రాసెను. అటుతర్వాత బుక్కరాయలు I కాలములో నాస్థానకవియగు భీమకవియును ఆరాధ్య బ్రాహ్మణుడు 'బసవపురాణమును' చక్కని మృదుమధురశైలిని రచించి వీరశైవ మతమునకు మేలొనగూర్చెను. ఇంక బాహుబలి పండితుఁడు, కేశవ వర్ణి, గురుదేవుడు మున్నగు కవులు వేరువేరు గ్రంథములు రచించిరి.

బుక్కరాయుని కుమారుడగు రెండవ హరిహరరాయల కాలములో ఆతని యాస్థాన కవియు ముద్ద దండాధిపతికి యాశ్రితుడు నగు, మధురుడు 'ధర్మనాథ పురాణము, "గుమ్మటస్తుతియు' నిత్యాది గ్రంధములను రచించెను. ఈకవి జైనమతావలంబకుడు. కావున జైన గురువులలో నొకరగు ధర్మనాథుని చరిత్రమును ప్రబంధరూపముగా రచించెను. ధర్మనాథ పురాణము చాల ప్రౌఢమై హృదయంగమముగా నున్నది. రెండవ హరిహరరాయలు సోదరుడగు కంపభూపతికి కుమారుడగు దీపరాజు యొక గొప్ప కన్నడకవి. ఆతను "సొబగిన సోన' యు, "అమరుక' మను రెండు పద్య కావ్యములను రచించెను. ఈతని కవిత్వము సులలితముగా నుండి శృంగార రస పూరితముగా నున్నది. ఈకవి ప్రథమ దేవరాయల కాలములోని వాడని చెప్పవచ్చును. కావున నాంధ్రకవి సార్వభౌము డగు శ్రీనాధునకు సమకాలికుడు. ఈకాలము

లోనే మల్లన యను వీరశైవకవి "రేవణ సిద్ధేశ్వర చరిత్ర"మును రచించెను. ప్రథమదేవరాయలతర్వాత నాతని కొడుకగు విజయరాయలుఒక్క సంవత్సరముమాత్రమే రాజ్యము చేసి మృతినొందెను. ఆతని తర్వాత నాతనిపుత్రుడగు ప్రౌఢదేవరాయలు విద్యానగర సింహాసనము నధిష్ఠించి (1423-1446) వరకు రాజ్యముచేసెను. ఈతని కాలమున రాజ్యము సమస్త విధముల సంపూర్ణమైన యుత్కృష్ట దశకు వచ్చినది. ఈమహారాజు కాలములో కర్ణాటక వాఙ్మయమును అత్యుచ్ఛస్థితికి వచ్చినదని చెప్ప వచ్చును. ఈనృపాలుని యాస్థానమున ననేకులగు కవీశ్వరులును, పండితులును, మతగురువులును పోషింప బడి హిందూవాఙ్మయమును, హిందూకళను విశేషముగా వృద్ధినొందించిరి. ఆంధ్రకవీశ్వరులు గూడ యీతనికాలమున పెక్కు కృతులను రచించిరి. విక్రమార్క చరిత్రకృతి కర్తయగు జక్కన యీతని కాలమున నుండెనని జెప్పవచ్చును.

ప్రౌఢ దేవరాయులకాలముననున్న కర్ణాటక కవులలో నగ్రగణ్యుడు మహాభారతమునందలి మొదటి పది పర్వములు రచించిన కుమారవ్యాసుడు ఆతని నిజ నామము నారణప్ప. ఆతడు గదుగ పురమందలి వీరనారాయణస్వామి భక్తుడు. తానురచించిన మహాభారతము నీ వీరనారాయణస్వామికి యంకితము చేసెను. ఆ కవి తనగ్రంథ మంతను భామినీ షట్పది వృత్తములో రచించెను. ఆతడు ఐరావతచరిత్ర మను మరియొక గ్రంథముగూడ రచించెనని తెలియ వచ్చుచున్నది. ఆమహాకవి రచించిన భారతము కన్నడ దేశమందుఁ జాలగౌరవింపబడు చున్నది. కవిత్వము నవరసభరితముగానుండి నిరర్గళధారా ప్రవాహమును బోలియుండును. తిక్కనాదు లాంధ్రమహాభారతమును రచించినట్లీ కవియు కేవల భాషాంతరీకరణముఁ జేయక స్వతంత్రకల్పనలనుఁ జేర్చిరచించెను.

ఆకవికి సమకాలికుడును ప్రత్యర్థిగానునుండిన చామరసు తన "ప్రభులింగలీల" యను శైవ ప్రబంధమును ప్రౌఢదేవరాయలు సభయందు చదివి గౌరవమును బొందినట్లు చెప్పికొనెను. ఇది పాల్కురికి సోమనాథుని తెలుగు ప్రబంధమగు "ప్రభులింగలీల"కు కన్నడీకరణము కావచ్చును.

మగ్గెయ మాయిదేవుడు, శతకత్రయము, షట్స్థల గద్య, యిత్యాదిగ్రంథములను, గురు బసవకవి శివయోగాంగభూషణము, సద్గురు రహస్యము, మనోవిజయ కావ్యము! యిత్యాది గ్రంథములను రచించి ప్రౌఢదేవరాయల కాలమున వీరశైవ మతమునకు ప్రబలమైన ప్రతిష్ఠాపకులుగానుండిరి. బత్తలేశ్వరుడను మఱియొక వీరశైవ కవియు రామాయణాది గ్రంథములు నీకాలమందే రచించినట్లుకాన్పించుచున్నది. కరస్థలదనాగిదేవకవి త్రివిధియను వీరశైవ గ్రంథమును రచించెను. ఈతను అగసాలికులస్థుడు. ప్రౌఢదేవరాయల కాలమున ప్రతిష్టనొందిన నూటఒకటి వీరశైవవిరక్తులలో నీతడొకడు.

ఆనుహారాయలు స్వయముగా కన్నడవాణిని ప్రోత్సహించుటయేగాక తనయమాత్యులను, దండనాయకులను, సామంతరాజులను గూడ కన్నడ వాఙ్మయమునకు గేలూత నిచ్చునట్లుజేసెను. తనదండనాయకుడగు లక్కణుడును, యమాత్యశేఖరుడగు జక్కనార్యుడును, స్వయముగాఁ కన్నడ గ్రంథములను రచించిరి. లక్కణుడు శివతత్వచింతామణి యను గ్రంథమును రచించెను. అందు నిత్యానిత్యవస్తువివరణము, సకలనిష్కల విచారము, శివలీలలు, శివలోక వర్ణనము, బసవచరిత్రము, యిత్యాది శైవమంత సంబధ విషయములున్నవి. శైలిచాల మనోహరముగా నున్నది జకనామాత్యుడు "నూరొందుస్థలవు" అను శైవగ్రంథమును రచించెను. ఇదియు కమ సులభశైలిని వ్రాయబడి సర్వజనాహ్లాదకరముగా నున్నది. ప్రౌఢదేవరాయుని మఱి

యొక యమహాత్ముడగు గురురాయుడు చంద్రకవి రచించిన "విరూపస్థానము"ను చంపూప్రబంధము సంకితమొందెను. ఈచంద్రకవి 'గురుమూర్తి శంకర శతకమను' వేఱొక గ్రంథమును గూడరచించినట్లు కాన్పించు చున్నది. ఇట్లు ప్రౌఢదేవరాయల కాలములో కర్ణాటక వాఙ్మయ మద్భుతమైన వృద్ధిగాంచినది. ముఖ్యముగా వీరశైవమత గ్రంథములే రచింపబడినవి.

ప్రౌఢదేవరాయలు తర్వాత అతని కుమారుడగు మల్లికార్జున రాయలు (1447--1465)రాజ్యము చేసెను. ఈరాయల యాజ్ఞానుసారముగా కల్లరసు యనుకవి 'జనవశ్య'మను కామశాస్త్రగ్రంథమును వ్రాసినట్లుగా చెప్పికొనినాడు. ఈకామశాస్త్రగ్రంథమును మల్లికార్జునరాయలు స్వయముగా తన భార్యకుపదేశించెనట. దానిని యీ కవి విస్తరించి వ్రాసెనట. దానినిబట్టి యేవిధముగా ప్రౌఢదేవరాయల తర్వాత తన కుమారుడు స్త్రీలోలుడై కామశాస్త్ర ప్రవీణుడై, పౌరుషహీను డయ్యెనో, తెలియవచ్చు చున్నది. ప్రౌఢదేవరాయలు మత్తగజములను వేటాడెను. అతని కొడుకు మత్తేభగమనలగుస్త్రీలను వెన్నంటెను. తనభార్యలకు కామశాస్త్రముపదేశింప నవసరమైనది. తనయంతిపురముతో దృప్తి నొందక యీమహాశాస్త్రమును జనులందరకు బోధన చేయుటకై కల్లరసును తానుబోధించిన యీమహాశాస్త్రమును కావ్యరూపముగా రచింప నాజ్ఞాపించెను.

ఈమల్లికార్జున రాయల కాలమునలో బొమ్మరసు యనుశైవకవి 'సౌందరపురాణ'మను శైవగ్రంథమును, చతురాస్య బొమ్మరసు యనుకవి 'చతురాస్యనిఘంటువు' రచించెను.

మల్లికార్జునరాయల తర్వాత నాతనిసవతి తమ్ముడు విరూపాక్షరాయలు (1467--1478) రాజ్యమునకువచ్చెను. ఈతని కాలములో తోంటదసిద్ధేశ్వరుడు అను వీరశైవకవి 'షట్సలజ్ఞానామృతసార' మను

వచన గ్రంథమును వీరశైవ సిద్ధాంతమును వ్యాపింపజేయుటకు రచించెను. ఈకవి సమకాలికుడగు గుబ్బియమల్లణ 'గణభాష్యరత్నమాలయు' వాతుల తంత్రటీక'యు నను వచనగ్రంథములను రచించెను. ఈయిద్దరు కవుల మూలముగా వీరశైవ సిద్ధాంతముట జదువలేని పామరజనులకుగూడ సులభగ్రాహ్యములైనవి.

విరూపాక్షరాయల తర్వాత నతనిజ్యేష్ఠకుమారుడగు రాజశేఖరుడును, యతని తర్వాత రెండవకుమారుడగు రెండవవిరూపాక్షరాయలును నామమాత్రముగ, రాజ్యముఁ జేసిరి; గాని సర్వాధికారమును దండనాయకుఁడగు సాళువ నృసింహరాయుల వరగతమయ్యెను. ఈనృసింహరాయల కాలములో బొమ్మరసు యను జైనకవి 'సనత్కుమార చరిత్రము' ను, నీలకంఠాచార్యుడు 'ఆరాధ్యచారిత్రము' ను రచించిరి. వీరిద్దరికంటె ముఖ్యుడగు లింగకవి తానునృసింహరాయని యాస్థానమునం దాస్థానకవిగా నుండినట్లు చెప్పికొనెను. ఆతను కామశాస్త్రమందుఁ జాలప్రవీణుడట. శృంగార రసప్రధానమగు'కవిలింగన పదములు' అను పద్యగ్రంథమును రచించెను.

సాళువనృసింహరాయలు తర్వాత అనగా సుమారు 1500 సం॥ ప్రాంతమున విజయనగర రాజ్యము తుళువ వంశతిలకుడగు నరసరాయల యధీనమయ్యెను. ఈనరసరాయల కాలములో చతుర్ముఖబొమ్మరసు 'రేవణ సిద్ధేశ్వరపురాణము' ను, కుమారవాల్మీకి యను బిరుదనామము గల నరహరికవి' వాల్మీకి రామాయణమును కన్నడ భాషయందు రచించిరి. వీరికి సమకాలికులగు కొందరుకవులు, సింగిరాజు, సురంగకవి, మాధవుడు, చాకరాజు, బొచరసు, యిత్యాదులు వేరు వేరు గ్రంథములను రచించిరి.

తుళువనరసరాయలు తర్వాత నాతని కుమారులగు వీరనృసింహరాయలును, కృష్ణదేవరాయలును వరుసగా రాజ్యముఁ జేసిరి. వారికాల

మందలి కర్ణాటకవాఙ్మయ చరిత్రమీగ్రంథమందలి రెండవభాగ మున జేరును. పైన జూపిన గ్రంథముల బట్టియు, గ్రంథకర్తల బట్టియు, ముఖ్యముగా ద్యోతకమైన విషయములేవనిన:

విజయనగర సామ్రాజ్యము నందుసంగమవంశపురాజుల కాలములో ఆంధ్రవాఙ్మయము కంటె కర్ణాటకవాఙ్మయ మెక్కువగ విజృంభించినది.

ఈకర్ణాటక వాఙ్మయమందు ముఖ్యముగా వీరశైవకవులును, వీరశైవమత గ్రంథములును బహువిస్తారముగా నున్నవి. మతగ్రంథములుకానివి చాల తక్కువ. వీరశైవ మతము తర్వాత కొంతవఱకు జైన మతగ్రంథములు కాన్పించుచున్నవి. బ్రాహ్మణ మత సంబధమైన కవులును, గ్రంథములును, చాలతక్కువగనున్నవి. చరిత్రాత్మక కథా గ్రంథములుగాని, మిశ్రమకథారూపములుగాని ఆంధ్ర వాఙ్మయమందువలె యీకర్ణాటక వాఙ్మయమం దీకాలమున కానము.

---

# మూడవ అనుబంధము

## విజయనగర సామ్రాజ్యమందలి అఱవ వాఙ్మయము

క్రీ. వె. (1330-1600)

విజయనగర రాజ్యము ప్రారంభములోఁ జాలవఱకు కన్నడ దేశమును, కొంతవఱకు ఆంధ్రదేశమును లోగొనియుండెను. కావున ప్రి

థమ దశలో నెక్కువగా కన్నడ వాఙ్మయమును గొంతమట్టుకు ఆంధ్ర వాఙ్మయము ఈనా రాజ చంద్రులు పోషించినవారు. అయినను, మొట్ట మొదటి నుండియు విజయనగర రాజ్యమునకును అరవదేశమునకునుఁ గొంత సంబంధముండినట్లు కాన్పించుచున్నది. చిత్తూరుజిల్లా చంద్రగిరి లో రాజ్యము చేయుచుండిన సాళువవంశము వారగు రాజులు అఱవ దేశమును గొంతవరకు పరిపాలించుచూ, విజయనగర రాజ్యములో సామంతరాజులుగానుండిరి. చోళదేశాధీశుఁడగు శంభురాయుడు తనకు వైరిగా నుండి నందువలనను మధురాపురమును మహమ్మదీయు లాక్రమించుకొని హిందూ రాజులకు కంటకులుగా నుండి నందువలనను చంద్రగిరి రాజగు సాళువ మంగు తన చక్రవర్తియగు ప్రథము బుక్క రాయుని కొడుకగు కంపరాయని సహాయము తీసికొని దక్షిణ దిగ్విజయమునకై దాడివెడలెను. అప్పుడు శంభురాయుని జయించి మధురా పట్టణమునందున్న మహమ్మదీయ సుల్తానునిఁ బరిమార్చి చోళ పాండ్య దేశములను శంభురాయుని కొప్పగించి తమకు యాజ్ఞానువర్తిగానుండ నియమించి తిరిగివచ్చెను. గావున విజయనగరరాజ్యమునకు ప్రారంభదశనుండియే అఱవభాషతోఁ గొంతసంబంధముండియుండెను. సామ్రాజ్యమునకు ముఖ్యస్థానమగు విజయ నగరమందు ప్రథమమున ద్రావిడ కవులుండినట్లు దృష్టాంతములింకను కాన్పించుటలేదు. గాని చంద్రగిరిలోనుండిన సామంతరాజులగు సాళువ వంశస్థులందరు ఆంధ్ర వాఙ్మయముతో బాటుఁ అఱవ వాఙ్మయమును గూడఁబోషించుచు వచ్చినట్లు నిదర్శనములు కాన్పించుచున్నవి. మల్లికార్జునరాయుల కాలములో చంద్రగిరిలో రాజప్రతినిధిగా నుండిన సాళువ తిరుమలరాయుడు అఱవ భాషలో గొప్ప పండితుడును, అరవ వాఙ్మయమునకు గొప్ప పోషకుడుగా నుండెను. అతనికాలము క్రీ. వె. 1450- సం అని చెప్పవచ్చును. కాలమేఘుడను అఱవ కవీశ్వరుడా రాజ కవి పుంగవునెడ తన యాశు ధారాధీశక్తు లనేకవిధముల నుతించుకొ

నెను. ఆరాజు మొదటలో నమ్మకపోయినను క్రమక్రమముగా బరిశీలన జేసి యీకవిని విశేషముగ శ్లాఘింప సాగెను.

అటు తర్వాత శ్రీకృష్ణదేవరాయల కాలములో అఱవ కవీశ్వరులుకూడ విశేషముగా సాహిత్యవిలాసుడగు చక్రవర్తిచే సన్మానింపబడిరి. కళింగదేశముపై దండెత్తి ప్రతాపరుద్ర గజపతిని డిందు పఱచి యాతని పుత్రికయగు దుర్గాదేవిని పాణిగ్రహణ మొనర్చి విజయ భేరి వేయించి నపుడు కుమార సరస్వతి యను నఱవ కవీశ్వరుడా రాజకేసరి యాస్థానమునందుండి యాదుర్గా శ్రీకృష్ణపరిణయమును సమయోచిత శ్లేషగర్భితముగ బద్యరూపమున వర్ణించి పుష్కలముగ సన్మానితుడయ్యెనట.

సుధామణి నిఘంటు నిర్మాతయగు మండలపురుషుడును, జ్ఞానప్రకాశుడను యోగివర్యుడును శ్రీకృష్ణదేవరాయల కరుణాపాత్రులయి యాంకేనిని విశేషముగ నుగ్గడించిరి. జ్ఞానప్రకాశకవి 'మంజరిప్ప' యను కావ్యమునందు యారాజచూడామణి పరముగ జెప్పెను. ఇంకతత్త్వప్రకాశుడను మరియొక అఱవ కవియు, ఇరుసమయవిలక్క 'మను ద్రావిడ ప్రబంధమును. శివకేశవ సమన్వయముగ రచించిన హరిదాసుడను కవియు కృష్ణదేవరాయలచే ననేక బహుమానములను బొందినట్లు జెప్పుకొనిరి. హరిదాసు కవి శ్రీకృష్ణదేవరాయలు స్థాపించిన సింహాచల జయస్తంభమును గురించి కూడనభివర్ణించెను.

శ్రీకృష్ణదేవరాయల తర్వాతఅచ్యుత దేవరాయల కాలములోను, సదాశివరాయల కాలములోను విఠ్ఠల దండాధిపతి యనునాతడు కేరళ దేశమును జయించిన తఱి యొకయఱవ కవీశ్వరుడా విఠ్ఠల చమూపతి శౌర్య పరాక్రమములను స్తోత్రము జేసెను.

మరియూ నాసామ్రాజ్యములో సంతర్భాగములుగానున్న తంజావూరు మధుర రాజ్యముల నేలుచువచ్చిన నాయకరాజుల యాసానము

లయందనేక యఱవ కవీశ్వరులు వెలయుచుండిరి. తిరుమలనాయకుని విద్వత్సభయందు కుమారగురు పరముని యను గొప్ప యఱవకవీశ్వరుడు శ్రీమీనాక్షీదేవీస్తవముఁ గడుంగడు సొంపుజేసెను. అంతతిరుమలనాయకుని యనేక విధముల సంస్తవించెను. మఱియు 'కులప్పనాయకంకడల్' యనియు 'విరలి పీడుతుడు' యనియు అఱవ ప్రబంధములీనాయక రాజుల కాలములోనే రచింపబడినవి.*

---

# నాల్గవ అనుబంధము.

---

## మహారాష్ట్ర వాఙ్మయము

విజయనగర సామ్రాజ్యము మహారాష్ట్రదేశములో గూడ కొంతవరకు విస్తరించినది గాన మహారాష్ట్రవాఙ్మయముతోడిసంబంధము ఈరాజులకు కలిగియుండెను. గాని నాకునిశ్చయ మయినట్టి వంటివిషయములు దొరకినవిగావు, యేయే కవీశ్వరులువిజయనగరరాజుల యేలుబడిలో యేయేగ్రంథములు రచించిరో ఆసంగతులను పరిశీలించి సేకరింప దగియున్నది. ఆ విషయములను పరిశోధకులెవరయినను తెలియపరచిన యడల కృతజ్ఞతాపూర్వకముగా నాగ్రంథమందుఁ జేర్చుకొనెదను.

---

* మార్చి ఏప్రిల్ 1928 సం॥ త్రివేణి సంచికలనుండి సంపాదితము.

# తప్పొప్పుల పట్టిక.

---

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| సాయంతము | సాయంతనము | v | 16 |
| హరిహరరాయలు I (1335—1350) | హరిహరరాయలు (1335—1356) | 1[illegible] | 11 |
| బుక్కరాయలు I (1350—1377) | బుక్కరాయలు I (1356—1377) | 11 | 11 |
| క్రీ. శ. 1350 | క్రీ. శ. 1356 | 11 | 14 |
| గ్రమకమోదిత | గ్రమక్రమోదిత | 30 | 1 |
| గొన్నిగొన్ని | గొన్ని | 69 | 13 |
| విటవిటీ | విటీవిట | ,, | 20 |
| తెనిగించిరి | | 115 | 8 |
| సహిష్ణత | సహిష్ణుత | 120 | 16 |
| హితాకార్యము | హితకార్యము | 122 | 10 |
| పదునేడవ | పదునేనవ | 123 | 23 |
| Add | | 124 | 19 |

తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
కును దనూజుడవు పోతనకును నెఱ్ఱ
నామాత్యవరునకు ననుగు దమ్ముండవు
శాండిల్యగోత్రు డౌసరసమతివి

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| గీ. చెప్పనేర్తువు కృతులు సుస్థిరముగాఁగ<br>గాన నీవు రచింపంగఁ గడఁగియున్న<br>నాసికేత చరిత్రంబు నాదుపేర<br>నంకితముసేయు కవిరాజులాదరింప. | | | |
| సాధారణము | సాధారము | 1[illegible]5 | 12 |
| జీవితవిషయముతో | జీవితవిషయములో | ,, | 13 |
| శ్రీనాథుడు | వల్లభరాయడు | 168 | 4 |
| వ్రాయని | వ్రాయనియ్య | 172 | 25 |
| కానిని | కాదని | 181 | 6 |
| చున్నది | చున్నవి | 182 | 20 |
| ప్రబద్ధుడై | ప్రబుద్ధుడై | 218 | 18 |
| కుశలిహస్త | కులిశహస్త | 272 | 7 |
| సిష్టాత్ములు | సిష్ణాతులు | ,, | 20 |
| 1380-1500 | 1330-1500 | 299 | కడపటి పంక్తి. |

# ఈగ్రంథకర్తచే రచింపబడిన పుస్తకములు

| | రు. అ పై |
|---|---|
| ఆంధ్రపదములు, పాటలు | 0—4—0 |
| ఆంధ్రనాటకములు, రంగస్థలములు | 0—6—0 |
| విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము (ప్రథమభాగము) | 2—0—0 |
| పింగళిసూరనార్యుని కవిజీవితము (ఆంగ్లము) (ముద్రణములోనున్నది) | |

# ఓరుమల్ల కామేశ్వరరావు బి. ఎ. బి. ఇడి. గారి పుస్తకములు

| | |
|---|---|
| పాతపాటలు | 0—2—0 |
| కలువలు | 0—4—0 |

## 1. ఆంధ్రపదములు, పాటలు.

"................................ నిజముగ మ. రా. శ్రీ ఓరుమల్ల అచ్యుతరావుపంతులు ఎమ్. ఎ. ఎల్‌టి. గారిచే విరచింపబడ్డ "ఆంధ్రపదములు పాటలు" అను విమర్శనగ్రంథరాజము తెనుగుబాసకిత్తరిని చక్కానివంటిదనవచ్చును. అయ్యది పతత్సరళోదితంబులను చక్కగా విభజించి, అందలిగుణగణంబులను తులదూచి నట్లుగ

సరిజూచి సాధుశైలినిమనముందు నిసర్గగానలహరీ వీచికలనద్దరినుండి యిద్దరికి దేలించుచున్నది. ఆంధ్రమహాశయులెల్లరు అందలిహెచ్చరిక ను గమనింతురుగాక!"

కవికొండల వెంకటరావు బి. ఏ బి. ఎల్.

## 2. ఆంధ్రనాటకములు, రంగస్థలములు.

"శ్రీ కురుమెళ్ల అచ్యుతరావుపంతులు ఎమ్. ఎ. ఎల్ .టిగారు రచించిన యీ'ఆంధ్రనాటకములు' అను విమర్శగ్రంథమునందు నాటకముల ప్రయోజనములు ప్రదర్శనపద్ధతులును ఇప్పటి తెలుగునాటకముల గుణదోషములును విపులముగను వివేకముతోడను చర్చింపబడినవి. నాటకములు వ్రాయువారును, నాటకములనాడువారును, నాటకము లనుచూచువారుగూడ ఈచిన్నిపుస్తకమును జదివి లాభమును పొంద గలరు. తెలుగునాటకములకు త్రోవజూపిన ఆంగ్లసంస్కృతినాటకముల రీతులందు ప్రాస్తావికముగ నుగ్గడింపబడినవి....................."

విద్వాన్ గరిమెళ్ల సోమన్న ఎమ్. ఎ. ఎల్. టి.

".........ఈ చిన్నగ్రంథము 'ఆంధ్రనాటకములు' అని పరిమితార్థక నామము ధరించినను లోనఁ బరిశీలింప నాటకతత్త్వమునగ్రంథి స్థానముల భేదించు విమర్శగ్రంథమై "నాటకతత్త్వసారము" అను నామమునకుఁ దగియున్నది. ఇందు స్థూలముగా నాటక తత్త్వము, కథానిర్మాణము, పాత్రముల శిలపప్రతిష్ఠాపనము సుఖాంతదుఃఖాంతవిభాగవిచారము, ప్రదర్శనపక్కి యను నైదంశములు చర్చింపఁబడినను బ్రసంగవశముగా నేఁటికాలపు వివాదాంశము లన్నియుఁ బరిష్కరింపఁబడినవి......."

మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఎ.

## BOOKS BY THE SAME AUTHOR.

| | | Rs. A. P. |
|---|---|---|
| 1. | Andhra Songs and Ballads | 0—4—0 |
| 2. | Andhra Dramas and Andhra Stage | 0—8—0 |
| 3. | The History of And Literature in the Vijayanagar ire. Part I | 2—0—0 |
| 4. | The Life and Writi f Pingali Suranarya (*in Engl* | (In the Press) |

— —

## BO s BY TEKUMALLA IESWARA RAO,
B. A., B. ED.

| | | |
|---|---|---|
| 1. | Pathapatalu, (Old N ry Songs) | 0—2—0 |
| 2. | Kaluvalu. .... | 0—4—0 |

☞ COPIES CAN BE D OF:—

**Mr. N. ΚΑΜΑ RAO, B. A.**
INNESPETA,
RAJAHMUNDRY.